IPLA133M124

# శివరంజని



ఇచ్ఛాపురపు రామచంద్రం

2/11/67
1362

★

"స్నేహ" సకుటుంబ మాసపత్రిక
జూలై నెల నవలానుబంధం

వర్షం వస్తే గొడుగులు విచ్చుకునేటట్లు- విషాదం ముసిరే సరికి వేదాంతం బయటపడుతుంది. గొడుగులయితే చాలా మందికే ఉండొచ్చు కానీ వేదాంతం అందరికీ అందదు. స్మశాన వైరాగ్యము ప్రసూతి వైరాగ్యమూ కాదు. అంతకంటే కొంత శాశ్వతమయినదీ, ప్రయోజనకరమయినదీ, ప్రతిభావంతమైనదీ.

కిటికీ అవతల సన్నగా చినుకులు పడుతున్నాయి.

ఆకాశం వేళ కాకుండానే చీకటి ముసుగు పెట్టుకుంటూంది. గదిలో - చిరుదీపమే వెలుగుతూంది. ముసురుకున్న చీకట్లను ఓడించడం ఆ చిన్న దీపానికి శక్తికిమించిన పనే ఔతుంది.

అతను - ఆనంద్ - కిటికీ దగ్గరే కూర్చున్నాడు. గదిలో చాలా చీకటిగా ఉందనీ, పెద్ద దీపంతో గది చీకటిని జయించ వచ్చుననీ అతనికి తెలియకపోలేదు.

కాని - హృదయాన్నావరించిన చీకటి సంగతేమిటి?

ఆ చీకట్లు తొలిగేదెలా?

ఎప్పటికి?

తెరలు తెరలుగా చీకటి.

జీవితాన్ని కాలం కబళించే తీరులో .... మెల్ల మెల్లగా గదిని నింపుతూంది చీకటి.

చేతికందే అంతమారంలో చక్కని మధువుంది. పాత్రా ఉంది. కాని - తాగాలనిపించడంలేదు. సరిగ్గా తన జీవితంలాగే. ఎక్కడో ఏదో లోపం ఉంది. అది తెలియటంలేదు. తెలుసుకోవాలని అన్వేషణ. తెలుసుకుని, పట్టాలు తప్పిన జీవన శకటాన్ని మళ్ళీ ప్రయాణాయత్తం చేయాలని ఆకాంక్ష. చేత కావడంలేదు.

అన్నీఉండి అనుభవించలేనిక్షనం.

ఏ నేరానికి శిక్షయిది ?

ఏ పాపానికి ఫలమిది ?

ఉహూఁ... తన జీవన గమనం రీతే అంత. చీకటిలో పుట్టి.. చీకటిలో సాగి... అంతేనేమో! ఈ బ్రతుక్కి ఆదీ, మధ్యా, అంతమూ కూడా అంధకారమే ఏమో!

మధువు ప్రసాదించే మైకం కంటే విషాదపు నిషాయే అతని కెక్కువ మత్తు గొల్పుతోంది. ఔను, మధువు శరీరాన్ని విశ్రాంతన్యం చేస్తుంది. విషాదం – హృదయాన్ని కరిగించి కొత్త కవాటాలు తెరుస్తుంది.

*  *  *

"నువ్వు – సరిగ్గా యిలాటి అమావాస్యనాటి అర్ధరాత్రే పుట్టావు. నాకింకా బాగా జ్ఞాపకం ఉంది. అబ్బ! ఎంత భయంకరమైన రోజది!"

ఆనంద్ ఉత్సుకతతో వినసాగాడు.

వేసవి....అమావాస్య రాత్రి... విద్యుచ్ఛక్తి సఫ్లరా లేదు. లోపల ఉక్క పోస్తుందని డాబా మీద పక్కలు వేసుకున్నారు – తనూ, అక్కయ్యా. బావగారు క్యాంపు వెళ్ళారు.

ఆనంద్‌కి పదమూడో పధ్నాలుగో – అప్పటికి.

"అంతకంటే భయంకరంగా 'అమ్మా' అన్న అమ్మ అరుపు... వెనువెంటనే క్యారుమంటూ కేక. నువ్వు పుట్టావు –"

"నేను పుట్టకపోతే ... అమ్మ బతికేదా?" అమాయకపు ప్రశ్న. అక్కయ్య కళ్ళనిండా నీళ్ళు – ఆకాశంలో అద్దే మెరియని చుక్కల్లా. ఆనంద్ తలని తన గుండెల కదుముకుంటూ– జుత్తులోకి వేళ్ళు పోనిచ్చి సున్నితంగా తల నిమురుతూ –

"లేదు కన్నా! అమ్మ ఏనాడో చచ్చిపోయింది. నాన్నగారితోనే. కాని....నాన్న చనిపోయేటప్పటికి నువ్వు అమ్మకడుపులో ఉన్నావు. అందుకే అమ్మ బ్రతికుంది – నువ్వు పుట్టేదాకా .... నీ కోసం ...."

"చచ్చిపోయేముందు నాన్న గారు కూడా కేకవేశారా అక్కయ్యా?"

"నాకు తెలీదు... నాన్న మనింట్లో చనిపోలేదు... "

"మరి ఎవరింట్లో చనిపోయారు?"

"ఆఫీసు నుంచి వస్తూ – లారీ కిందపడి. .."

"అమ్మో!"

"భయంలేదు కన్నా!" మరింత గాఢంగా గుండెల కదుము కునేది.

"అమ్మా నాన్నా లేకుండా నేనెలా బతికానక్కా ?"

"నేను లేనూ ! నేనుండగా నీకు భయమేమిటి ?"

"ఔను. నువ్వుండగా నాకు భయమెందుకూ ?" నవ్వేవాడు.

ఒక్కసారి - మబ్బులుతొలగి ఆరోగ్యకరమయిన ఎండ వచ్చినట్లు ఋద్దరి పెదవులమీదకీ నవ్వొచ్చి మెరిసేది.

వాతావరణం మారిపోయేది. కబుర్లు.... కులాసా మాటలు.

అలాగే పెరుగుదల, దేనికీ లోటులేకుండా.

అమ్మ లేకపోతే ఏం ? అక్కయ్య పదిమంది అమ్మల పెట్టు. అక్క మనసు అమృతభాండమే. ఎటొచ్చీ తను తెలివి తక్కువవాడు ఉహూఁ దురదృష్టవంతుడు. నిజంగా అంతే. వస్తువయినా, మనిషయినా దూరమయ్యాకతప్ప విలువ తెలుసుకో లేని దురదృష్టవంతుడు.

తను కనుగుడ్డయితే అక్కయ్య- ఆ కంటిరెప్ప. అంత కంటే గొప్ప.

కాలేజీ చదువయింది. ఎలాగ ? అక్కయ్య త్యాగాలతో. ఔను. అమ్మా,నాన్నా తనకు వదిలివెళ్ళిన నిధీ, పెన్నిధీ ఒక్కటే అక్కయ్య. ఆస్తిపాస్తులు చెప్పుకోదగినవేమీ సంక్రమింపజేయ లేదు. ఉద్యోగస్తుడు- నిజాయితీ మనిషయినప్పుడు- అతను పోయేటప్పటికి లెక్కా జమా చూసుకుంటే- అదృష్టవంతుల విషయంలో అటూ యిటూ తులతూగుతుంది. దురదృష్టవంతులకి- అప్పు మాత్రమే మిగులుతుంది. నాన్న- అప్పు మిగల్చలేదు. అది మాత్రం ఎంత కాదు?

అక్కయ్య త్యాగాలకి తను మిగిల్చిన ప్రతిఫలం ఏమిటి?

ఆ ప్రశ్న- త్రాచుపాము పడగెత్తినట్లు తలెత్తేసరికి ఆనంద్ తల సిగ్గుతో వాలిపోయింది. వర్షపుజల్లుకి తడిసిన టేబులు- చల్లగా తగిలింది; దుఃఖితుడికి సాంత్వనలాగ.

అవతల- వాన వర్షమైంది.

భర్తమీద కోపమొచ్చి ఏడుస్తున్న భార్యలా ఆకాశం ఘోరుమంటూ ఏడుస్తూంది. విషాదపు ధారలు హృదయంలోకి యింకినట్లు- వర్షధారలు భూమిలోకి యింకిపోతాయి. తెల్లవారితే చిహ్నాలు మాత్రమే మిగులుతాయి.

వర్షానికీ, తన జీవితంలోని సంఘటనలకీ అవినాభావ సంబంధముందేమో!

ఔను.

శివరంజనికీ, తన జీవితానికీ కూడా.

శివరంజని పట్ల తనకంత అమిత ఆకర్షణ లేకపోతే తన జీవితం ఎలాగ ఉండేదో, ఏమో?

చదువై ఉద్యోగపర్వంలో అడుగుపెట్టడానికి శతవిధాలా ప్రయత్నిస్తున్న రోజులవి. జీవితంలో తీపి పూత కరిగిపోతూ చేదుపొరలు బయటపడుతున్నాయి. ఉద్యోగంతప్ప గత్యంతరం లేదు. అదీ పరిస్థితి. ఉద్యోగం కోసం నానాపాట్లూ. ఉద్యోగం మీదే కాదు, జీవితం మీద కూడా విరక్తి పుట్టేసేది. చదువుకున్న చదువుమీదా- తెచ్చుకున్న డిగ్రీ మీదా పట్టలేనంత కోపం, చిరాకు. బతుకుబండి గాడి తప్పిందేమో అన్న భయం. భవిష్యత్తులోకి చూడబోతే చీకటి చీకటి చీకటి. అంతా నిరుత్సాహం, నిరాశ.

ఒక్కొక్క- రిజెక్ట్ పెస్టు.... ఇంటర్వ్యూ....ఆశాభంగం.
నిరాశావాదపు ఊబిలోకి జారిపోతూ జారిపోతూ....
కళ్ళల్లో కాంతి తరిగిపోతూ తరిగిపోతూ...
జీవితంలో చైతన్యం చెదరిపోతూ చెదరిపోతూ..
రేపుమీద ఆశ కరిగిపోతూ కరిగిపోతూ...
మనిషిలో ఉత్సాహం అడుగంటిపోతూ అడుగంటిపోతూ ...

"ఏమిటలా ఐపోతున్నావు రోజురోజుకీ?" అక్కయ్య లాలన.

"ఊ..." మౌనంలాంటి మూలుగు.

"ప్రేమించేవా?"

ఏడవాలో నవ్వాలో తెలియని ఆలోచనలను కదిల్చే ప్రశ్న.

ఏడుపుని దాచుకుని — నవ్వుని నటించడం. గొణుగుడు.
"అదొక్కటే తక్కువ."

"ఎందుకంత నిరాశ?"

"ఉద్యోగం దొరక్క.."

"దొరక్కేమౌతుంది? ఇవాళ కాకపోతే రేపు. కొంచం అటూ యిటూ.."

"ఇంకెన్ని రేపులు?"

"తొందరపడితే ఎలా? మధురమయినవీ, విలువైనవీ ఆలస్యంగానే లభిస్తాయి."

ఆశను రేకెత్తించే ప్రయత్నం.

జీవితపు ప్రమిదెలో ఆశాతైలం నింపుతూ, అక్కయ్యే ఉండకపోతే తను ఏమయ్యేవాడో?

నిజంగా తన జీవనజ్యోతి రెపరెప లాడుతూ ఆరిపో బోతూంటే అతి జాగ్రత్తగా రక్షించింది అక్కయ్య.

ఆ వయ సటువంటిది.

ప్రమాదకర మయినదీ, ప్రతిభావంత మయినదీ కూడా ఐన యౌవనం. ఆవేశం ఎక్కువా, ఆలోచనా ఎక్కువే, కాని ఆరాటం!

ఆత్రుత అన్ని సందర్భాలలోనూ అనర్థాలకే దారి తియ్యాలనీ, తీస్తుందనీ ఎక్కడుంది? పరిణామాలూ, ఫలితాలూ నిర్ణయించవలసింది కాలం. దానికోసం ఎదురుచూడడమే. నిరీక్షణ! ఇక్కడే సహనం కొంచెం అవసరం. ఈ ప్రాథమిక సత్యం — గ్రహించ గ్గినా— అమలు జరపలేక పోవడం తన బలహీనత.

"ఇంటర్వ్యూ కార్డు వచ్చింది చూశావా?"

సాయంత్రం- రోడ్లు సర్వే చేసి— చీకటి పడ్డాక యింటికి రాగా— అక్కయ్య అందించింది శుభలేఖ.

"లేదు" చదివి, "ఎల్లుండే ఇంటర్వ్యూ!"

"మరి — ప్రయాణం ఎప్పుడు?"

"రేపు.. పొద్దున్నే—"

ఆ రాత్రి ఎంతకీ నిద్ర రాలేదు. ఆలోచనలు... ఆశలు..

శయాలు.. ఆ త్రతత...పక్కగదిలో అక్కయ్య చాలా రాత్రివరకూ యిస్త్రీ చేస్తూనే ఉంది.

తను ఆలస్యంగా లేచాడు. ముఖం కడుక్కుంటూంటే- అప్పటికే వీధిలోకి వెళ్ళివచ్చినట్లున్నారు బావగారు. వస్తూనే అక్కయ్య చేతికి కొన్ని నోట్లు అందివటం తను చూశాడు. కొంచం ఆశ్చర్యం వేసింది.

ఆయన పెద్ద ఉద్యోగస్థు డేమీకాడు. కనీసం ప్రభుత్వో ద్యోగి అయినా కాడు. నెలాఖరు రోజులలో ఆయన కంత డబ్బు ఎలా వచ్చిందో? హార్దికంగా ఆయనెంత మంచివాడయినా ఆర్థి కంగా స్తోమత కలవారు కారు. ఆయనకున్న అపరిమిత సంపద మంచితనం. ఆ నీడనే పెరిగాడు తను.

"ఇంత ఆలస్యంగా లేచావేం, ప్రయాణం పెట్టుకుని?" అడిగిందక్కయ్య.

ఏం చెబుతాడు తను? ఆ త్రతత నిద్రను రానివ్వను. భవి ష్యత్తు గురించి ఆలోచిస్తూ ఉండి పోయానని చెబితే- అక్కయ్య బాధ పడుతుంది.

నవ్వి - ఊరుకున్నాడు.

"తొందరగా స్నానం చేసిరా. భోజనం చేద్దువుగాని-"

వాచీ చూసుకున్నాడు. తొమ్మిదిన్నర.

రైలుకి మరో గంట మాత్రమే ఉంది. మెయిలులో ప్రయాణం త్వరగా ఔతుంది. ఒక్కడే కనుక ఎలాగో ఒకలాగ కూర్చుందుకు కాకపోయినా నిలుచునేందుకయినా పీటు దొరక్క పోదు.

గెడ్డం గీసుకుని- స్నానం చేసి- భోజనం కానిచ్చేసరికి- అక్కయ్య బ్రీఫ్ కేసు సిద్ధంగా ఉంచింది.

"ఇదెక్కడిది?"

"తెచ్చాను పక్కఇంటి వాళ్ళనడిగి. చూడూ ... రెండ జతల బట్టలు సర్దాను. లుంగీ, టవలూ, సబ్బూ, దువ్వెనా పౌడరూ... కొంచం జాగ్రత్తగా వెతికితే నీకు కావలసినవన్నీ దొరుకుతాయి.ఏం?"

"అలాగే."

"ఇదిగో డబ్బు. జాగ్రత్త సుమా! అసలే రోజులు బాగు లేవు."

"ఫరవాలేదక్కయ్యా." చిరునవ్వు నవ్వాడు.

"బెజవాడలో - ఎక్కడుంటావు?"

"స్నేహితులు లేకపోలేదు కానీ ... హోటల్లో దిగడమే నయం అనుకుంటాను."

"అదే మంచిది. పరాయి యిళ్ళల్లో నువ్వు హాయిగా ఉండలేవు. అసలే మొహమాటం నీకు. చక్కటి హోటల్లో దిగు"

అనుకోకుండా ఆమెవైపు చూశాడు.

అక్కయ్య చేతులకి గాజులు లేవు. బంగారపు గాజులు....

హృదయం ద్రవించింది. కొన్నిక్షణాలు నోటిమాట రాలేదు.

ఈ అనుబంధా లెంత అమూల్యమయినవి! మమతా మమకారాల ముందు స్వార్థము నిలవలేదు. ఈ మమతలూ మమకారాలూ అనుబంధాలూ లేకపోతే మనుషు లెలా జీవించేవారో, తన గతి ఏమయ్యేది? తనను కని కన్ను మూసిన అమ్మ.... తనని పెంచడం కర్తవ్యంగా బాధ్యతగా స్వీకరించి, దాని నిర్వహణలో స్వసుఖాలనుకూడా మరచిపోగల్గుతున్న అక్కయ్య.... ఆమె మాట కెదురుచెప్పక ఆమెతోపాటు తానూ ప్రేమించే బావగారు.

ఈ యిద్దరు అమృతమూర్తులూ లేకపోతే తన జీవితం ఏమయ్యేది? ఆ ఆలోచన అతని గుండెలను కుదిపి వదిలింది.

"నేను ఆశీర్వదిస్తున్నాను. ఈసారి తప్పకుండా నీకు ఉద్యోగం వస్తుంది. క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరా."

బయలుదేరాడు. గుమ్మం దిగేసరికి అక్కయ్య ఏర్పాటు చేసిన ఎదురు. నవ్వుకని- నడక వేగం పెంచాడు. అక్కయ్య చాలా తెలివయినదీ, సమర్థురాలూ. కాని- ఆమె స్త్రీ కూడా! ఆ స్త్రీత్వం తాలూకు అమాయకత్వమూ త్యాగభావమూ- అవే తనకు శ్రీరామరక్ష ఔతూ వచ్చాయి యిన్నాళ్లూ.

రైలుస్టేషను ఆవరణలో అడుగు పెట్టేసరికి గంట మోగింది. అదృష్టవశాత్తూ బుకింగ్ ఆఫీసు దగ్గర ఏ మాత్రమూ

రష్ లేదు. త్వరగా టికెట్ కొనుక్కుని ప్లాట్‌ఫారం చేరుకున్నాడు. అప్పటికే ట్రెయిను ఆగి ఉంది. మెయిలు కనుక కిటకిటలాడిపోతూంది సహజంగా. ఎలాగో ఓ కంపార్టుమెంటులోకి ప్రవేశించాడు. జుత్తు చెరిగిపోయింది. బట్టలు నలిగిపోయాయి. మెయిలు సెకండ్‌క్లాసు కంపార్టుమెంట్‌లో కెక్కాలంటే యుద్ధం చేసినంత పని ఉండేవే రెండే రెండు రెండవ తరగతి పెట్టెలు. ఎ.సి.లూ, ఫస్టుక్లాసులూ, రిజర్వ్‌డ్‌లూ అవే ఎక్కువ. దేశంలో పేరుకే తప్ప ఆచరణలో ప్రజాస్వామ్యం అరుదుగానే ప్రతిబింబిస్తుంది. రాజకీయానికి ప్రజాస్వామ్యమనే మాట అందమైన ముసుగు.

పెట్టె ఎంత రష్‌గా ఉన్నా- పల్లీలు (వేరుశనక్కాయలు) అమ్మేవాళ్ళూ, బిటానీలమ్మేవాళ్లూ తమ బుట్టలతో ప్రయాణీకుల కాళ్ళు తొక్కేస్తూ, వాళ్ళని తోసుకుంటూ తమ వ్యాపారం నిరాటంకంగా చేసేసుకుంటూనే ఉన్నారు. ముష్టివాళ్ల మాటలతోనూ- అవి చాలవన్నట్లు పాటలతోనూ ప్రయాణీకుల నడుక్కుంటూ విసిగిస్తూనే ఉన్నారు. పెట్టెలో టికెట్‌కొన్నవాళ్ళకంటె కొనని వాళ్ళే ఎక్కువేమో అన్న సందేహం ఉత్పన్నమవక మానదు జాగ్రత్తగా చూస్తే.

మెయిలు కనుక అతి తక్కువ చోట్ల ఆగుతూ ఎక్కువ వేగంగా పోతుంది. స్టేషన్లో ఆగేసరికి - దిగేజనం ఎక్కేజనమే ఎక్కువగా ఉన్నారు. లగేజి బెర్తులమీదకూడా పాసింజర్లు కిక్కిరిసి కూర్చున్నారు. బెజవాడ చేరేవరకూ యీ నరకం అనుభవించి తీరవలసిందే అనుకున్నాడు ఆనంద్. దాహం వేస్తున్నా దిగి వెళ్ళడానికి వీలులేదు.

ఏడున్నర - ఎనిమిదీ మధ్య రైలు విజయవాడ చేరింది. దిగి - హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. క్యాంటీన్‌లో టిఫినూ కాఫీ తీసుకుని సిగరెట్ అంటించాక - పునర్జన్మ ఎత్తినట్లే అయింది. స్టేషను బయటకు వచ్చి రిక్షా మాట్లాడుకున్నాడు లాడ్జింగ్ హోటల్‌కి. హోటల్‌కిపోయి స్నానంచేసి రిఫ్రెష్ ఐతే తప్ప మెదడు పనిచెయ్యదేమో అనిపించింది.

అదీ - ఖరీదయిన హోటలు కాదు. గవర్నరుపేట సెంట

రులో మధ్యరకం లాడ్జింగ్ హోటలు. సింగిల్ రూమ్ బాగానే ఉంది. రేటు కూడా మరీ ఎక్కువేమీకాదు. బోయ్ వచ్చి - మంచంమీద పరుపు దులిపి కొత్త దుప్పటి పరుస్తూంటే - తల గడ కిందనుంచి పడిన వస్తువులని చూసేసరికి ఆనంద్ కి మతి పోయినంత పనయింది. క్షణంపాటు భయమూ వేసింది. కాని - ఇప్పుడు చేయగలిగినదేముంది! హోటలుకి అడ్వాన్సిచ్చి వెయ్య డమూ, రసీదు పుచ్చుకోవడమూ జరిగిపోయింది. ఇచ్చిన డబ్బు వదులుకుని మరో హోటలు వెదుక్కోవాలి! నిట్టూర్చి - ఉండ డానికే నిర్ణయించుకుని "వేడినీళ్ళు పెట్టు, స్నానం చెయ్యాలి" అన్నాడు బోయ్ తో. వాడు చిరునవ్వు నవ్వి - "చలిగా ఉంది.... ఇప్పుడు స్నానం చేస్తారా?" అంటూ ప్రశ్నించాడు.

"చలిగా ఉందనే వేణ్ణీళ్ళు ..."

పదిహేను నిమిషాల్లో వాడు నీళ్ళ సిద్ధం చేశాడు. ఆనంద్ స్నానంచేసి వచ్చాడు.

"వేడిగా ఏమయినా తీసుకుంటారా?"

"ఏమున్నాయ్?"

"మీకేం కావాలంటే అవి. బ్రాందీ, బీర్, విస్కీ, రమ్, జిన్ ...."

తెల్లబోయి— "వొద్దు" అన్నాడు. "భోజనం తెచ్చెయ్."

వాడెందుకో నవ్వి మరీ కదిలాడు. వాడి నవ్వు ఆనంద్ కి కోపం తెప్పించింది.

క్యారియర్ తెచ్చి టేబులుమీద పెట్టి-"మీరు భోంచేశాక కారియర్ పట్టుకుపోతాను" అన్నాడు యధాప్రకారంగా నవ్వుతూ.

ఇక కోపం పట్టలేకపోయాడు. "ఊరికే ఎందుకలా నవ్వు తావ్ మాటి మాటికీ?"

బిక్క మొహం వేశాడు కుర్రాడు. "నవ్వడం కూడా తప్పేనాసార్? మా ప్రొప్రయిటరేమో ఎప్పుడూ నవ్వుమొహంతో పనిచేయమంటాడు. అయినా-డ్యూటీదిగి యింటికెడితే నవ్వు రమ్మన్నారాదు- ఏం నవ్వినా యిక్కడే." వాడి కళ్ళలో నీళ్ళొ రాయి. ఆ క్షణంలో చాలా అమాయకంగా సహజంగా ఉంది ముఖం.

"ఎందుకని?" ముద్ద నోట్లో పెట్టుకోబోతూ ఆగి అడిగాడు ఆనంద్.

"మా బతుకులు చెప్పి మిమ్మల్నెందుకు బాధపెట్టాలిసార్? మీరు అదృష్టవంతులు...."

త్రుళ్ళిపడి - పరీక్షగా వాడి వైపు చూశాడు. వాడికి పద్నాలుగూ పదిహేనూ కంటె వయసెక్కువ ఉండదు. కాని - జీవితంతాలూకు చాలా బరువూబాధ్యతా ముఖంలో కనిపిస్తున్నాయి. తరుణం రాకుండా - లేత కాయను పొగపెట్టి పండించి వ్యాపార వస్తువుని చేసినట్లు,వయసుకంటె తొందరపడి బలవంతంగా వచ్చేసిన లోకజ్ఞానం వాడి ముఖానికి వికృతమయిన పెద్దరికాన్నాపాదిస్తూంది.

"నే నదృష్టవంతుడినని ఎలా తెలుసు నీకు?"

"మీకు డబ్బుంది కనుక లాడ్జికి వచ్చారు. డబ్బున్నవాళ్ళు కాక అదృష్టవంతు లింకెవరు?" ఆ మాట-అతనిలో అనేక ఆలోచనలను రేపింది. ఎంత సరిఅయిన నిజం! సరిగ్గా తన మనసు తెలిసినట్లే చెప్పాడు వాడు. నిజమే. ఐశ్వర్యం కంటే అదృష్టం ఏముంటుంది? డబ్బుతో కొనలేని దేముంది? సర్వసుఖాలూ లభిస్తాయి డబ్బు కలవాళ్ళకి. వాళ్ళు తలచుకొంటే పొందలేనిదుండదు. లేనివాళ్ళ కన్నీటి తుడుపుకే 'సుఖం డబ్బులోకాదు మనసులో' అనే మాట. అందని ద్రాక్ష పళ్లు పుల్లన. అలాగే నిజంగా తను కలవాడయితే తన జీవితం యిలా ఉండేదా!

త్వరగా భోజనం ముగించేసి మంచంమీద కూర్చున్నాడు. సిగరెట్ కాల్చాలని ఉంది.కాని-అందు కనర్హుడేమో అన్న శంక. ఔను. తను నిరుద్యోగి. పైసా సంపాదించని తనకి డబ్బుని సిగరెట్టురూపంలో తగలేసే అర్హతెక్కడిది?

రూము ముందు చిన్న బాల్కనీ ఉంది. అక్కడి గోడ కానుకొని బోయ్ తను క్యారియర్‌లో వదిలేసిన అన్నం ఆత్రంగా తింటున్నాడు చీకటి వెలుగులమధ్య.

డబ్బు లేకపోబట్టిగా వాడికీ ఎంగిలి మెతుకుల కర్మ? తనుమాత్రం.... డబ్బు లేకనేగా కోరికలను చంపుకుని - జీవితంతో రాజీ పడడం ఔను నూటికి నూరుపాళ్ళు నిజం.

డబ్బున్నవాడితో జీవితం రాజీ పడుతుంది. డబ్బు లేనివాడు జీవితంతోనే రాజీ పడాలి. తప్పదు. చేదుగా ఉన్నా యిదే నిజం.

పోస్టుగ్రాడ్యుయేషనూ, రిసెర్చి ... ఫారిన్‌టూరు బంగళాల్లో నివాసమూ.. కార్లలో ప్రయాణాలూ, పది మంది మధ్యా పలుకుబడీ, ఎన్ని కోరికలు! అన్నిటికీ సమాధి కట్టింది ధన లోపమే కాదూ?

దుస్వప్నాలలో అయినా అనుకున్నాడా నెలకి పూర్తిగా ఐదువందలేనా రాని యిటువంటి ఉద్యోగం కోసం తాపత్రయ పడవలసి వస్తుందని? చాలా ముఖ్యంగా స్వప్నని చేజార్చు కున్నది ఐశ్వర్యం లేకనేగా?

స్వప్న! స్వప్నం కంటె తియ్యగా.. అందంగా..

అంతకంటె మధురమయిన గాత్రంతో, పలికితే జల తరంగిణే. పాట పాడితే వసంతంలో కోయిలే. నల్లటివాళ్ళు అందంగా ఉండరని, ఎవరయినా మూర్ఖంగా పొరపడితే-అందుకు సమాధానం స్వప్న.

తనకి క్లాస్‌మేట్ కాలేజీలో నాలుగేళ్లూ.

ఆమె కంటే తనకి కొంచం మార్కు లధికం. ఏమిటో చక్కని అభిప్రాయం తన మీద. స్నేహమైంది. కాలం ఆ స్నేహాన్ని పెంచుతుందేమో మరోమెట్టు అని ఆశించాడు.

ఊహుం. నిరాశ చేసింది. తన హృదయం ఆమె కోసం ఎంత కొట్టుకునేదని! తొలిప్రేమ గాఢమయినదీ.. చిరకాలం స్మృతులలో మిగిలిపోయేదీ. బస్‌కి టిక్కెట్స్ కొనడం మానేసి ఆమెని క్యాంటీన్‌కి తీసుకువెళ్ళగలిగిననాడు - ఎంత తృప్తి! ఎంత ఆనందం!

అక్కయ్య బట్టలు కుట్టించుకోమని యిచ్చిన దానిలో మిగిల్చి - ఆమెతో లీలాలో రెండోఆట సినిమా చూసి-మధ్యలో ఐస్‌క్రీమ్ డిష్‌లో చెరో స్పూనూ వేస్తూ తింటూంటే - జీవితం ఎంత తీయగా కనిపించేది! స్వప్నతో జీవితం ఐస్‌క్రీమ్ కంటే తియ్యగా సాగుతుందనే కలలు కన్నాడు.

కాని- చివర కేమయింది? పరీక్షలై పోయాయి. ఫలితాలు వచ్చాయి. ఆ రోజు - తనకి చాలా జ్ఞాపకం ఉంది. మంచికంటే

శాశ్వతంగానూ, విపులంగానూ గుర్తు ఉంటుంది చెడు రోజు.

"నీ కేదో ఉత్తరం ఉంది ఆనంద్-" అందించింది అక్కయ్య.

అప్పటికింకా ఉద్యోగయత్నాలు మొదలుపెట్టలేదు. తనకి ఉత్తరాలు రాసే వాళ్ళెవరు? ఆత్రంగా కవరు తెరిచాడు. మూడే ముక్కలు.

"ఎల్లుండి నేను విశాఖపట్నం వదిలి వెళ్ళిపోతాను. బహుశా శాశ్వతంగా. ఒక్కసారి నన్ను కలుసుకో. బుధవారం సాయంత్రం బీచ్‌లో. మనం అప్పుడప్పుడు కలుసుకునే వాళ్ళం-అక్కడ. తప్పకుండా వస్తావు కదూ! - స్వప్న."

ఉత్తరం అతి భద్రంగా దాచి బట్టలు వేసుకోసాగాడు. స్వప్నని కలుసుకోవలసిన సాయంత్రం యిదే. స్వప్న శాశ్వతంగా విశాఖను వదిలి వెళ్ళవలసిన అగత్యం ఏమొచ్చింది.

"ఉత్తరం - ఎవరి దగ్గరనుంచి?"

"ఒక ఫ్రండ్" ఆగి "త్వరగా కాఫీ యివ్వగలవా అక్కయ్యా"

"ఊఁ ఈలోగా డబ్బు తీసుకో.... కొంచెమే ఉంటుంది. కాఫీ-చాలనుకుంటాను."

కాఫీ హడావిడిగా త్రాగి "రావడం ఆలస్యం కావచ్చు. తలిపెట్టుకోకేం?" సమాధానం కోసం చూడకుండా వీధిలోకి పరుగు. ఆగడం .. బీచ్‌లోనే.

అప్పటికే అక్కడ ఎదురుచూస్తున్న స్వప్న.

ఆత్రంగా అడిగాడు "స్వప్నా! ఏమిటి నీ ఉత్తరం? నిజమేనా?"

"ఔను.... అందుకే-వెళ్ళేముందు నిన్నొకసారి కలుసుకుని మాట్లాడుదామని...."

"థాంక్స్ స్వప్నా! ఇంత హటాత్తుగా అలా నిర్ణయించుకోవలసిన అవసరమేమొచ్చింది?"

"జీవితం...." పొడిగా బాధగా అంది. "అంతే ఆనంద్ జీవితం అలాగే ఉంటుంది."

"స్పష్టంగా చెప్పు స్వప్నా? నాకేమీ అర్థం గావటంలేదు."

"జీవితం సముద్రం లాటిది. చూడు. ఇక్కడ కనిపించే కెరటాలు - కొంత దూరం తరవాత కనిపించవు. నీటిలోకి చూస్తే స్వచ్ఛంగా నీలంగా కనిపిస్తుంది కాని - నిజాని కది కానేకాదు. ఆ నీటి అడుగున రాళ్ళుంటాయి. రత్నా లుంటాయి. సర్పాలుంటాయి. ఇంకా ఎన్నెన్నో! బయటకు కనిపించకుండా" ఆమె కన్నులలో అశ్రువులు, "స్వప్నా!" కంగారుగా చూశాడు.

"జీవన శకటం కూడలి చేరింది. మలుపు తిరగక తప్పదు ఆనంద్! నీకు తెలిసిన స్వప్న ఆడుతూ పాడే అమ్మాయి. కాని-నిజం వేరు. ఇప్పుడు నామీద చాలా బాధ్యత ఉంది. నా చుట్టూ దట్టంగా ఎందరి ఆశలో అల్లుకుని నన్ను స్వేచ్ఛగా ఎగర వీయకుండా బంధిస్తున్నాయి. జీవితం నాకోసం కాదని స్పష్టమై పోయింది. తప్పదు తల వంచవలసిందే. అందరూ అదృష్ట వంతులే కాగలరా? అలా ఐతే ఈ ప్రపంచం తీరు తెన్నులు వేరుగా ఉండేవి కదూ?" ఆమె కన్నులలో నీటిముత్యాలు.

చీకటి పడుతోంది. సముద్రంమీదా - హృదయాల లోనూ, ఆకాశాన్ని మబ్బులు ఆవరించుకుంటున్నాయి జీవితాన్ని బాధ్యతలలా. ఆమె చేతులను తన చేతులలోకి తీసుకున్నాడు. స్పర్శ .. ఉత్తేజం .. ఉద్రేకం.

"ఈ పరిస్థితినుంచి నేనూ నిన్ను కాపాడలేనా స్వప్నా?"

జాలినిండిన నవ్వు. నిరాశగా.... నిస్పృహగా .... నిస్సత్తువగా.

"సారీ ఆనంద్. ఎవరూ ఏమీ చెయ్యగలిగిందికాదు. నీ పరిస్థితి నాకు కొంచెం తెలుసు."

"స్వప్నా!"

"ఇన్నాళ్లూ నేను హృదయంతో పాటలు పాడాను. నాకోసం .. నా యిష్టులకోసం ... ఇకనుంచి నా కళ నాది కాదు. నాకోసం కాదు.... ఇతరులది ... పరులకోసం..."

"అంటే?" అర్థంకాని భావప్రకటన.

"నేను- సినిమాల్లో పాడబోతున్నాను. పాడాలి. పాడి తీరాలి ... దీనికి నా 'యిష్టాయిష్టాలతో నిమిత్తం లేదు. నాన్నగారి ఆజ్ఞ. పరిస్థితుల శాసనం. ఔను ఆనంద్. మనుషులు జీవించ

గలుగాలంటే- డబ్బు చాలా అవసరం."

"చివరికి యిలా జరిగిందా, నా స్వప్నా!" హృదయం నిండా దుఃఖం తొణికిసలు.

"మన చేతిలో ఏదీ లేదనుకుంటాను" వయొలిన్ తీగెమీద విషాద కంపన. చీకటి చిక్కబడుతోంది. సముద్రం సింహంలా క్రూరంగా గర్జిస్తోంది. బీచి నిర్మానుష్యం ఐపోయింది వాళ్ళిద్దర్నీ మినహాయిస్తే.

"నేను నీ జ్ఞాపకాలలో ఉంటానా స్వప్నా?"

"నిన్ను మరచిపోడం- నాకు అసాధ్యమే." తీయని సమాధానం.

క్షణాలు....మౌనం... "నేను వెళ్ళేదా?"

"వొద్దు స్వప్నా! ఇలాగే యిక్కడే- కాలాని కతీతంగా ఉండిపోదాం"

వ్యధాభరితమయిన నవ్వు - గుండెలను రంపపుకోత కోస్తూ-

"వాస్తవం కఠినంగా ఉంటుంది ఆనంద్. కలలలాగ, కవిత్వంలాగ కాదు."

మేలుకొలుపు... హెచ్చరిక.... కనువిప్పు.... జీవితం.... వాస్తవం...

"వెళ్లే ముందు- ఒక్కసారి- నా అభిమానపాత్రమయిన రాగం- శివరంజని నీ గొంతులో... పలికించవూ!"

"ఇప్పుడు...ఇక్కడ...ఇలాగ!!"

"ఔను... ఇప్పుడే ఇక్కడే ఇలాగే." ఇంకా ఆమె చేతులు అతని చేతుల్లో.

"ఏకతార అయినా లేదు. ఎలాగ పాడేది! "ఆమె దిగులు.

"నీ కన్నుల్లో తారకలు. నీగొంతులో సప్తస్వరాలూ, ఇంకా నేంకావాలి?"

మసకవెన్నెల... మెత్తని యిసుక ... నేపథ్య సంగీతంగా గంభీరమయిన సాగరఘోష. తన చేతుల్లో ఆమె చేతులు.. వివశత్వం... ఇన్నిటిమధ్యా ఆమె శివరంజని రాగం ఆలాపన యెత్తుకుంది. విషాదం వొలుకుతూ... గుండె కరుగుతూ ... హృదయం

ద్రవిస్తూ.... ప్రపంచమూ, ప్రకృతీ స్తంభించిపోయి కన్నీరు కారుస్తున్నాయి. వియత్పథంకూడా విలపిస్తూ—మంచు కన్నీటి బొట్లను రాలుస్తోంది. ఔను. శివరంజని. వియోగంకంటే విషాదమయంగా—శివరంజని. ఎప్పుడు ఎలాగ స్వప్నని వదలి యిల్లు చేరుకున్నాడో అతనికే తెలీదు.

అక్కయ్య పలకరింపు.... "చొక్కా' అలాగ తడిసిపోయిందేం ?"

మౌనమే సమాధానం. గొంతు విప్పితే - గుండె బయట కురుకుతుందేమో ఆనకట్ట తెగిన ప్రవాహంలా. ఆ రాత్రి అ భోజనం.... నిద్రలేమి.... ఆలోచనలు. ఏదో అతివిలువయిన వస్తువును శాశ్వతంగా చేజార్చుకున్న భావన. హృదయంలో శివరంజని రాగాలాపన - ఎడతెరిపి లేకుండా.

స్వప్న.... మళ్ళీరాని తీయనికల. డబ్బులేక పోబట్టే కదా? ఆమె తనకు అందని గాలిపటం ఐపోయింది? సినిమాలలోనూ ఆమె గొంతుకి తగిన స్థానంలభించలేదు. కోయిలలు - బూతు పాటలు పాడతాయా? స్వప్న - సినిమా పాటలు పాడద మేమిటి?

చివరికి స్వప్న - బర్తుడే గ్రీటింగ్సులోనూ, పండగ శుభాకాంక్షలలోనూ మిగిలిపోయింది. ఆ స్నేహం...ప్రేమ.... అలాగ అంతమయ్యాక....

"నేను వెళ్తాను సార్...మీకేమయినా కావాలంటే యిప్పుడే చెప్పండి–" వాచీ చూసుకున్నాడు ఆనంద్. పదిన్నర. "నాకింకేం కావాలి ?"

"అడికాదు. కొంతమంది - పడుకునే ముందు పాలు తాగుతారు. మీరూ ధనవంతులలాగే ఉన్నారు. అందుకని అడిగాను... సార్...మీరెన్నాళ్ళుంటారు ?"

"ఖచ్చితంగా రేపు సాయంత్రం వరకూ. తరవాత చెప్పలేను. ఊఁ....నీ పేరేమిటి ?"

"బోయ్ !" నవ్వి - "పేదవాడిని ఇక్కడ నా పేరంతే సార్" అన్నాడు.

"ఇక వెళ్ళు–" తలుపు మూసుకున్నాడు.

చెరువులో రాయిపడినట్లు–మళ్ళీ ఆలోచనలు....వాడికంటికి

తాను ధనవంతుడిలా కనిపించాడు కాబోలు! కావచ్చు. నిజం వాడికి తెలీదు. నిష్కర్షగా-వాడు తన ఎంగిలి మెతుకులు తింటే-తను—

ఆ ఆలోచన భరించలేక పోయాడు. త్వరత్వరగా సూట్ కేసు తెరచి-ఇంటర్వ్యూ గైడ్ బయటికి తీశాడు. రేపు ఇంటర్వ్యూకి హాజరు కాబోతూ ఎంతసేపు వృధాచేశాడు తనకి తెలియకుండా. అసలే ఇంటర్వ్యూ అనేది - పిల్లికి చెలగాటం ఎలిక్కి ప్రాణసంకటమూ. ఉద్యోగం కావాలంటే తప్పనిసరిగా అన్నిటికీ సిద్ధపడి తీరవలసిందే.

పుస్తకంలో లైన్లవెంట కళ్లు పరుగెడుతున్నాయి. ఆ చదువు కళ్లకేకాని మనసుకి చొరడం లేదు. ఎక్కడనుంచో పాట. మెల్లగా....కాని- సుస్పష్టంగా .... "కవి గేయంలా యీ గాయం తీయనిది. నీవు వదలిన స్మృతి యిది. నీ లాగే గుండెలలో పొంచి, పొంచి....మధురమైన బాధరేపి......రేపి........" అర్థంకాని చదువు వ్యర్థమనుకుంటూ తలుపులు తీసి - రూము ముందరి గోడకు ఆనుకుని నిలుచున్నాడు. ఈసారి - పక్కగదిలోంచి మరీ స్పష్టంగా వినవస్తూంది గీతిక. ఆ గొంతు....బొను స్వప్నది. అందుకే ఆ కంఠంలో అంత తియ్యని విషాదం. ప్రియురాలి శిరోజాలవలె సున్నితమైన పదాలకూర్పుకల గీతికలు- రాణించాలంటే స్వప్న కంఠాన్నాశ్రయించవలసిందే.

గీతం సమాప్తమయిపోయింది. జంత్రవాద్య సంగీతం. అటు తిరిగాడు. విజయవాడ నగరం. తలకట్టులో సరిగా అమర్చుకోని మణులూ, మాణిక్యాలలా వెలుగుతున్నాయి వరుసావాపీలేవి దీపాలు. మధ్య మధ్య రత్నాల్లా, కెంపుల్లా, రంగు రంగుల దీపాలు. పుష్యరాగాలూ, నీలాలూ, పగడాలూ, వజ్రాలూ, మరకతాలూ చెల్లాచెదురయినట్లు రంగురంగుల దీపాలు. దూరంగా దుర్గ కొండమీద - జ్ఞాననేత్రంలా ఒక్కదీపం - ఉన్నతంగా - స్వచ్ఛంగా.

చల్లగా గాలి వీచింది. నిద్రమాత్రం రావడం లేదు. ఎంతసేపు నిలుచున్నాడో కాళ్లు లాగడం మొదలుపెట్టాయి. గదిలోకి నడిచాడు. తలుపు మూశాడు. తలగడా సర్దబోతూంటే - నిరోధ్!

పరీక్షగా చూశాడు. ప్రభుత్వం సబ్సిడీ యిచ్చి అందరికీ అందుబాటులో ఉండేలా చేసింది. కాని - దాని ఆశయం ఎంతవరకు నెరవేరుతుంది ? తప్పు ప్రభుత్వానిది కాదు. ప్రజలిది. వస్తువు తాలూకు ఉపయోగం - దానిలో కాదు. ఉపయోగించే వారినిబట్టి ఉంటుంది. అగ్గిపుల్ల దీపాన్ని వెలిగిస్తుంది. ఇంటినీ తగలబెడుతుంది.

విరోధ్‌తోపాటు ఫొటో - అర్థంకాదు - సంపూర్ణంగానే - నగ్నంగా. స్త్రీ సౌందర్యం చివరికిలాగ దిగజారిం దన్నమాట ! స్త్రీ పూజింపబడే భారతదేశంలో - దిష్టిబొమ్మలా యీఫొటో ! అన్నిపూలు పూజకు నోచుకోనట్లే, అందరు స్త్రీలూ గౌరవానికి నోచుకోరేమో !.... ఊహుం... ఈ స్త్రీ బతుకు బాధలేమిటో ? ఏ పూట తిండికోసం - ఏ బాధ్యతను నెరవేర్చుకుందుకు - గత్యంతరం లేక - సిగ్గు చంపుకుని - యిందుకు సిద్ధపడవలసి వచ్చిందో ఈ దేశాన్నీ, మనుషులనీ పట్టి పీడిస్తూంది దారిద్ర్యం. అన్నం కోసం రక్తం అమ్ముకునే దౌర్భాగ్యులున్నారీ దేశంలో. ఆర్థిక దారిద్ర్యం రూపుమాసిపోతేతప్ప భావ దారిద్ర్యం వదలదు. కాని- ఎలా ? ఈ దేశంలో అందరికీ కడుపునిండే శుభదినం ఎప్పుడో ? నిశ్చయంగా కనుచూపు మేరలో కానరావడం లేదు. అది-తన దృష్టిదోషం కాకపోవచ్చు. దేశానికి చాలావిధాల సంస్కారం అవసరం. ముఖ్యంగా ఆర్థిక విషయాల్లో.

పక్క సరిచేసుకొని మేనువాల్చాడు. ఫ్యాను తిరుగుతున్నా దోమలు విజృంభిస్తూనే ఉన్నాయి. మానవజాతిమీదే పగపట్టినట్టు వీలున్నచోటల్లా కుట్టికుట్టి వదులుతున్నాయి. పుస్తకం మూసేసి బ్లాంకెట్ మెడవరకూ లాక్కున్నాడు. తెరచిన కిటికీలోంచి నక్షత్రాలు కనపడుతున్నాయి. కనురెప్పలు బరువెక్కడమే తప్ప నిద్ర రావడం లేదు. శరీరం అలసిపోయి - భారంగా ఉంది. హృదయం మరీని. రేపటి ఇంటర్వ్యూ ఫలవంతమై ఉద్యోగం లభించకపోతే యింక తను చేయవలసినదీ, చేయగలిగినదీ ఏమిటి? చదువుకుని అర్హతలు సంపాదించుకున్న అనంతరం కూడా ఉద్యోగం లాటరీలో గెలుపులాగా మిగలడం యీ దేశపు విద్యావంతుల దౌర్భాగ్యం కాకపోతే మరేమిటి ?

గాజుల గలగల, తృళ్ళిపడి మంచం దిగాడు.

"తలుపు తీయండి" ఆజ్ఞో అభ్యర్థనో తెలియని తనం వింది - ఏం చేస్తున్నదీ తెలియకుండానే తలుపు గడియ లాగడం —

ముందు - చవుకబారు సెంటువాసనా — దాని వెంబడి ఆమె లోపలికి రావడం - వస్తూ ఆమె తలుపు మూయడం - జరుగుతున్నదేమిటో గ్రహించుకునే లోగానే అన్నీ జరిగిపోయి- ఆమె, మంచంమీద కూర్చుంది నవ్వుతూ.

అతను నిలువెల్లా వణికిపోతున్నాడు. భయంతో కాదు. ఆత్రుతతో.

"ఎవరు ?" అతని కంఠం కంపించింది. "ఎవరు మీరు"

ఆమె నవ్వింది. అదే సమాధానమన్నట్లు — తాను తప్ప మరేమీ కానట్లు.

"నాగదిలోకి ఎందుకు వచ్చారు ? ఈ అర్ధరాత్రి..."

జాలిగా చూసి-"నిజంగా తెలియకే అడుగుతున్నారా అనవసరపు ప్రశ్నలు దేనికి ? స్వర్గంలోకి పోదాం రండి" అంది పైట జార్చుతూ.

"నాకు స్వర్గం అవసరంలేదు-"

వినుపించుకోనట్లే-"వ్యాపారం నిమిత్తం వచ్చారా ?"

"కాదు..." కటువుగా అన్నాడు ఆమెవంక చూడకుండా.

"మరి ?" పట్టు వదలని విక్రమార్కుడిలా నవ్వు వదలకుండా అడిగింది.

నిజంగా ఆమె అసహ్యంగాలేను. "మీ కనవసరం అనుకుంటాను."

"పోన్లెండి" బుంగమూతి పెట్టే అభినయం చూపబోయింది. ఈవ్యవధిలో అతను తేరుకున్నాడు. "మీరు త్వరగా వెళ్ళిపోతే నేను నిద్రపోతాను."

"అయితే త్వరపడండి" అతనివైపు తిరిగింది. హుక్ తీయమన్నట్లు. తను అలాటి వాడినికానని యీామె కెలాగ చెప్పడం ? ఫ్యాంటు జేబులోంచి కొంచెం డబ్బుతీసి "ఇంత

కంటె మీ కెలా చెప్పాలో నాకు తెలియడంలేదు దయచేసి తీసుకుని వెళ్ళండి" అంటూ ఆమె కందించబోయాడు.

ఈసారామె నవ్వలేదు. క్షణంసేపు అనిమేషంగా చూస్తూ ఉండిపోయింది. ఆమె కన్నుల వెంట జలజల కన్నీరు ప్రవహించింది. "నేను ముష్టిదాన్నికాదు." ఒకసారి ఆగి "నాకూ ఉచ్ఛ పీచాలున్నాయ్. క్షమించండి, నేను మిమ్మల్ని సరిగా అర్థం చేసుకోలేక పోయాను. డబ్బు అవసరం అలాగ చేసింది. మీ నిద్రకు భంగం కలిగిస్తే మన్నించండి... వస్తాను" అని తలుపు తీసుకొని చీకటిలోకి కరగిపోయింది.

శూలంగా తగిలిందామెమాట – "డబ్బు అవసరం అలాగ చేసింది."

నిజంగా ఎంత శక్తివంతమయినదీ డబ్బు! మనిషిని తగానయినా మార్చగలదు. దిగజార్చగలదు!

ఆనంద్ చాలా తీవ్రంగా నిద్రపోడానికి ప్రయత్నించ సాగాడు. ఫ్యాను స్పీడు హెచ్చించి గుండెలవరకూ దుప్పటి లాక్కుని – గట్టిగా కళ్ళు మూసుకుని.

ఉదయం తొమ్మిదికి – అదీ బాయ్‌వచ్చి పిలిస్తే - మెలకువ. తొందరగా ముఖ ప్రక్షాళనం... స్నానం – కాఫీ.... బట్టలు వేసుకుని బయటకు.

ఏలూర్‌రోడ్ మీద – జన సందోహం మధ్య – తనూ ఒక అణువై - గమ్యంలేని చోటుకి – కాలహరణానికి – కాళ్ళు తీసుకెళ్ళే దిశలో – నడక.

"హలో! ఆనంద్!" పిలుపు ... పలకరింపు .. భుజంమీద చెయ్యి.

"ఓహ్! నువ్వా! మూర్తీ! ఏంచేస్తున్నావ్ ?"

"డాక్టరు మూర్తి ... ఇక్కడ కాదులే .. నూజివీడులో."

మూర్తి... ఏనాటి మూర్తి! ఇంటర్ తనూ.... మెడిసిన్ ఫైనలియరతనూ .... ఏదో సినిమాహాలు దగ్గర పరిచయం. చిత్రంగా ప్రారంభమై – చివరకు స్నేహంగా పరిణతి. ఇద్దరికీ బద్ధకమే - ఉత్తరాలు రాసేందుకు. ఐతే ఏం, వియోగం - స్నేహాన్ని విచ్ఛిన్నం చేయలేకపోయింది. స్నేహమూ.... ప్రేమా

- వీటిపట్ల కొలంకూడా ఓటమి చెందుతుంది. మూర్తీ తనూ అటువంటి స్నేహితులు. "నీ శుభలేఖ అందింది కానీ" నసిగాడు నేరం చేసినట్లు.

"పెళ్ళికి రాలేదు.... డోంట్‌వర్రీ.... అలా పడ... వెల్‌కమ్‌లో నీకు డిన్నరిస్తాను. సరేకాని - నువ్వేమిటి, ఏకంగా యింత దూరం దయచేశావ్?" నవ్వు.

"పోలనుద్యోగికివి దూర భూమిలేదు - ఉద్యోగిని కాను. అన్వేషిని. అంతే."

"ఉవిద్యా, ఉద్యోగమూ మగవాడిని ఏమూలకయినా తీసుకు పోగలవు. నిజమే."

వెల్‌కమ్ ఎ.సి. రూములోకి జంటగా నడక, కడుపు పగిలేలా భోజనం.

"ఔనూ - మీ స్వగ్రామంలో కాకుండా నూజివీడులో పెట్టావే, ప్రాక్టీస్?"

"అది - మామగారి ఊరు-" నవ్వి- "అందుకు. మనిషికి ముఖ్యం బాగుపడడం. ఐనా - స్వగ్రామంలోకి 'స్వ' - నేతి బీరకాయలోని నెయ్యే. 'స్వ' అనేది ప్రస్తుతం నూజివీడులోనే ఉంది. నిజం చెప్పెయ్యాలంటే మామగారు పలుకుబడిగల పెద్ద మనిషి. పాలిటిక్స్‌లోనూ అదీ తిరుగుతుంటాడు. మనం - నీడ పట్టున-అదే-డిస్పెన్సరీలో హాయిగా కూర్చుని కాలం గడిపేస్తూ జేబులు నింపేసుకోడమే. నూజివీడు బోరుకొడితే-బెజవాడ పరుగెట్టడం. బస్...."

"అదృష్టవంతుడివి" మూర్తిని చూస్తూ కొంచం యీర్ష్యలాటిది బయట పడకుండా బహు జాగ్రత్త తీసుకోవలసి వచ్చింది.

"కొంతసేపు నాతో గడపగలవా?" అడిగాడు మూర్తి.

"రెండు గంటలకి ఇంటర్‌వ్యూకి హాజరవ్వాలి."

"ఏం పోస్టు?"

రావ్ అండ్ రావ్-ఇంపోర్ట్సు అండ్ ఎక్స్‌పోర్ట్సు ... లో సూపర్‌వైజర్ పోస్టు."

"ప్రయివేట్ కంపెనీయా!-" పెదవి విరిచాడు. అంత

లోనే ఏదో జ్ఞాపకం వచ్చినట్లె ..."రావ్ అంట్ రావ్ కదూ !" ఆ "నీకు ఉద్యోగం వస్తుంది."

ఆనంద్ ఆనందం పట్టలేక పోయాడు. "ఎలాగ ?"

"నేను సికొాక ఉత్తరం యిస్తాను. తీసుకెళ్ళి... సమయం చూసుకుని-ఆ ఆసామీ కిచ్చెయ్. చాలు. మిగిలినదతను చూసుకుంటాడు."

"రికమండేషనా !." నిట్టూర్చాడు.

"వొట్టి రికమండేషను కాదు. కమాండే అనుకో. జాగ్రత్తగా కథ నడుపు."

ఉత్తరం రాసేసి—గుడ్‌లక్ చెప్పేశాడు. "ఉద్యోగంలో చేరగానే రాయి. వెట్ పార్టీతో సిద్ధంగా వుండు" అనేసి రిక్షా ఎక్కేశాడు మూర్తి.

మళ్ళీ ఒంటరిగా. ఈసారి ఆశ్చర్యం తోడుగా. నిజంగా తనకీ ఉద్యోగం రాబోతుందా? ఎందుకో ఆశగానూ ఉంది. అంతలోనే నమ్మకం చాలడం లేదు. తనకి ఉద్యోగం ఏం? ఎందుకు రాకూడదు? తనకేం తక్కువని? అదికాదు.... అసలే ప్రయివేటు కంపెనీ. రికమండేషనుంటే తప్ప ఎవరు చూస్తారు? మూర్తి రికమండేషను—సీరియస్‌గా తీసుకోదగినదేనా? అదే నిజం అయితే అతను స్వయంగా వచ్చి-చెప్ప వచ్చుగా? మూర్తి తనమీద జోక్ వేయలేదు కద? ఛఛ! ఎందుకలా చేస్తాడు. తన సంగతి అతనికి తెలియదూ తనకి ఉద్యోగం జీవన్మరణ సమస్యా సదృశమని అతనికి తెలీదూ? ఎందుకు తెలియదు? తప్పకుండా తెలిసే ఉంటుంది.

స్టేషనరీ షాపులో కవరు కొని-దానిలో పెట్టబోతూ—కాస్సేపు సభ్యతని అవతలకు పొమ్మని - ఆత్రంగా ఉత్తరం చదివాడు.

"డియర్ శ్రీ శర్మగారూ !—నేను డాక్టర్ మూర్తిని. మా జీవీడులో గోవిందరావుగారి అల్లుణ్ణి. ఒకసారి నేను మీకు సాయపడినందుకు (అదేమిటో మీకు తెలుసు. ఆ విషయం రాయడం నాకు భావ్యంగానూ అవసరంగానూ తోచడంలేదు) మీరు వాగ్దానం చేశారు_తప్పకుండా నా మేలుమరచిపోనని. అది పురస్కరించుకుని

కాదు నిజంగా అవసరమై అడుగుతున్నాను. ఈ ఉత్తరం తెచ్చి మీకిచ్చే ఆనంద్ ఎటువంటివాడో నేను చెప్పక్కర్లేదు. ఒక్క చూపుతో మీరే చదివెయ్యగలరు. ఒకటిమాత్రం నేను చెప్పాలి. అది ఆనంద్‌కి ఉద్యోగం అత్యవసరమని. మీరు తలుచుకుంటే అదేమీ కష్టంకాదు. రావ్ అండ్ రావ్ ఫరమ్‌లో మీరు చాలా ఉన్నతోద్యోగులు. తరువాత, ఆనంద్‌లాంటి అర్హతలు కలవాడికీ, చురుకయినవాడికీ ఉద్యోగం యివ్వడంవల్ల మీకూ,మీకంపెనీకీలాభమే తప్ప నష్టమూకాబోదు. కనుక, ఆనంద్ గురించి ప్రత్యేకముగా ఆలోచించమని అర్థిస్తున్నాను. చిన్నవాడిని-ఇంకెలా రాయగలను? కృతజ్ఞతలతో...మూర్తి."

కవరులో ఉత్తరంపెట్టేసి-జేబులో భద్రంగా దాచాడు. ఆ ఉత్తరంలో ఏదోమిస్టరీఉంది. నిజంగా, ఉద్యోగంవచ్చినా ఆశ్చర్య పడనవసరం లేదనుకుంటూ రిక్షాపిలిచి లాడ్జికివెళ్ళాడు. ఇంటర్వ్యూ కోసం ప్రత్యేకంగా తయారై హోటలు మెట్లు దిగాడు. పావుగంటలో చేరుకోవలసిన ప్రదేశానికి చేరుకున్నాడు.

తనలాగే వచ్చిన ఓ పదిమంది ఆ హాలులో కూర్చున్నారు. వాళ్ళనుచూస్తే అసూయవేయలేదు. జాలివేసింది పాపం.వీళ్ళంతా తన సోదరులు. ఉద్యోగాన్ని వెతుక్కుంటూ తనలాగేకష్టాలు పడుతున్న దయనీయులు.

రెండుగంటలూ కొట్టింది గడియారం.

"ఆనంద్...సి. ఆనంద్..." పేరుపిలిచాడు ప్యూన్. ఇంటర్వ్యూలు కొత్తకాకపోయినా-ఉద్యోగం వస్తుందేమో అన్న ఆశ లేశమాత్రం ఉండడంవల్ల కొంచం కంగారుపడుతూ – గదిలోనికి అడుగుపెట్టాడు ఆనంద్.అతని వెనుక తలుపులు మూసుకున్నాయి. ఆ గదిలో తానాశించినట్లుకాక ఒకేఒక వ్యక్తి ఉన్నాడు.అతనొక్కడేనా ఇంటర్వ్యూ చేసేది?

"ప్లీజ్ టేక్ యువర్ సీట్" ఆఫీసరు చేతిలో తన అప్లికేషనూ,ట్రూకాపీలూ వగయిరాలున్నాయి. ఒకకంట వాటినీ, మరో కంట తననీ పరీక్షిస్తూనే అడిగాడు-చచ్చుప్రశ్న. "మీ పేరేమిటి? పూర్తిపేరు..." చెప్పాడు. ఇతనికికాని పేర్ల పిచ్చుందేమిటి. సినిమావాళ్ళలా, రచయితల్లా? అందమయిన పేర్లంటే అభి

మానం కాబోలు. అయినా తన దరఖాస్తులో వ్రాశాడు కదా? బహుశా తనకి చెముడూ మూగా లేదని తెలుసుకుందుకేమో! చాలా చిత్రంగా అనుకోని తీరులో – వ్యక్తిగత విషయాల మీద సాగింది. ఇంటర్వ్యూ అంతా తన అభిరుచులు.... స్త్రీల పట్ల అభిప్రాయం వరకట్నం మీద ఉద్దేశం.... పెళ్ళిళ్ళమీద విశ్వాసం.... ఇలాగ వెర్రిమొహంవేసి బుద్ధిగా జవాబుచెప్పాడు. ఇదేం ఇంటర్వ్యూ? సబ్జక్టుమీద ఒక్క ప్రశ్నా లేదు. చేయబోయే ఉద్యోగం గురించి కాదు. బంధువులు పలకరించుకున్నట్లూ .... స్నేహితుల మాట్లాడుకున్నట్లూ.... నిజంగా యితగాడికి పిచ్చేందేమో!

అంతా అయ్యాక – "చూడు మిష్టర్ ఆనంద్....రాత్రి ఎనిమిదిగంటలకి ఈ ఎడ్రసు దగ్గర నన్నొకసారి కలుసుకోగలవా తప్పకుండా?" అన్నాడు.

"యస్సర్" అనేశాడు వినయంగా. ఇంటర్వ్యూ అయిపోయింది. అయినా హాలులోనే కూర్చున్నాడు. ఏం ప్రశ్న లడిగారు! సబ్జక్టుని బాగా టచ్ చేశారా? అంటూ మిగిలిన వాళ్ళడుగుతుంటే ఏంచెప్పాలో తెలియలేదు. ఇంతలో మరో యిద్దరు పూర్తి చేసుకొని వచ్చారు. వాళ్ళ మాటలనుబట్టి తేలినదేమిటంటే ఆఫీసరు ఛండశాసనుడు. సబ్జక్టులో చాలా తికమక పెట్టే ప్రశ్నలు వేసి – సమాధానం చెప్పలేకపోయేసరికి – యుకెన్ గో అనేశాడు. అది విన్నాక చాలా ఆశ్చర్యంవేసింది. తన ఇంటర్వ్యూ అలా జరిపాడేం? నిశ్చయంగా దీనిలో ఏదో తికమక ఉండితీరాలి.

"నాకు తెలుసు....శర్మ ఇంటర్వ్యూ చేస్తాడనగానే ఆశ వదులుకున్నాను. వొట్టి ఉద్దండపిండం" అని ఓ క్యాండిడేట్ అనేసరికి – "ఈయనేనా శర్మగారంటే?" అన్నాడు ఆనంద్.

"ఇంటర్వ్యూకనివచ్చారు. ఇంకా తెలుసుకోలేకపోయారా గురువుగారూ?" అని నవ్వి – "శర్మగారు నవ్వుతూనే కొంప లంటించే గట్రు. తినేవాడికూడా తెలియకుండా దెబ్బకొట్టే గట్రు. మనకీ అనుభవం మూడోసారి" అన్నాడు.

ఆనంద్‌కిక అక్కడ ఉండడం అనవసరమనిపించింది. ఒకటే ప్రశ్న. తను మూర్తి యిచ్చిన ఉత్తరం ఆయనికి చూపలేదు. ఐనా ఆయన తనతో మాట్లాడిన తీరు వేరుగా ఉంది. పైగా

తనని కలుసుకోమని కూడా చెప్పారు. ఎందుకు? బహుశా ఏలంచమో అడిగి ఉద్యోగం వేయించడానికా? అందుకే అయితే తననే ప్రత్యేకంగా ఎన్నుకుందు కేంకారణముంది?

రూము చేరుకున్నాడు. గది తలుపు తీయబోతుంటే బోయ్ అదేనవ్వు. ఈసారి కోపం రాలేదు. వాడి చేతిలో ఏదో రంగు కాగితం ముక్క...దానిమీద బొమ్మా, అంకెలూ.

"కాఫీ తెచ్చేదా సార్? అలసిపోయినట్లున్నారు ...."

ఆతిథ్యం.

"ఊఁ. తొందరగా" అని తలుపుతెరిచి లోపలికి వెళ్ళాడు.

బట్టలు మార్చుకుని ముఖం కడుక్కుని మంచంమీద కూర్చునేసరికి కాఫీ.

"నీ చేతిలో ఆ కాగితమూ? అంకెలూ ఏమిటి?" సిప్ తీసుకుంటూ.

"మీకు తెలియదాసార్ నిజంగా? బ్రాకెట్ ... చీటీ...."

"ఎందుకూ? నీకొచ్చే కొంచెం డబ్బులూ అలా తగలేస్తే..."

"ఆశసార్। ఆశ. రూపాయికి అరవై ఐదు రూపాయలు.... రాదేమో అని భయంవేస్తూనే ఉంటుంది. అంతలోనే వస్తాయేమో అని ఆశ పీకుతుంది. ఒక్కొక్కప్పుడు - రోజూ డబ్బులుండవు సార్.... ఎప్పుడేనా మీలాటి గొప్పవాళ్ళు పెద్ద టిప్‌లిస్తే - అదృష్టాన్ని పరీక్షించుకుంటాను సార్. తప్పే అనుకోండి..."

"ఎప్పుడేనా తగిలిందా?" కాఫీ కప్పు టేబులుమీదకి తోస్తూ సాసరులోకి.

"ఓసారి తగిలింది సార్. అదే దురదృష్టం. అంతవరకూ ఎప్పుడూ అర్ధరూపాయకి తక్కువ కాసేవాణ్ని కానుసార్. ఆవేళ జేబులో పదిపైసలే ఉంటే - అంతే వేశాను. తగిలింది." నీరసంగా.

"మంచిదేగా?"

"అర్ధరూపాయలు కాసినన్నాళ్ళూ రావడం మానేసి - పది పైసలు కాసినప్పుడే రావడం ఏంమంచిది సార్? ఆవేళ - వచ్చినందుకు - సంతోషం రాలేదుసార్. ఏడుపొచ్చింది."

"పోన్లే. ఎప్పుడూ పదిపైసల కంటే కాయకు. అదే మంచిది."

"అలాగేసార్ .... మీరు యివాళకూడా ఉంటారా సార్ రాత్రికి ?"

"ఉండవలసి వచ్చింది."

"ఉండండి సార్. మీరిక్కడికి రావడం యిదే మొదటి సారా సార్ ? బెజవాడ బలే టౌనుసార్. ఇక్కడ - డబ్బుండాలే కాని మాంచి మజాగా ఉంటుంది. ఎండలెక్కువే అనుకోండి. ఎ. సి. హోటళ్ళిక్కడున్నంతగా ఆంధ్రలో మరెక్కడున్నాయి సార్? డబ్బుంటే ఎండేం చెయ్యగలదు? ఏమంటారు ?"

"ఏమీ అనను కాని - కిందకివెళ్ళి నీ పని చూసుకో. నిద్ర రొస్తూంది -"

"రాత్రి నిద్రపోలేదా సార్ - ?" కోపం వచ్చేంతలో - "మీ కళ్ళు ఎర్రగా ఉన్నాయి. మాలిష్ కుర్రాణ్ని పంపించేదా సార్? వాడు వొళ్ళుపడితే మాంచి నిద్దరొస్తుంది."

"వొద్దు నువ్వెళ్ళు." కసురుకున్నాడు. బోయ్ వెళ్ళాడు. ఒక అరగంట మాత్రం నిద్ర. ఆ చిన్న నిద్రలోనే పెద్దకల. తనకి ఉద్యోగం వచ్చినట్లూ.... పెద్ద భవనంలో నివాసమూ... ఒంటరిగా కాదు. ఆమె ఎవరో? అందంగా ఉంది. చాలా అందంగానే ఉంది. కాని...ఆమె నెప్పుడూ చూసినట్లులేదు. పగటికలను సమీక్షించుకుంటూ ముఖం కడుక్కున్నాడు. విచిత్రం .. ముప్ఫయి నిముషాల నిద్రలో మూడు సెకనులుకూడా ఉండిఉండదాకల. కాని - అంత చిన్న కలలోనూ తన భవిష్యత్తు జీవితమూ ప్రతిఫలించడం సాధ్యమేనా! ఎందుక్కాదు? చిన్న అద్దంలో ఎంతో మేర ప్రతిబింబం కనిపిస్తుంది. చిన్న కంటిపాపతో ఎంతలేసి దృశ్యాలను చూడగలగడం లేదు? కొండ - అద్దంమందు కనిపించినట్లే. సుదీర్ఘమయిన జీవితం - చిన్ని కలలో యిమిడిపోవచ్చు. ఆశ్చర్యంగా ఉన్నా అతి సాధారణమయిన నిజమిది. ఇంతకీ - కలలో తనతో కాపురం చేసిన ఆమె ఎవరు? ఎవరో? అతనికి నిట్టూర్పు... చివరకి - ఉద్యోగమూ, వైవాహిక జీవితమూ కలలలో అనుభవించవలసిన దుర్గతి. ఎంత దయనీయమయిన స్థితి!

ముఖం తుడుచుకుంటూ రూము ముందరి గోడవద్దకు వచ్చి నిలుచుని - రోడ్డుమీదికి చూపులు సారించాడు. జనం... జనం.... వేల యీనినట్లు. అల్లరి అబ్బాయి చీమల పుట్టమీదకి రాయి విసరగా అవన్నీ చెల్లాచెదరై అటూ యిటూ దిక్కుతోచక పరుగెడుతున్నట్లు - రోడ్డుమీద బిలబిలలాడుతూ మనుషులు. నిజంగా వీళ్ళందరూ పనిమీదే తిరుగుతున్నారా ? ఉహుం. అయివుండదు ఈ నగరంలో సామాన్యుడికి గృహమనేది కేవలమూ నామమాత్రంగానే ఉంటుంది. శతవిధాలా ఆదివాస యోగ్యంగా మాత్రం ఉండదు. వీలున్నవాళ్ళు - దాన్నుంచి ఎప్పుడు బయట పడతామా అని ఎదురుచూస్తూ ఉంటారు. అవకాశం చిక్కితే ఆ కూప గృహంనుంచి బయటపడి - రోడ్డుమీదకు వచ్చి - స్వేచ్ఛా వాయువులు పీల్చుకుంటారు ఇంటికంటే రోడ్డు పదిలం. ఇదీ నిజం. అందుకే నగరాలలో రోడ్డకింత రద్దీ. తప్పదు. గాలీ వెలుగూరాని యిళ్ళల్లో - జైళ్ళలోలాగ గడపడం ఎవరి తరం ? ప్రభుత్వం ధర్మమా అని మనుషులు రోడ్లమీద నడిచేందుకు ప్రత్యక్షంగా పన్ను చెల్లించనవసరంలేదు. నిజంగా వరమే.

ఆనంద్ కూడా రోడ్డు మీదకి చేరుకున్నాడు. ఎనిమిది వరకూ ఎలా తిరిగినా ఫరవాలేదు. అప్పటికి మాత్రం నటరాజ్ హోటలు రూమ్ నంబరు ఆరుకి వెళ్ళి శర్మగారిని కలుసుకోవాలి. అంతకుమించి పనేమీ లేదు. తన ప్రమేయం అట్టే లేకుండానే మనుషుల మధ్యపడి చాలా దూరం వెళ్ళాడు. జనం ధర్మమా అని విజయవాడలో కొంత భాగాన్ని చూడగలిగా ననుకున్నాడు.

చీకటి పడకుండానే దీపాలు వెలగడం ప్రారంభించాయి. ప్రకటనల తాలూకు దీపాలు తమాషాగా కదులుతూ చూపుల నాకర్షించుకుంటున్నాయి. చాలామంది తనలాగే విండోషాపింగ్‌కే వచ్చారనిపించింది. సెకండ్‌హాండ్ బుక్ స్టాల్సు రా రమ్మని పిలిచేస్తూంటే అటువైపు వెళ్లాడు. ఎన్ని పుస్తకాలు ! అట్టమీద బొమ్మలు చాలా బాగున్నాయి. అట్టే ఖరీదుకాని ఓ పుస్తకం అరగంట చూసి, అప్పటికి పూర్తిగా చీకటిపడి అరున్నర అయింది. అలసిపోయినట్లనిపించగా హోటల్ చేరుకున్నాడు. దూరమయినా నడిచే. కృష్ణ నీళ్ళు ముఖంమీద పడగానే చల్లగా నవజీవం

నింపినట్లయింది. స్నానంచేసి – భోజనం కానిచ్చాడు. బట్టలు వేసుకుని – నటరాజ్ హోటల్‌కి బయలుదేరాడు. విజయవాడలో నటరాజ్ – ఖరీదయిన హోటలేకాదు, సుప్రసిద్ధి చెందిందికూడా. సినిమావాళ్లూ, పెద్దపెద్ద వ్యాపారస్తులతోపాటు ఘనత వహించిన ఆఫీసర్లుకూడా అక్కడే బస చేస్తూంటారు. కారణం–ఆ హోటల్లో అన్ని సౌకర్యాలు భారీఎత్తున లభిస్తాయి. చక్కని కార్పెట్లూ.... డిస్టెంపర్ చేసిన గోడలూ–ఎయిర్ కూల్డు గదులూ – ఇంద్ర భవనాన్ని తలపుకి తెస్తాయి. ఆరోనంబరు గదిముందు, సరిగ్గా ఎనిమిది గంటలకు – నిలబడి బజార్ నొక్కాడు.

తలుపు విడటం– ఆహ్వానం. తన నమస్కారం. సోఫాలో శ్రీ శర్మ కెదురుగా.

"మిస్టర్ ఆనంద్.... ఈ ఉద్యోగం నీకు తప్పకుండా కావాలా ?"

"ఊఁ" అన్నాడు తలవంచుకునే.

"బ్రహ్మచారివి కదూ ?"

ఔనన్నట్లు శిరఃకంపన. శర్మగారి చిరునవ్వు, తల పంకింపు.

"నిన్ను సూపర్‌వైజరుగా వేయడం నాకిష్టం లేదు."

ఉత్కపాటు. భయం.... సందేహం.... కోపం....

"అంతకంటే మంచిపోస్టు జూనియర్ అకౌంటెంటు.... నెలకి వెయ్యి రూపాయలు.

"హైదరాబాద్‌లో మకాం. క్వార్టర్సు ఫర్నిష్...."

"థ్యాంక్యూ సర్ థాంక్యూ...." తనే లోకంలో ఉన్నాడు?

"శిబిచక్రవర్తి ముందా ?"

దానకర్ణుడి ఎదుటా? నిజంగా తానెంత అదృష్టవంతుడు !

"అంతేకాదు. నీ వయస్సు ఇరవయి నాలుగు. ఏం? ఈ మంచి వయసులో ఇంకా ఒంటరితనమేమిటి? ఇప్పుడు కాకపోతే యింకెప్పుడు జీవితం అనుభవిస్తావు."

"నిజమేసార్. కాని–ఉద్యోగంలేని వాడికి–పెళ్ళి కర్హత ఎక్కడుంటుంది? ఉద్యోగం లేకుండా పెళ్ళి చేసుకుంటే – అంత కంటే నరకం యింకేమీ ఉండదు. ఆస్తిపాస్తులు లేనివాడికి–"

వినయం నిండిన కంఠంతో అన్నాడు.

"నువ్వన్నది నిజమే. ఈ రోజుల్లో జీవితమూ, సుఖాలూ అన్నీకూడా డబ్బుతోనే ముడి పడిఉన్నాయి. డబ్బుకొద్దీ సుఖం, ఏమంటావు ?"

"ఒప్పుకుని తీరవలసిన నిజంసార్. పేదరికం గురించి నాకు కొంచెం తెలుసు.

శర్మగారు మౌనం దాల్చారు. ఇంతలో బాయ్ వచ్చాడు.

"ఏం తీసుకుంటావు?" చనువుగా అడిగాడు. ఆనంద్ మొహమాట పడిపోతూ -

"నాకేమీ వద్దుసర్. మీరు తీసుకొండి-" అన్నాడు.

"మిస్టర్! మనం చాలా దగ్గరగా వచ్చి కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడుకోవలసి ఉంది. ఇలా దూరంగా నీలో నువ్వు ముడుచుకుపోతే ఎలా? ఒక మాట చెబుతాను విను. ప్రపంచం ఎలా ఉందంటే-ధైర్యంగా, చొరవగా ప్రవర్తించ గలిగేవాడినే బతకనిస్తుంది. అటువంటి వాళ్ళని దాసోహం అంటుంది- పిరికి వాళ్ళని భయపెడుతుంది. బతకనివ్వదు. ఇది రాకెట్ల యుగం. మనిషి కూడా రాకెట్ లా ముందుకు దూసుకుపోవాలి. పాత నమ్మకాలనుంచీ, పద్ధతుల నుంచీ విముక్తి - చైతన్యం ... అప్పుడే ప్రోగ్రెసు. నువ్వు స్మార్ట్ అయినవాడివని నేను గ్రహించక పోలేదు. కాని - నువ్వింకా తెలుసుకోలేక పోతున్నావు. నేను- ఇంటర్వ్యూ ఆఫీసర్ ని కానిక్కడ .. ఫ్రండ్ ని. ఇంకా ఎక్కువ కావాలని కోరుతున్నవాడిని..."

"థాంక్యూసార్. మీ అభిమానానికి...."

"చెప్పు ...ఏం తీసుకుంటావు!"

"కా ఫీ ..."

పకపక నవ్వేశాడు శర్మ. "నే నడిగిందదికాదు.... హాట్ డ్రింక్స్ .. బ్లాక్ డాగా, ఓల్డ్ మాంక్ .... కింగ్ ఫిషర్ ...." నవ్వుతో మాటలు అస్పష్టమయ్యాయి. ఆనంద్ వణికిపోసాగాడు. అతనికి ఏమిటో ఐపోయింది. ఆ గది....గదిలో ఆ మనిషి....ఆ మనిషి మాటలు....నమ్మశక్యం గాకుండా ఉన్నాయన్నీ. భారత దేశంలోని పల్లెటూరివాణ్ణి - అమాంతం న్యూయార్కు నడి

రోడ్డులో వదిలేస్తే- అతని కెలా ఉంటుందో అటువంటి పరిస్థితి.

"ప్లీజ్ సార్! నాకు అలవాటులేదు. ఇంతవరకూ ఒక్కసారీ తీసుకోలేదు. నిజంగా....మళ్ళీ ఆ పేర్లు చెప్పమన్నా చెప్పలేను....క్షమించండి....మీరు...." తప్పు చెయ్యనివాడు-చెయ్యలేనివాడు-చేయనితప్పు తాను చేసినట్లు ఆరోపించబడితే కంగారు పడినట్లే అతనూ కంగారు పడిపోయాడు.

"గుడ్ బాయ్!....ప్రిన్సిపుల్స్ మంచివే, అవంటూ ఉంటేనే ఎప్పుడయినా బ్రేక్ చెయ్యడానికి అవకాశముంటుంది. అల్ రైట్, కోక్ తెప్పిస్తాను నీకు."

రెండు నిముషాల్లో - వాళ్ళ మధ్య టేబులు పానశాలా, మాంసాహార భోజనశాలా ఐపోయింది. తండూరీ చికెన్ ... చాలా చక్కగా డ్రెసు చేసి.

ఆనంద్ భయంభయంగా కోక్ తీసుకోసాగాడు - శర్మ కాక్ టెయిల్ సేవిస్తుంటే, అతని పెదవుల మధ్య స్ట్రా కదుఇతూ - అతని ఆంతర్యంలోని అలజడి కద్దం పడుతూంది. ఉండీఉండీ శర్మగారిని దొంగచూపులు చూస్తున్నాడు. తాగుతున్నది కోక్ అయినా ఆతనికి - శర్మగారి కాక్ టెయిలు కంటే నిషా కొలుపుతున్నట్టు భ్రమ కలుగుతూంది. కొంత సేపు...గ్లాసుల్లో కొంత భాగం, ప్లేట్లలో కొంతమేర ఖాళీఅయ్యాక- కాలం గడిచాక- హఠాత్తుగా శర్మగారు విల్చున్నారు. ఎన్నికల అభ్యర్థి అంతవరకు వ్యక్తిగత విజయాలు మాట్లాడుతూ ఓట్లు అడగబోయేముందు హఠాత్తుగా మారిపోయినట్లు... ఆయన బీచిలో... ఫ్రండ్ తో-అంతవరకూ సినిమాల గురించి మాట్లాడుతూ సరదాగా ఐలవ్ యు 'డార్లింగ్' అనబోయి బాయ్ ఫ్రండ్ లా.

"నెలకి వెయ్యిరూపాయల ఉద్యోగం... ప్లస్... సాధారణంగా నువ్వు చూడనంత అందమైన అమ్మాయితో పెళ్ళి — చెయ్యి వేశాడు. ఆ స్పర్శ ... అతన్ని మరీ ప్రభావితం చేసి ప్లస్... మీ కపుల్ కి పది పదిహేనువేల బ్యాంక్ బాలన్సూ ... ఆనంద్ .... ఎలా ఉంటుంది!"

గోళ్ళులేని స్పాంజి పంజా పులి విసిరినట్లు; సముద్రంలో స్టీమ్ బోట్ జర్కులా- ఆకాశం వంగి ముద్దుపెట్టుకోమన్నట్లు -

వందేళ్ళ కిందటి మధువు కడుపారా సేవించినట్లు; కళ్ళముందు దెబ్భయ్‌రంగులు తిరుగుతున్నట్లు- క్లోరోఫామ్ వాసన చూస్తున్నట్లు.... ఉక్కిరి బిక్కిరిగా.... అయోమయంగా.... ఆనందంగా.... భయంగా.... అద్భుతంగా.... ఆత్రంగా.... కొన్ని క్షణాలపాటు గుండె కొట్టుకోడం ఆగిపోయినట్లు.... బోలెడన్ని చెప్పెయ్యాలనుకుని గొంతు విడనట్లు- స్పృహ తప్పుతున్నట్లు - అలాగ ఐపోయాడు ఆనంద్.

శర్మగారి నవ్వు- సముద్రపు కెరటాలలా.... తీయని వాసనలను పరుస్తూ.... కమ్మని వలలను విసురుతూ.... ఇంపైన ఇంద్రజాలంలా.... వానజల్లులా. ఆయన- ఆనంద్ భుజంమీద వదిలింది. ఆ నవ్వు- అతన్ని కాదనలేనంత బలహీనుణ్ని చేసి వదిలింది.

"మిస్టర్! ... ఈ ఫోటో చూడు...." పర్సులోంచి ఫోటో తీసి ఆనంద్ కిచ్చాడు.

మళ్ళి కాక్‌టెయిలులో పడిపోయాడు.

మధువు కరుగుతూంది. మాంసం తరుగుతూంది.

ఆనంద్‌కి మైకమే కమ్మింది. ఎక్కడిదీ అందం? ఇంత అందం.... మనిషేనా!

"ఇప్పుడు చెప్పు....ఇష్టమేనా?"

ఆ ప్రశ్న అనవసరం-అని ఆయనకు తెలుసు, ఆనంద్‌కీ తెలుసు

"కాని ... ఆమెగారికి.... నేను...." ఇన్‌ఫీరియారిటీ ...

...రోసా యిస్తున్నట్లు- మందహాసం. "ఆ విషయంలో ...నం అనవసరం. రేఖ- గుడ్డిదీ కాదు, మూర్ఖురాలూ ... అమ్మాయి!" సగర్వంగా అన్నారు. ఆనంద్‌కింకా ...ం మిగిలిపోతూనే ఉన్నాయి.

...ర్‌ద బెస్టు హెల్తాఫ్ వుడ్‌బి కపుల్-" గ్లాసు ఖాళీ

...నంద్ తెల్లబోయి చూస్తున్నాడు.

...దసాలు వదలాలి. నేనొక్కడే అనుకున్నాను. అబ్బా

యికి ఆస్తిపాస్తు లుండనక్కరలేదు. రేఖ పక్కన అమరాలి. హృదయమున్న మనిషై ఉండాలి. బస్.... నేను కోరుకున్న లక్షణాలన్నీ నీలో ఉన్నాయి. నా నిర్ణయం మీద రేఖకి అపారమయిన విశ్వాసం. కనుకనే డాడీ నువ్వే సెలక్టు చెయ్యండి. ఆమెకి తెలుసు-నేనామె మేలుకోరే ఏమయినా చేస్తానని. అన్నట్లు అల్లుడూ-"

ఆనంద్‌కి కరంట్‌షాక్‌లా తగిలిందాపిలుపు. తల దించేసుకున్నాడు.

"రేపు - రేఖకి చెప్పకేం....నేను తాగుతానని. ఇది నేనూ చాల యిష్టపడి కాదు. తప్పనిసరి. జ్ఞాపకాలనుంచి... వర్తమానం నుంచి - పారిపోవాలని. సారీ.... ఈ శుభసమయములో ఆ బాధామయ గాథలు దేనికి? .... చాలా వేళయినట్లుంది. డ్రయివర్‌ని పిలుస్తాను. వెళ్దువుగాని ..పోనీ....యిక్కడే ఉండిపోతూడమా?"

"నేను మా వూరు వెళ్లాలి...." గొణిగాడు.

"ఆల్‌రైట్" డ్రయివరు వెళ్ళి టికెట్టూ, నీ ప్ర[illegible]యాణపు ఏర్పాట్లూ చూస్తాడు. ఇది-నా ఎడ్రసు. రేఖని చూడాలని [illegible]ఉంటే వచ్చేయ్. మీ వాళ్ళని .... అడగాలికదూ? అడిగి-నీ ని[illegible]ర్ణయం రాసేస్తే-వీలయినంత త్వరలో వివాహమూ, ఉద్యోగమూ [illegible]రిపించేస్తాను. ఓ.కె. కొంచం తొందరపడు, గుడ్‌నైట్.

డ్రయివర్ రాకపోతే ఆనంద్, ఆ హోటలు[illegible]ంచి బయటకు తోవమరచి పోయేవాడే. అతనికంతా ఉక్కి[illegible]క్కిరిగా ఉంది. జరిగినది కలకాదనీ, నిజమే అని నిరూపించడానికే అన్నట్లున్నాయి కారూ-దానితో హోటల్‌కి వచ్చేసరికి బోయ్...చిరునవ్వు. ఈ[illegible] నవ్వాడు తెచ్చిపెట్టుకుని, రైలుకింకా గంటపైన[illegible] డ్రయివర్ టికెట్టుకోసం స్టేషన్‌కి వెళ్ళాడు.

"కారు మీదేనేమిటి సార్?"

కాదన్నట్టు తల ఊపాడు. బోయ్ సామాను చేస్తున్నాడు.

మహాజ్ఞానిలా అన్నాడువాడు - "మీదే అ[illegible]

దానికేముంది...ఇవాళ కాకపోతే రేపయినా మీరు కారుకొని తీరతారు-"

అసాధ్యం అనిపించలేదు ఆనంద్‌కి...కొందరు రచయితలు రాసే రచనలలోలాగ జీవితంలో కూడా హటాత్తుగా ఏమయినా జరగవచ్చు. ఊహించని మలుపులు తిరగవచ్చు. ఆశించని ఫలితాలూ, ఫలాలూ అందవచ్చు. రేపేం జరుగుతుందో చెప్పడం ఎంత కష్టమో - జరగనిదేదో చెప్పగలగడమూ అంతే కష్టమూ.

వీడు - యీ బాలుడి మాట నిజమయినా కావొచ్చు. అదృష్టం రైలులాంటిది. వదిలితే చాలా దూరం పరుగెత్తుతుంది. చూడబోతే తన జీవితం మలుపు తిరిగేటట్లే ఉంది. ఇంకా సందేహం అనవసరం. నిత్యశంకితుడు కూడా దుఃఖభాజనుల జాబితాలో వాడేఅని చిన్నయసూరి చెప్పనే చెప్పాడు. కనుక తన ఆలోచనలనూ, దృక్పథాన్నీ అలాగ మలుచుకుని- అదృష్టాన్నీ, చక్కని జీవితాన్నీ ఆహ్వానించడానికి అన్నివిధాలా సంసిద్ధుడై ఉండాలి.

గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నాడు. శరీరంలోకి కొత్త జీవం వచ్చినట్లయింది. డ్రయివరు- సూట్‌కేసుని కారులో పెట్టి- తలుపుతెరచి పట్టుకుని తనకోసం ఎదురు చూస్తున్నాడు. బోయ్ తనవంక ఆశగా ఆత్రంగా చూస్తున్నాడు. వాడి కొక రూపాయి నోటు యిచ్చేసి- కారువేపు అడుగులు వేశాడు.

"దయ ఉంచండి సార్..." హోటల్‌బాయ్ నవ్వు-

హుందాగా కారులో కూర్చున్నాడు. మెత్తగా కదిలింది కారు. జీవితంలాగ మలుపులు తిరుగుతూ పరుగెత్తసాగింది. రిక్షాలోలాగకాకుండా కారులో కుదుపులు సుఖం యిస్తున్నాయి. కితకితలు పెట్టినట్లు. వెనక్కి-వాలి- దుర్గగుడి మీది దీపం- క్షణం వేపు- చాలా ప్రకాశంగా. ఎందుకో నవ్వుతున్నట్లు- అంతలోనే దృష్టి తప్పించుకుని.

స్టేషనులో దిగి-ప్లాట్‌ఫారం మీదికి నడక. నిరీక్షణ అవసరం లేకుండా ప్లాట్‌ఫారంమీద తనకోసమే ఎదురు చూస్తున్నట్లు రైలు. మొదటి తరగతిపెట్టెలో-సూటుకేసుంచి-తనకి సీటుచూపి- ఆపిల్సు, ద్రాక్షలూతెచ్చి అతి వినయంగా నిలుచున్నాడు. తను -

టికెట్ తాలూకు డబ్బు యివ్వబోయాడు.

"అయ్యగారు తీసుకోవద్దన్నారు సర్."

ఇంకేమీ అనలేదు. రైలు కూతకూసింది. వాడు రైలు దిగి పోయాడు. రైలు విజయవాడ ప్లాట్‌ఫారంమీద ప్రకటనల తాలూకు బొమ్మలూ, దీపాలూ మెల్లమెల్లిగా వెనక్కి, రైలు-ముందుకి. రైలు పెట్టెలో సీలిదీపాలు. నిద్రరానితనం. బెర్తుమెత్తగా ఒక్కసారి రేఖ ఫోటో, ప్యాంటు అందుకుని, జేబులోంచి- ఫొటోతోపాటు ఉత్తరం, శర్మగారికి మూర్తి రాసినది-అరె! నాలిక కరుచుకోడం. మళ్ళీనవ్వు. రికమెండేషను లేకుండానే కథ యింతవరకూ విజయవంతంగా నడవడం-కించిత్ గర్వం. రైలుపరుగు.... దీపానికి దగ్గరగా ఫొటోవిజరిపి రేఖ తనని చూస్తున్నట్లు....చక్కనికళ్ళతో చిలిపిగా తనని పిలుస్తున్నట్లు.... తీయగా పిలుస్తున్నట్లు...తనతో జీవితాన్ని పంచుకోనున్నట్లు .... అందంగా ... యింకా చాలా అందంగా... సజీవంగా.... చైతన్యవంతంగా....

రైలు కుదుపు.... త్రుళ్ళిపాటు .... పాయింట్స్ సరిగా లేవు కాబోలు అరే! స్వప్న... రేఖ స్థానంలో .... అందంగా కాకుండా సాదాగా, తీయగా పాడుతూ, మనసారా స్నేహంతో.

క్షమించు స్వప్నా క్షమించు. ఇది ఒక జీవితం. నేనేమీ చేయలేను. ఆమె అంతర్ధానం. శివరంజని రాగం-హృదయంలో తీయగా, బాధగా, రైలు పరుగు. తనని తాను మరచిపోయిన తనం. హృదయం భారమై కనురెప్పలు కూడా అలసి మూత పడి తెలియనిక్షణాలలో నిద్రలోకి జారుడు.

తెలివివచ్చేసరికి వెలుగు. తను దిగవలసిన స్టేషను దగ్గర పడడం - అటెండరు వచ్చిలేపడం. తను కాఫీతెమ్మన్నాడు. స్టేషనులో ఆగిన రైలు-చూపులతో కిటికీలోంచి ప్లాట్‌ఫారమ్ సర్వే-నిండా మనుషులు పెళ్ళి.పందిరిలోలా. నిత్యమూ అంతే. అబ్బ! ఎంతమంది! రోజూ ఇంతమందికీ పనుల మీద ప్రయాణాలు!...పిచ్చికాకపోతే ఏమిటి ఆలోచనలు?

కాఫీ వచ్చింది. ఫరవాలేదు. సిప్‌చేస్తూ కూర్చున్నాడు. పూర్తయింది. అటెండరు కప్పూ సాసరూ తీసుకుపోయాడు. ఎదుటి బెర్తుమీది మనిషి యింకా నిద్రపోతూనే ఉన్నాడు. అతని

లగేజీ చూడబోతే చాలా ధనవంతుడిలాగే ఉన్నాడు. బిజినె! మనిషి కాబోలు మళ్ళీ అవకాశం రాదన్నట్లు తెగపడి నిద్రపోత న్నాడు. కంపార్ట్‌మెంటులో యింకెవ్వరూ లేదు.

నవ్వొచ్చింది, విజయవాడ వెళ్ళేటప్పుడు మనుషులెక్కువా జాగా తక్కువా. ఇప్పుడు జాగా ఎక్కువా, మనుషులు తక్కువా మార్పు. తమాషాగా ప్రయాణంలోనే కాదు. తనలో మాత్రం ఎంతమార్పు! విజయవాడ వెళ్తున్నప్పుడు తన జీవితంలో అనిశ్చయం...అస్థిరత....ఇప్పుడు?

అక్కయ్య తను చెప్పే వార్తలువిని మొదట నమ్మదు తెల్లబోయి చూస్తుంది నిజమేనా అని పదే పదే అడుగుతుంది ఉహుం. రెండు వార్తలూ ఒక్కసారి చెప్పకూడదు. మొదట ఉద్యోగం గురించి తరువాత రేఖ గురించి...అలాగ చెప్పాలి.

రైలు పెరిగెడుతూంది. చెట్లూ, కొండలూ వెనక్కి జార కుంటున్నాయి. ఆనంద్ సీటువెనక్కి జారబడ్డాడు. రేఖ ఫోటో మరోసారి చూడాలనిపించింది. కాని చూడలేదు. ఎదుట సీట మీద పడున్న వార్తాపత్రిక అందుకున్నాడు. రాజకీయాల మీ ఆసక్తిలేదు. మెల్లగా చూసుకుంటూ పోయాడు. ఒకచోట చిన్న కాలమ్. ఒకతను ఆత్మహత్య చేసుకున్నాడు. ప్రయత్నించ ప్రయత్నించి ఎంతకీ ఉద్యోగం దొరక్కపోతే బతకలేక చచ్చి పోయాడు. ప్చ్...జాలిగా నిట్టూర్పు అతని ఆత్మకు శాంతి లభించు గాక!

వచ్చేదే తన స్టేషను. తను దిగిపోతాడు. ఐనా ఎదుట బెర్త్ మనిషి లేవలేదు. లేవడు. అతని నిద్ర అతనిదే. నిద్రకు మొహంవాచినట్లు-ఇంతవేళయినా లేపదేం? నిజంగా ఒంటరితనం చాలా చిరాకు. కబుర్లు చెప్పుకుందుకుకూడా మనిషి లేకపోతే కాలం గడిచేదెలా? మళ్ళీ పేపరు ఆసక్తిగొల్పని వార్తలు.

రైలుఆగింది. సూట్‌కేసుతోదిగాడు. పోర్టర్‌వస్తున్నానన్నా వద్దని తనే మోసుకుంటూ స్టేషన్ బయటికివచ్చాడు. ఆ పోర్టర్ ముఖంలో ఒక్కసారిగా ఎంత నిరాశ! పైగా తనవేపు అదోలా చూశాడు-వింత జంతువుని చూసినట్లు. ఔను. తన ఫస్టుక్లాస్ నుంచి దిగాడు. కనీసం ఆ క్లాసు గౌరవం కోసమైనా - బరువులేకపోయినా

పోర్టర్‌కి సూట్‌కేసు అందించాలి. కాని-తాను అలాగ చెయ్యక - పుస్తుక్లాసుకి అవమానం కలిగించాడు. డిగ్నిటీ ఆఫ్ లేబర్! .... కాని పోర్టర్ తెలుసుకోడు.

రిక్షా యింటిముందు ఆగింది. ఆనంద్ లోపలికి నడిచాడు. ద్వారం దాటకుండానే సూచనప్రాయంగా తెలిసివచ్చింది- యింటి వాతావరణం ఎప్పటిలా లేదని ఏం జరిగింది? గదిలోకి నడిచాడు, బావగారు వాలుకుర్చీలో కూర్చున్నారు. అక్కయ్య - గోడకానుకుని - తలదించుకుని ఉంది. నిశ్చయంగా ఆమె దేనికో బాధపడుతున్నట్లుంది. అందుకు ప్రత్యక్ష సాక్ష్యం ఆ గదిలో నిండిన నిశ్శబ్దం.

"అక్కయ్యా," పిలిచేవరకూ ఆమె యీ లోకంలోకే రాలేదు. "ఏమైంది?" క్షణంలో ఆమె ముఖంలో మార్పు. పెదవుల మీద మందహాసం పూసుకుంది. ఒక్కసారి బావగారివేపు చాలా చెబుతున్నట్లు కళ్ళతోనే చూసింది. ఆయన గ్రహించినట్లు తలపంకించారు కూడా. కళ్లుకూడా మాట్లాడుకోగలవు-అప్పుడపుడు "ఏమీకాలేదు. నువ్వు త్వరగా ముఖం కడుక్కుని వస్తే విశేషాలు చెబుదువుగాని," ఆనంద్ ముఖం కడుక్కుని వచ్చి కూర్చున్నాడు లుంగీ కట్టుకుని. అక్క కాఫీ తెచ్చింది. "ఉద్యోగం - దాదాపు వచ్చేసినట్లే.—" నవ్వాడు.

ఒక్కసారి అక్కయ్య కళ్ళలోకి వెలుగు వచ్చింది. ఆమె ముఖంలో ఆనందం తొంగిచూసింది

"అమ్మయ్య! ఇంక నువ్వు ఉత్సాహంగా ఉంటావు. అదే పదివేలు."

"సరేకానీ - యీ ఫోటో చూడు-" అందించాడు.

ఒకటి రెండు నిమిషాలు తదేకదృష్టితో ఫోటోలోకిచూసి- "చాలా అందంగా ఉంది. ఎవరేమిటి?" నవ్వింది. ఆనంద్‌కి సిగ్గు ముంచుకొచ్చింది. ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?

"ఓహో! సిగ్గుకూడా వచ్చిందే! ఐతే వ్యవహారం చాలా వరకూ వచ్చి ఉండాలి. ఈ ప్రేమ పుట్టుక ఎక్కడ? ప్లాట్‌ఫారం మీదా, రైల్లోనా? ఇంతకీ నువ్వు వెళ్ళింది ఏ యింటర్వ్యూకి? ఉద్యోగానికా, ప్రేమకా?" బావగారు ఫోటో చూస్తూ అడిగాడు.

ఒక్కసారి వాతావరణం మారిపోయింది.

"అదో పెద్ద కథ ... ఔను. కథలోలాగే జరిగిందంతా. అన్నట్లు నాకు దొరకబోయేది చాలా పెద్ద ఉద్యోగం.నేను అప్లయ్ చేసింది కానేకాదు."

"నువ్వు వివరంగా చెప్పకపోతే మా కర్థంకాదు. ఎంత పెద్ద కథ అయినా మేము వినడానికి సిద్ధంగానే ఉన్నాం. ఆలస్యం నీదే."

"ఈ ఫోటోలో అమ్మాయిపేరు రేఖ. రావ్ అండ్ రావ్ ఇంపోర్ట్సు అండ్ ఎక్స్‌పోర్టులో చాలా పెద్ద ఆఫీసరుగారు శర్మ... వారి అమ్మాయి బి.ఎ. చదివింది. శర్మగారు నన్ను ఇంటర్వ్యూ చేశారు. వాళ్ళమ్మాయి రేఖను నేను - పెళ్ళి - చేసుకుంటే..."

"చేసుకుంటే ?" ఆత్రంగా చూసిందక్కయ్య.

"వెయ్యి రూపాయల ఉద్యోగం... క్వార్టర్సు... పదివేల బ్యాంకు బాలెన్సు... రేఖ ... సరే... ఇవన్నీ..."

"మంచి ఛాన్సే" నవ్వారు బావగారు.

అక్కయ్యమాత్రం గంభీరంగా ఉండిపోయి, హఠాత్తుగా అడిగింది "చేసుకోకపోతే ?"

"చేసుకోకపోతే - ఏమీఉండదు, మళ్ళీ నేనూ నా నిరుద్యోగమూ, ఇంటర్వ్యూలకీ,దరఖాస్తు ఫారాలకీ డబ్బు తగలేస్తూ - ఫలితం కనిపించక నిట్టూర్పులు విడుస్తూ- దినమొక యుగంగా - బ్రతుకు వృధాగా - గడపవలసిందే. ఏదయినా గవర్నమెంటు జాబ్ నా ముసలితనంలో వచ్చినా అందులో యింత జీతమూ ఉండదు. సుఖమూ ఉండదు.

"ఐతే నువ్వొక నిశ్చయాని కంటూ వచ్చేశావన్న మాట !?"

"ఇందులో ఆలోచించడానికి రెండోవేపంటూ ఏముందని? నిజానికి ఆయనకి నేను వాగ్దానం చేసినట్లే."

"ఆనంద్ !" ఆత్రత పట్టలేనట్లు అరిచిం దక్కయ్య. అతను త్రుళ్ళిపడ్డాడు.

"తంతే బూర్లె గంపలో పడ్డాడు మీ తమ్ముడు-నువ్వెందు కలా ఐపోతావ్ ?"

"అవి బూర్లె గంపో, ముళ్ళ కంపో మీకెలా తెలుసు ?"

"ఏదీ తెలియదు కనుకనే మనిషి గురించి మంచిగానే అనుకోడం"

"పెళ్ళంటే ఒకనాటి మాటకాదు కదా ! జీవితం అంతటికీ సంబంధించినది."

"చేసుకునేది నీ తమ్ముడూ. ఆ అమ్మాయీ. వాళ్ళ యిష్టమే మనం ఆలోచించాలి. ఒక విషయం... మన పద్ధతుల్లో పెళ్ళి ఎప్పుడూ లాటరీయే. కష్టసుఖాలు కాలమే నిర్ణయించాలి. శారదా ! పెళ్ళికి ముందు నేనెప్పుడూ ఊహించనయినా ఊహించలేక పోయాను - నువ్వింత మంచిదానివనీ - నన్నింత సుఖపెడతా వనీ !"

"ఇప్పుడు - ముసలికాలపు ముచ్చట్లు దేనికిలెండి..."

"అన్యాయం. నన్నప్పుడే ముసలివాడిని చేసేస్తున్నావు."

"సరే. మాటలకేం.. పెరుగుతూనే ఉంటాయి. పదండి. భోజనాలు కానిద్దాం-"

ముగ్గురూ వంటింట్లోకి చేరుకున్నారు. విజయవాడ విశేషాలు చెప్పుతోంది అక్కయ్య. ఆనంద్ పరధ్యానంగా ఆమెమాట వినిపించుకోలేదు. అతనికి కొంచెం ఆశాభంగం అయింది. తను ఉద్యోగం విషయమూ, రేఖ విషయమూ చెప్పేసరికి అక్కయ్య చాలా ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతుందనీ, తనని ఎన్నో విధాల అభినందిస్తుందనీ ఆశించాడు. కాని తన ఊహలో అధిక శాతం అబద్ధమే అయింది. ఎందుకని ? తను తెచ్చినవి నిజంగా చాలా శుభవార్తలు కావూ? ఆమె ఆలోచన లేమిటి ?

భోజనాలుకాగానే కొంచంసేపు విశ్రాంతి తీసుకుని బావ గారు వెళ్ళిపోయారు.

తను ముందుగదిలో మంచం వాల్చుకున్నాడు. నిద్రకోసం కాదు.

వంటింటిపనులు ముగించుకుని చేతులు తుడుచుకుంటూ- వక్కపలుకు నములుతూ వచ్చింది అక్కయ్య. "నిద్రపోతావా?"

"ఉహూ" లేచికూర్చున్నాడు. "ఊరకే అలా మేను వాల్చా నంతే."

"నీతో కొంచం మాట్లాడాలి" ఆగి. "నువ్వు రేఖా వాళ్ళ నాన్నగారికి మాటయిచ్చేశావా ?"

"ఔను." నేరంచేసి - ఒప్పుకున్నట్లన్నాడు. కాని - నేర మేమిటో తెలీదు.

"పెళ్ళిలాటి ముఖ్య విషయంలో పెద్దవాళ్ళనిసంప్రదించాల నయినా నీ కనిపించలేదూ ? అక్కయ్యనే....నువ్వు స్వతంత్రు డివే....కాని....ఒక్కమాట నా చెవినివేస్తే నేను కాదంటా నను కున్నావా? నీయిష్టం కాదనగలనని అనగలనని...."

"అక్కయ్యా!" అతనికి కన్నీళ్ళ పర్యంతం ఐంది. "క్షమించు. నీకు అదంతా ఎలాగ చెప్పాలో అర్థం కావడంలేదు. చూచాయగా చెబుతున్నాను. నువ్వే అర్థంచేసుకో. ఉక్కిరిబిక్కిరి చేసే-కంగారుపెట్టి వాతావరణంలో-నన్ను నాకు మిగలనివ్వని పరి స్థితుల్లో-నాకళ్ళముందు శర్మగారు కలల బొమ్మలు కదిల్చారు. రంగురంగుల ఆశలచిత్రాలు ప్రదర్శించాడు. మైమరచి-ఆత్రతతో ఔననేశాను. విన్నేకాదు, నన్నునేనూ మరచి...."

"పెళ్ళంటే తొందరగాఉంటే....నాకు చెప్పలేదేం ?"

"తొందర-పెళ్ళికోసంకాదు. ఉద్యోగానికి"

"ఉద్యోగంకోసం-పెళ్ళికి తలవంచావన్నమాట!" జాలిగా విట్టూర్చింది. "ఇది ఏమయినా మంచిపనేనా? పెళ్ళంటే వ్యాపారం అనే దృక్పథంలోనే నువ్వుంటే.... పెళ్ళిని లాభనష్టాల వ్యవహా రంగానే పరిగణిస్తే-నువ్వు దాంపత్యజీవితంలో ఓడిపోతావేమో? నిజంగా నీ వ్యక్తిత్వం యింత బలహీనమయినదనే అనుకోలేక పోయాను."

"రేఖ అంటే నాకు యిష్టమే అక్కయ్యా!"

ఆమె నవ్వింది. జాలిగా, బాధగా. "రేఖ గురించి నీకేం తెలుసు ?"

"ఆమె ఫొటో చూశానుగా ? పైగా వాళ్ళ నాన్నగారు చాలా చెప్పారు."

"ఫొటో చూసీ-వినీ- పెంచుకున్న యిష్టం! ఔనా ? ఫొటోలని పూర్తిగా నమ్మడం వివేకమేనా ? మూగ అమ్మాయికి ఫొటో తీస్తే...."

"అక్కయ్యా!" భరించలేక పోయాడు ఆనంద్.

"రేఖ మూగదవి కాదు. తమ్ముడూ! మనిషి-మనిషిని చూడగానే మొదటిసారి అభిప్రాయమంటూ ఏర్పడుతుంది. వివాహం చేసుకునే ముందు అబ్బాయి అమ్మాయి చూసుకోడం యిందుకే. చక్కని అభిప్రాయం ఏర్పడితే-ఆ వివాహం సఫలం ఔతుంది. నువ్వు రేఖను చూశాక అంగీకరిస్తే బాగుండేది—"

"కాని అక్కయ్యా!.... పెళ్ళి చూపుల పేరిట-అమ్మాయిని బజారులో వస్తువును పరిశీలించినట్లు పరిశీలించడం. నాకు న్యాయమనిపించదు. అభిమానం ఉన్న అమ్మాయికి అది నరకం. ఆమె నవమానించడం "

"నీ ఉద్దేశాలు మంచివే. కాని యివిఎలా పరిణమిస్తాయో? సరే తమ్ముడూ, అయిందేదో అయింది. నువ్విలా నిర్ణయించుకున్నాక నేనింకేమి చెప్పను. మీ దాంపత్యం చక్కగా సాగాలని దేవుణ్ని ప్రార్థిస్తానంతే."

అతని కళ్ళు విడినట్లనిపించింది. అక్కయ్య మాటలు పరమసత్యాలు. రేఖని చూడకుండా తను ఔనువన్యెడం పొరపాటే. కాని ఇప్పుడేం చెయ్యగలడు. అది సరిదిద్దుకోలేని పొరపాటు. తియ్యని ఫలాలిచ్చే పొరపాటేమో? చెప్పవేం. జీవితం చాలా తమాషాలు చేస్తూంటుంది. ఐనా-రేఖ లాంటి అందమయిన అమ్మాయితో జీవితం చక్కగాకాక మరోలా ఎలా సాగుతుంది? ఉద్యోగం కావలసినంత డబ్బు. అందమయిన భార్య. ఇన్ని ఉంటే యిక సుఖంకాక మరేమిటి?

అక్కయ్య వెళ్ళిపోయింది అక్కడినుంచి. అతని కర్థం కాకుండా మిగిలిపోయిందొక విషయం. ఆడవాళ్ళ ఆలోచనలు వేరుగా ఉంటాయెందుకని? వాళ్ళకి సహజంగా ఆలోచించడమూ, పరిస్థితులను ఉన్నవున్నట్లుగా బేరీజు వేయడమూ చేతకాదా? అనుమానా లెక్కువ. అనవసరపు ఆలోచనలూ ఎక్కువే. కాకపోతే అక్కకి రేఖ ఎందుకు నచ్చలేదు? రేఖలో ఏం తక్కువని?

ఆనంద్‌కి నిద్ర వచ్చేసింది. కలలు .. కలలో రేఖ.

"పోస్టు-" అన్న కేక. మెలకువ...గేటు దగ్గరికి బద్ధ

కంగా నడక. అతని చేతిలోంచి కవరందుకున్నాడు. తనకే! ఎవరు రాశారో?

చింపాడు. ఆహ్వాన పత్రిక.... మళ్ళీ ఉత్తరం. స్వప్న నుంచి. ఆమే రాసింది!

"డియర్ ఆనంద్, నేను అక్కడికి వస్తున్నాను. కారణం - ఆహ్వాన పత్రిక చూస్తే తెలుస్తుంది. తప్పకుండా రా. కొంచం మాట్లాడుకుందాం."

తప్పకుండా వస్తానని ఎదురుచూస్తాను ... కేవలం నిన్ను కలుసుకోవచ్చుననే యీ కార్యక్రమాని కంగీకరించాను...... స్వప్న—"

ఎవరో లలితకళాసమితివాళ్ళు స్వప్నకి సన్మానం చేస్తారట. సన్మానానంతరం ఆమె సంగీతం ఉంటుందట. ఆహ్వాన పత్రికలో ఆ వివరా లున్నాయి. దానితోపాటు ప్రత్యేకాహ్వానితుల కని ఉదహరించబడ్డ ఖరీదయిన అనుమతి పత్రమూ జత చేయబడిఉంది.

స్వప్నా! అనుకున్నాడు బాధగా, తీయగా, ఆనందంగా. కార్యక్రమం రేపు రాత్రి, తప్పకుండా వెళ్ళాలి. ఆమెను కలుసుకోవాలి. మాట్లాడాలి. రేఖగురించి చెప్పాలా, వద్దా? చెప్పాలి. స్వప్నకి-జీవితం తాలూకు అర్థం తెలుసు. ఎదుటి మనిషిని-ముఖ్యంగా-తనని ఆమె అర్థం చేసుకోగలదు. ఆ నమ్మకం తన కుంది.

లేచి-ముఖం కడుక్కొని వచ్చాడు. అక్కయ్య యిచ్చిన టిఫిను, కాఫీ తాగాడు. అలా తిరిగి రావాలనిపించింది. కానీ - టైము కనీసం ఐదయినా కాలేదు. హటాత్తుగా అతనికి తన జేబులో మిగిలిన డబ్బు గుర్తు వచ్చింది. అక్కయ్యను పిలిచి యిచ్చేశాడు. "నే నలా వెళ్ళి వస్తాను-" అని వెళ్ళబోయాడు.

"చాలా డబ్బు మిగిల్చావు! అక్కడ హోటల్లో దిగలేదూ?"

"దిగాను."

"మరి?"

ఏ విషయం నుంచి తప్పించుకుందా మనుకున్నాడో అది ఎదురవనే అయాక నిజం చెప్పడం కంటే అతనికి యింకేమీ తోచలేదు. పైగా అతని కబద్ధాలాడే అలవాటూ లేదు – మరీ తప్పనిసరి అయితేతప్ప... "తిరుగు టిక్కెట్టు–శర్మగారు తెప్పించారు."

అక్కయ్య కళ్ళు పెద్దవిచేసి చూసింది – "గ్రంథం చాలా వరకీ వచ్చిందన్నమాట. నువ్వు ఆయన విసిరిన వలలో చిక్కుకు పోయావు, ఔనా ?"

"రేఖమీద నీ కెందుకంత అయిష్టం ?" సూటిగా అడిగేశాడు.

కొంచం బాధపడినట్లు – "ఆమెమీద కాదు నా అయిష్టం. అయినా–నీకు ఆడవాళ్ళు అర్థం కారులే.వెళ్ళు... షికారుకి బయలు దేరినట్లున్నావు –"

ఆనంద్ బయటపడ్డాడు. తనకి ఆడవాళ్ళు అర్థంకారు ! నిజంగానా ?

సముద్రతీరానికి దారితీశాడు. అతని మనసు నిర్మలంగా లేదు. కారణం–అక్కయ్య వైఖరి, ఆమె – తానాశించినదానికి పూర్తిగా వ్యతిరేకంగా ప్రవర్తిస్తూంది, కారణం తెలీదు. అది అలాగ ఉంచి–రేపు స్వప్న, తనతో మాట్లాడుతుందట !

ఏమిటి అంత ముఖ్యవిషయం ?

ఇసుకలో కూర్చున్నాడు. చిన్న చిన్న రాళ్ళు ఏరుతూ నీటిలోకి విసురుతూ కెరటాలు వస్తున్నాయి, పోతున్నాయి. జీవితంలోకి కష్టసుఖాల్లా. కెరటాల మీదపడుతున్న ఎండ వెండి తీగలై మెరుస్తోంది చిత్రంగా. అర్థంలేని గీతాలు పాడుతూ వెర్రి ఆనందంతో ఉరకలు వేస్తూంది సముద్రం. ఔను, సముద్రానికి సమస్యలుండవు. అందుకే అది ఎప్పుడూ కెరటాలతో కేరింత లౌతూంటూంది.

"హలో ఆనంద్ !"

చూశాడు రాఘవ్ మిత్రుడు.నిరుద్యోగ పర్వంలో అతనూ తనలాంటి సోదరుడే. అతనికీ తనలాగే డబ్బూలేదు, రికమెండ్ చేసే గొప్పవాడూలేదు. కనుక అతని డిగ్రీ కాగితం ముక్కని

మించి మరే విలువలూ తెచ్చుకోలేక మిగిలిపోతూంది.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు ఆనంద్.

రాఘవ్ అతని పక్కన కూర్చుంటూ "ఏముంటాయ్! షరా మామూలే. పేపరులో వాంటెడ్ కాలమ్సూ, అప్లయ్ చేయటమూ, రిగ్రెట్ రిప్లయి లందుకోవడమూ విసుగొచ్చేసింది. అందువ్ల సెంటర్లో కూరగాయల షాపు తెరిచాను విన్నావే"

"కూరగాయల షాపా!" జాలిగా...బాధగా.

"ఏం? బతకడానికొక మార్గం. గుమాస్తా ఐతేనేం, కూరగాయల షాపయితేనేం? డిగ్నిటీ ఆఫ్ లేబర్. నువ్వు ఓసారి వచ్చి చూడు. కాదేదీ కవితకనర్హం అన్నాడు శ్రీశ్రీ. కాదేదీ బ్రతుకి కనర్హం అంటున్నాం మనం. అంతే నేనేలే. బాగుపడడానికి నిజానికి బిజినెస్ కంటే అడ్డదారి మరోటి లేదు. ఎటొచ్చీ గీత ఉండాలి, గీత. చూస్తూచూస్తూ ఎలాగూ చావలేం. అంత ధైర్యం మనకి లేదు. చావలేం కనక బ్రతికితీరాలి. బతకాలంటే ఏదో చెయ్యాలి. చేస్తున్నాం బస్! అన్నట్లు...స్వప్న నీకు తెలుసు కదూ? తెలుసా ఏమిటి, చెత్తప్రశ్న! మీ రిద్దరూ స్నేహితులు కూడాను. మొత్తానికి బాగుపడిందిలే. రేపిక్కడ సన్మానమూ, అట్టహాసమూ నీకు తెలిసే ఉంటుంది"

"తెలుసు" ముభావంగాఅన్నాడు ఆనంద్. స్వప్నగురించి ఆమె నోట తప్ప మరొకరి ద్వారా వినడం అతని కిష్టముండదు. రాఘవ్ దృష్టిలో స్వప్న వేరు. నిజానికామె పరిస్థితి వేరు. అది చాలా తక్కువమందికి మాత్రమే తెలిసే విషయం.

"కొంచెం నిలదొక్కుకుని పౌల్ట్రీకూడా తెరవాలని ఆశ. వంకాయల కంటే కోడిగుడ్ల కెక్కువ గిరాకీ"

"గుడ్ లక్" విసుగుని వీలయినంత వరకూ దాచుకుంటూ అన్నాడు ఆనంద్. కాని రాఘవ్ వదలలేదు. "నేను నీతో ఓ విషయం మాట్లాడదామని ప్రయత్నిస్తున్నాను. కాని యింత వరకూ నువ్వు కనిపించలేదు."

"ఏమిటి విషయం?"

"కొంత పెట్టుబడితో నువ్వుకూడా చేరితే – బిజినెస్ బాగా అభివృద్ధి చెయ్యవచ్చు. చాలా లాభాలు వచ్చే అవకాశాలూ

ఉన్నాయి. నీ కంగీకార మవుతుందని...."

"సారీ రాఘవ్. నాకు ఉద్యోగం దొరికే ఆశ ఏర్పడింది. కనుక –"

"కంగ్రాట్స్! చెప్పావు కాదేం? ఎక్కడ? ఏం పోస్టు? జీతం ఎంత?" ప్రశ్నల పరంపర కురిపిస్తూ – ఆనంద్ భుజాలు పట్టుకుని కుదిపి వదిలాడు.

"కొద్ది కాలంలో. అన్నీ తేలాక తప్పకుండా నీకు చెబు తాను –"

"ఉద్యోగస్తుడివయ్యాక యీ విజిటబుల్ రాఘవ్‌ని మరచి పోవుకద ?"

"మరచిపోను. సరేనా ?" నవ్వాడు.

రాఘవ్ "వస్తా" అంటూ వెళ్ళిపోయాడు.

ఎండ చల్లబడిపోయింది. ఎక్కడో దూరంగా ఆకాశమూ, సముద్రమూ ప్రేమించుకుంటున్నట్లు కలుసుకుంటున్నాయి. ఆనంద్ తీవ్రంగా ఒక నిర్ణయానికి వచ్చాడు.

రేపు శర్మగారికి ఉత్తరం రాసెయ్యాలి- వివాహంగురించి ఏర్పాట్లు ప్రారంభించమని.

అతని హృదయం తేలికపడినట్లనిపించింది. వివాహం చేసుకునేది తను. రేఖ నచ్చవలసింది తనకి. ఇంకా యితరుల మాటలగురించి ఆలోచించడం దేనికి? తనమీద – తన నిర్ణయాల మీద తనకు నమ్మకం ఉంది. నిశ్చయంగా తను - చెడ్డవాడుకాదు. సిగరెట్ కూడా అలవాటులేని మనిషి. ఎదుటిమనిషి గురించి ఆలో చించేపాటి హృదయ వైశాల్యం తనకుంది. ఇక తమ దాంపత్యం సుఖంగాకాక మరోలా ఎందుకు సాగుతుంది? రేఖకూడా చదువు కున్నదీ, అందమయినదీ. పెళ్ళిచూపు లవసరంలేవని అన్న తనను – ఆమె నిశ్చయంగా అర్థంచేసుకుని - గౌరవించి – అభినంది స్తుంది సాధారణంగా జీవితాలను పీడించే సమస్య డబ్బు. అది పుష్కలంగా ఉన్నాక యింకేమీ ఎదుర్కోలేని సమస్యలంటూ ఉండవు.

పూర్తిగా చీకటిపడింది. అల్లరికెరటం – పరధ్యానంగా ఉన్న అతని పాదాలను తడిపి - చిలిపిగా వెనక్కి పారిపోయింది.

అతను లేచాడు. ఇంటిముఖం పట్టాడు.

మర్నాడు సాయంత్రం అతను బయలుదేరదామను కుంటూండగానే యింటిముందు కారాగింది. అతను ఆశ్చర్యం నుంచి తేరుకునే లోగానే వాళ్ళువచ్చి - "ఆనంద్ అంటే మీరే కదూ ?" అని అడగడమూ, అతను తల ఊపడమూ - వాళ్ల కారెక్కించుకుని తీసుకువెళ్ళడమూ జరిగిపోయింది. సభ నిండు గానే ఉంది. ఏమయినా సినీగాయనికదా ! కాని - ఒక సినిమా నటి వచ్చినప్పటంత ఆర్భాటంగా మాత్రంలేదు.

ఇంకా సభ ప్రారంభానికి సమయం ఉన్నట్లుంది. మైకు గొంతు చించుకుంటూంది.

వేదికవెనుక సమితివాళ్ళ గదిలోకి తీసుకువెళ్ళా రతన్ని. స్వప్న. "స్వప్నా !" ఆనందంగా పిలిచాడు. ఆమె అతనివేపు చూసింది-చిరునవ్వు.

వాళ్ళిద్దరికీ కొంచెం ఏకాంతం.... "ఇక్కడ మనమేం మాట్లాడుకుంటాం ? సభ ఐపోయాక - గెస్టుహౌస్‌కి నాతోవద్దువు గాని ఏం ? చెప్పవలసిన విశేషాలున్నాయి" "అలాగే" అన్నాడు. స్వప్నని చూసేసరికి అతనికి చాలా ఆనందమూ - చెప్పలేని భావాలూ కలిగాయి. అన్నిటినీ గుండెల్లో దాచుకున్నాడు.

సన్మాన కార్యక్రమం పూర్తయింది. పట్టుచీరా ... సితా లతోపాటు పర్సుకూడా బహూకరించారు. స్వప్న గీతమాధుర్యా లను ముగ్గురు వక్తలు వంతులేసుకొని పొగిడారు. తరువాత స్వప్నని పాడమన్నారు. హంసధ్వని రాగాలతో ప్రారంభించింది. శ్రోతలకు నచ్చినట్లు లేదు. చీట్లు పంపడం మొదలుపెట్టారు. వారి కోరికను మన్నించడానికి - తాను సినిమాల్లో పాడినవి ఒకటి రెండు పాడింది.ముందువరుసలో కూర్చున్న ఆనంద్ నిర్లిప్తంగా ఉండిపోయాడు. అప్పుడు - శివరంజని !

మంచు కరిగిపోతున్నట్లు హృదయం ఉక్కిరిబిక్కిరౌతూ- కాలం ఆగిపోయి విలువని - గుండెలలో శూన్యం నిండుతూ - విషాదరాగ ప్రసారం, తీయనిబాధ, జన్మ తరించింది మళ్లీ-అను కున్నాడు ఆనంద్.ఇక స్వప్న తాను పాడలేనని అంది.ఎవరో యువ గాయనీ, గాయకుడూ పాటలు మొదలుపెట్టారు. వాళ్ళ కోరిక -

సినిమాల్లో పాడడమే అయిఉండవచ్చు. ప్రసిద్ధిచెందిన గాయకుల రికార్డులను సరిగ్గా అలాగే పాడేస్తున్నారు వంతులవారీగా. వాళ్ళ పాటలలో నూటికి నూరుపాళ్లూ అనుకరణే తప్ప స్వంతం అనేది రవంతయినా కనిపించడంలేదు. వినిపించడంలేదు. హొట్టి పీడలు!

స్వప్ననుంచి కబురు తెచ్చారెవరో. అతని వెంట ఆమెని చేరుకున్నాడు. కారులో యిద్దరూ గెస్టుహౌస్ చేరారు. డిన్నరు ... అనంతరం వెన్నెలపడుతున్న రూఫ్‌మిద కూర్చున్నారు. కొంచె పేపు మౌనం, కృత్యాద్యవస్థ.అనంతరం ఆనందే అడిగాడు- "నీ సినిమా జీవితం బాగానే ఉందా స్వప్నా?"

"మంచో చెడో తెలుసుకోలేని అయోమయంలోకి జారి పోయాను. ఇక యీ వూబినుంచి బయటకు రాగలిగే శక్తి లేదు. నే ననుకొన్నదొకటి ... జరుగుతున్న దింకొకటి-"

"నీ గొంతు తియ్యనిది. అవకాశాలూ వస్తూనే ఉన్నాయి... కాదూ?"

"గొంతులో తియ్యదనం కాదు, ఆ రంగంలో కావలసింది అసూయ...ద్వేషం...మళ్ళీ తేనె పలుకులు ... నవ్వుముఖం :... అక్కడ పైకి రావాలంటే రెండు బతుకులు బతకాలి. ఇప్పుడు నా కా బాధ్యత మరీ పెరిగింది. నా మూలంగా నావాళ్లు సోమరులై పోతున్నారేమో! నేను సంపాదించక తప్పదు. జీవితాంతమూ నా పరిస్థితి యింతేనేమోఅని భయంవేస్తోంది. నేను సరిగ్గా ఆలోచించ లేకపోతున్నానేమోకూడా. కోయిలలోకూడా అందా న్నే వెతుకుతుంది చిత్రరంగం! అది నా దౌర్భాగ్యం. అందుకే నాకంత స్వరం వినిపించ వలసినంతగా వినిపించడం లేదు. కళాకారుల జీవితాలు ప్రజలకి కూడా కనిపించేవివేరు. నిజంగాసాగే తీరువేరు. ఆనంద్! మానాన్న నయను సంగీతదర్శ కుడు నన్నుకోరాడు! ఏంచెయ్యాలి నేను? మనసును చంపుకునేదా? కీర్తికోసం, డబ్బుకోసం? లేక-బతుకునే చంపుకోవాలా? అక్కడ చాలామట్టుకు అవాంఛనీయమయిన పరిస్థితులే అనుక్షణమూ. కీర్తి శిఖరం ఎక్కేవరకూ చాలా కోల్పోవలసి ఉంటుంది. ఒక సిని మాలో సుప్రసిద్ధ గాయకుడితో డ్యూయెట్ అవకాశం లభించింది, కథ మామూలే. నాగొంతుకి తన గొంతు జత చేయడానికి అతను

నిర్లజ్జగా అడిగిన ప్రతిఫలం ఏమిటో తెలుసా?"

స్వప్న కన్నులనుంచి నీరు.

"ఊహించగలను స్వప్నా! ....చివరికి జీవితం యిలాగ అయిందన్నమాట." ఆమె చేతులను తన చేతులలోకి తీసుకుని సున్నితంగా స్పృశిస్తూ బాధగా అన్నాడు. పైనుంచి వెన్నెల ఆమె వొంటిమీదపడి సున్నగా మెత్తగా జారిపోతోంది చీకటిలోకి.

"త్వరలో నేను పెళ్లి చేసుకోబోతున్నాను ఆనంద్!" హటాత్తుగా అందామె.

"పెళ్ళేమిటిలే. బ్రతుకులో యిదీ ఒక వ్యాపారమే. మార్గాంతరం లేదుమరి–"

త్రుళ్లిపడ్డాడతను. స్వప్న గొంతుకలో గంభీరత తొణికిసలాడింది.

"అంటే? వివరంగా చెప్పవూ?" అర్థిస్తున్నట్లే ఉందతని కంఠం.

"కొంచంకాలం రహస్యంగా ఉంచు. ఈ పెళ్లి నేను యిష్టపడి చేసుకోవడంలేదు. తప్పనిసరి అయిమాత్రమే. అతను గ్రామఫోన్ కంపెనీ–అదే రికార్డింగు కంపెనీ యజమాని. సినిమా రంగంలోనూ పలుకుబడి కలవాడే. వయస్సు సుమారుముప్పయ్యయిదు ఉండవచ్చు. బాగా డబ్బున్నవాడు. అతని ప్రాపకంలో నాకూ పైకివచ్చే అవకాశాలు రావచ్చు. జీవితం డబ్బుని మించినదన్నమాట నిజమేకానీ డబ్బుతో చాలావరకూ జీవిత సమస్యలను పరిష్కరించవచ్చు నన్నది కూడా తిరుగులేని నిజమే. నన్ను మరోలా అర్థం చేసుకోకపోతే .." ఆమె స్వరంలో దుఃఖం.

"లేదు స్వప్నా అర్థంచేసుకోగలను. ఎందుకో జీవితం కొందరిమీద చాలా క్రూరమయిన ఆట ఆడుతుంది. అటువంటి అదృష్టహీనులలో మనమూ—"

"ఆనంద్." జాలిగొలిపే గొంతుతో అందామె. "నేనంటే ఆడదాన్ని. నీకేం? ఇటువంటి కష్టాలూ సమస్యలూ లేవుగా?"

"మగవాడికి బాధలుంటాయి స్వప్నా: నీముందుసిగ్గువిడచి నిజం చెబుతున్నాను. ఇన్నాళ్లూ నిరుద్యోగిగా నేనెంత ఘర్షణకి లోనయానని. ఇంట్లోవాళ్లు నన్నేమీ అన్నారనికాదు. నాముందు నేనే

ఎందుకూ కొరగానివాడిలా.... అప్రయోజకుడిలా కనిపించేవాడిని. పిచ్చిపట్టినట్లయ్యేది. జీవితానికర్థం ఉద్యోగం తప్ప మరేమీ కాద న్నంత ఉద్రేకం కలిగేది. ఒక్కొక్క రాత్రి నిద్రపట్టేదికాదు. నా బ్రతుకు నిరర్థకం అనిపించేది. ఆత్మహత్య చేసుకుందా మన్నంత ఆవేశం ..."

"ఆనంద్!" ఆమె కంఠంనిండా ఆత్రత. అతని చేతులను గట్టిగా పట్టుకుంది.

"అదంతా గతం స్వప్నా!" తేలిగ్గా నవ్వేశాడు.

"ఇప్పుడు? నీ కుద్యోగం దొరికిందా? ఎక్కడ? ఏ చేస్తున్నావు?"

"ఆగు... చెప్పనీ... ఉద్యోగం దొరుకుతుంది - వి యంగా. ఎందుకంటే నేను రేఖని పెళ్ళిచేసుకుందు కంగీక రించాను కనుక -"

"రేఖ ఎవరు?"

"ఉద్యోగా లిప్పించగల ఆఫీసరుగారమ్మాయి. చదువు కుందట. ఫొటోలో అందంగా ఉంది. ఏంచేసేది? ఉద్యోగ కావాలంటే పెళ్ళి చేసుకోవలసిందే. మగవాడిని ఎలాగో ఒక లాగ నా కాళ్ళమీద నేను నిలబడగలగాలి కదా! అక్కయ్యా వాళ్ళు మాత్రం ఏమంత ధనవంతులు? అభిమానంకొద్దీ బయట పడదు కానీ నేను నిజంగా వాళ్ళకి భారమే. అందుకే- ఉద్యోగం దొరుకుతుందికదా అని రేఖ నంగీకరించాను."

"మీ పెళ్ళి జరిగిందా?"

"నువ్వు సరిగా విననట్లుంది. ఇంకా జరగలేదు. జరుగు తుంది. ఐనా - నీకు శుభలేఖ పంపకుండా చేసుకుంటానని ఎ అనుకున్నావ్?"

"ఔను మనం ఏమయినా కాకపోయినా కనీసం స్నేహి తులం. కాదూ?"

"ఔను. ముమ్మాటికి స్వప్నా!" ఇద్దరూ కన్నీళ్ళతో ఉన్నారు.

"చాలా పొద్దుయినట్లుంది కదూ?" అందామె,

"అర్థరాత్రి దాటుతుంది. చూడు... నగరం నిద్రపోతో

రేయి అలసిపోతూంది."

"ఇక నాకు శలవిస్తావా? రేపు ప్రొద్దున్నే నా ప్రయాణం."

"స్టేషన్‌కి వస్తాను, పార్టింగ్ సీన్స్ నాకిష్టం ఉండవు కానీ - నీకోసం"

"వద్దు-' ఆమె మాట చాలా మృదువుగానే అంది.

"ఎందుకని ?"

"ఏమున్నా లేకపోయినా- అవకాశం దొరికితే నామీద స్కాండల్స్ లేవదీసే ప్రబుద్ధులకి లోటు లేదు. ఆ రంగం అటువంటిది."

"సరే. ఒక్కసారి శివరంజని పాడు. మళ్ళీ ఎప్పుడు వింటానో నీ నోట, అచ్చంగా నాకోసం - శివరంజని. మనం ఎప్పుడు కలుసుకున్నా దీనికి కరువు చెయ్యకు-"

పలచబడిన వెన్నెల. డాబామీద... చల్లగాలి...ఏకాంతం... దూరంగా నిద్రించే నగరం. వీటిమధ్య శివరంజని. అచ్చంగా తనకోసం! ఎంత చక్కని అనుభూతి. మరునాడు లేచేసరికి తొమ్మిది దాటనేదాటింది.

"పెళ్ళి చేసుకోబోతున్నావ్, ఉద్యోగం చెయ్యబోతున్నావ్. ఇలా అలస్యంగా లేస్తే ఎలా? మంచి అలవాట్లు చేసుకో. లేకపోతే మా మరదలు పోట్లాడగలదు." నవ్వుతూనే మందలించింది అక్కయ్య. ఆనందూ నవ్వేశాడు. కాఫీ- స్నానం అయ్యాక శర్మగారికి ఉత్తరం వ్రాసేశాడు. స్వయంగా వెళ్ళి పోస్టు చేసి వచ్చాడు. గుండెలు తేలిక పడినట్లనిపించింది.

గదిలో కూర్చున్నాడు. రకరకాల భావాలూ, ఆలోచనలూ- పెళ్ళి, ఉద్యోగమూ తలుచుకుంటూంటే సంతోషంగానూ ఉంది, కారణంలేని భయమూ కలుగుతూంది.

*  *  *  *

అన్ని ఏర్పాట్లూ ఐపోయాయి. ముహూర్తమూ, స్థలమూ కూడా నిశ్చయించబడ్డాయి. శర్మగారు, బట్టలకీ, వాటికీ ఉంచమంటూ మూడువేల రూపాయలకి ఆనంద్ పేర డ్రాఫ్ట్ పంపారు. అందుకని తనతోపాటు అక్కయ్యకీ, బావగారికీ కూడా బట్టలు కొన్నాడు. వాళ్ళు వద్దంటున్నా వినలేదు. ప్రయాణపు ఖర్చులకవి

కొంత డబ్బు వేరే ఉంచాడు. వాచీ కొనుక్కున్నాడు. శుభలేఖలు అచ్చువేయించి మిత్రులకి పంచిపెట్టాడు. శర్మగారి తెలివితేటలకు ఒక పక్క మెచ్చుకుంటూనే మరోపక్క విచారించాడు. వివాహం అయిన మూడో రోజున ఉద్యోగంలో చేరేలా ఏర్పాటు చేయించారు- అంటే, చాలావరకు జాగ్రత్త పడ్డారన్నమాట, నిజానికి, రేఖలాంటి అందగత్తెకు వివాహం పెద్ద సమస్యేమిటో ! పోనీ యిదీ తనకు మంచిదే.

తిరుపతి కొండమీద వివాహం. మిత్రులెవరూ వచ్చేటట్లు కనపడలేదు. ఔను, అంత దూరం ఎవరు రాగలరు !

పెళ్ళిరోజు దగ్గరపడింది. అక్కయ్యా, బావగారూ, తానూ తిరుపతి బయలు దేరారు. బంధువర్గం ఉన్నవారే తక్కువ. వాళ్ళెవరూ రావడానికి సుముఖులుగాలేరు. దగ్గర సంబంధం వదిలేసి ముక్కూ మొహమూ తెలియనిచోట సంబంధం చేసుకుంటున్నందుకు వాళ్ళకి కోపం వచ్చింది. అంతవరకూ ఉన్న కొద్దిపాటి సంబంధ బాంధవ్యాలూ కూడా యీ పెళ్ళితో తెగిపోయినట్లే అయిపోయాయి. దానికి విచారించవలసిన పనిలేదు.

దిగువ తిరుపతిలో బస్సు దిగేటప్పటికి కారు సిద్ధంచేసి ఉంచారు శర్మగారు. ముగ్గురూ కారెక్కారు. ఆనంద్ కి బొత్తిగా తన వెంట మిత్రులేనా లేకపోడంతో కొంత వెలితిగా అనిపించక పోలేదు. తనకి మొదటి నుంచీ స్నేహితులు తక్కువే. వాళ్ళలో చాలామంది యిప్పుడెక్కడున్నారో తెలియదు. స్వప్నకి శుభలేక పంపించదమయితే పంపించాడు. కాని ఆమె వస్తుందన్న ఆశ అణుమాత్ర మయినా లేదు. వెజిటబుల్ రాఘవ్ వచ్చునేమో కాని కొత్త బిజినెస్ తో బిజీగా ఉండిపోయాడు.

మూర్తి... అరె ! మూర్తిని మరిచిపోయాడు తను. ప్చ్ అతనికి తప్పకుండా శుభలేఖ పంపించి ఉండవలసింది. విచిత్రంగా - ఎందుకో మరచిపోయాడు.

ఘాట్ రోడ్డు - మెలికలు తిరుగుతూ - కారు కొండమీదకి పాకుతూంది. డ్రయివరుకి రూటు కొత్తకాబోలు అతి జాగ్రత్తగా మెల్లగా నడుపుతున్నాడు.

అటూ ఇటూ చక్కని దృశ్యాలు. శిఖరాలు... లోయలు

పచ్చనిచెట్లు ... మధ్యగా ఆడదాని పాపిడిలా రోడ్డు. రోడ్డుమీద కారులో తాము.

కొండమీదకు చేరుకున్నారు. శర్మగారి తరపున కూడా నలుగు రయిదుగురి కంటే ఎక్కువమంది వచ్చినట్లులేదు. ఎందుకని? బహుశా ఆయనకి - వివాహం ఆర్భాటంలేకుండా జరిపించాలన్న ఆశయం ఉండిఉంటుంది. మరి-రేఖ? ఆమె స్నేహితులు కూడా వచ్చినట్లులేదు. తనలాగే ఆమెకి స్నేహితులు తక్కువ కాబోలు. రెండు పక్షాలవారివీ పక్కపక్క కాటేజీలు, వాళ్ళవి రెండు, తమది ఒకటి.

కొండమీద - కిటకిట లాడుతోంది. తిరుపతి ఎప్పుడూ నిండుగానే ఉంటుందిట. పైగా యిది పెళ్ళిళ్ళ సీజను. ఇక చెప్పే దేముంది?

స్నానాలు చేశాక - అక్కయ్య అంది. "ఇపుడు మనం చేసేదేముంది? అలా తిరిగివద్దాం" బావగారూ, తనూకూడా ఆ ఉద్దేశంలోనే ఉన్నారు. వెంటనే కదిలారు.

చక్కని చెట్లు... మధ్య మధ్య తోటలు, మనుషుల్ని ఎగర కొట్టేసేటంత గాలి. చాలా ఆరోగ్యకరమయిన వాతావరణం. చుట్టూ అందమయిన ప్రకృతి. దేముడిమాట అలాగవుంచి - ఆ స్థలంలో చాలా విశేషం వుంది. జన సంకీర్ణమయిన నగరాల నుంచి అక్కడకు వస్తే ఆ మార్పు స్పష్టంగానూ, హాయిగానూ అనిపిస్తుంది. నాగరికతనుంచి తాత్కాలికంగా విముక్తి లభిస్తుంది. కలుషితంకాని గాలి, చక్కని వాతావరణమూ మనుషుల్ని ఆకట్టు కుంటాయి హృదయాల్ని పరిశుద్ధం చేస్తాయి. ఇక్కడి గాలి స్వచ్ఛ మయినది కనుక-ఆలోచనలూ స్వచ్ఛంగానే ఉంటాయి. పీల్చేగాలి మీదా, తాగే నీటిమీదా ,తినే తిండిమీదా-ఆధారపడే ఆలోచనలు మొలకలెత్తుతూంటాయి.

"ఏమిటో - యిదంతా నాకు చిత్రంగా ఉంది-" అన్నారు బావగారు.

"ఏమిటి?" ఆగిపోయిందక్కయ్య. ఆమె ఇక నడవ లేనట్లుంది.

"అదే... రోజు లెంత మారిపోయాయి! మన పెళ్ళి ఎలా

జరిగిందో గుర్తుందా ?"

"మా తమ్ముడు నవ్వుతున్నాడు, చూసుకోండి. ఇన్నేళ్లొచ్చినా పెళ్ళి రోజులు ..."

"జీవితంలో ఒకేసారి జరిగే పెళ్ళి ... బ్రతుకంతా గుర్తుంటుంది. ఉంచుకోవాలి."

"ఉంది లెండి. మీరు చెప్పదలచుకున్న దేమిటో చెప్పండి-"

"ఆనంద్! ... నువ్వు వినాలనే నేను చెబుతూంట. రేఖ గురించి తరువాత కలలు కందువుగానిలే. కాలం తెచ్చినమార్పులు ఎంత చిత్రంగా ఉంటాయో అనుభవంమీద చెబుతున్నాను. విను. ముందుముందు నీకు ఉపకరిస్తుంది-"

"చెప్పండి" అన్నాడు - ఆయనకి రెండో పక్క కూర్చుంటూ.

"ఆ రోజుల్లో పెళ్ళంటే బ్రహ్మ ప్రళయమే. వంశాలూ, గౌరవాలూ, అటు ఏడుతరాలూ యిటు ఏడుతరాలూ, చరిత్రలు తిరగదోడి చూడడం. అబ్బాయి అమ్మాయిల జాతకాల పొంతనం- అన్నీ అమిరి-బౌనన్నాక అటు ఆడపెళ్లివారూ, యిటు మగపెళ్లి వారూ నానా గుండాపిండీ అయిపోయి-బంధువర్గాలను పిలుచుకుని మూడురోజులో, ఐదురోజులో అట్టహాసంగా పెళ్లి జరిపించడం యిల్లూ వొళ్లూ గుల్లచేసుకోవడం - పెళ్ళంటే ప్రళయమే! ఊరు ఊరంతా తరలివచ్చేవారు. మరి - యిప్పుడు జరగబోతున్న నీ పెళ్లిని చూస్తుంటే...."

"ఏది నయమనిపిస్తూంది!" నవ్వుతూ చూశాడు ఆనంద్.

"ఇదే బాగుందికానీ..... బొత్తిగా యింత నిరాడంబరంగా జరిగిపోవడమూ-అదోలా ఉంది. పందిర పందిట్లో పట్టుచీరెలు గరగరలాడుతూ అటూయిటూ తిరగడమూ, ఒకటో అరో తగువులూ-ఏమీ లేకుండా పెళ్ళయిపోయిందంటే-ఎలా గుర్తుంటుంది? బ్రతుకంతటికీ జ్ఞాపకంగా మిగిలే పెళ్లి."

"ఆ ముచ్చటలకేం? కావాలంటే అవీ జరిపించమందాము. పెళ్ళంటే తగువులే అయితే—"

"కొంపదీసి వాళ్ళతో అలా అనేవ్ ? మీ బావగారు సరస

మాడారంతే .కావాలంటే ఆయన్ని చెప్పమను. వారి పెళ్ళిలో ఎన్ని తగువులు జరిగాయ్?"

"నా పెళ్ళే అంటున్నావ్. నీ పెళ్ళికాదేమిటి?"

"పోనీండి. మన పెళ్ళి. చెప్పండి. దేని గురించి తగువులు పడ్డారు?"

"ఉండు, అలా నిలదీసి అడిగేస్తే నేనేం చెప్పగలను! ఏనాటి ముచ్చట్లో, జ్ఞాపకం రావాలా?"

చీకటి పడిపోతూంది. ముగ్గురూ లేచి కాటేజీల వైపు నడవసాగారు.

వాళ్ళు చేరుకునేసరికి శర్మగారి మనుషులు ఎదురు చూస్తున్నారు. మీరెప్పుడు సిద్ధంగా ఉంటే అప్పుడే భోజనాలు వస్తాయని చెప్పమన్నారయ్యగారు-" అన్నాడు వాళ్ళలో ఒకడు.

"మరో అరగంట పోయాక పంపమను."

ఆ వ్యక్తి రెండు ఫ్లాస్కులతో కాఫీ ఉంచి వెళ్ళిపోయాడు, మిగిలిన వారితో.

ఆనంద్ స్నానంచేసి వచ్చాడు. అక్కయ్య, బావగారూ కూడా కానిచ్చారు.

కాఫీలు తాగుతూ కూర్చున్నారు. "ఒక్కసారి రేఖని చూసివస్తే బాగుండు ననిపిస్తోంది."

ఆనంద్ యిబ్బందిగా ముఖంపెట్టాడు. "వీళ్ళేమయినా అనుకుంటారేమో?"

"అప్పుడే వాళ్ళపక్షం ఐపోయావూ! - వద్దులే." నవ్వింది శారద.

భోజనాలయ్యాక అరగంటలోనే ముగ్గురూ నిద్రలోకి జారిపోయారు.

మర్నాడు సాయంత్రం...ఆనంద్ కేమీ తోచడం లేదు. బావగారు కాటేజీలో ఉన్నారు. కానీ నిద్రపోతున్నారు. శారదక్కయ్య రేఖదగ్గరకి వెళ్ళిపోయింది.

ఆనంద్ బయటకు బయలుదేరాడు. అతనికి ఏకాంతం కావాలనిపిస్తూంది. మనస్సులో చిత్రమయిన ఆలోచనలు పరుగెత్తుతూంటే - పరధ్యానంగానే నడుస్తూ ఒక మంచి ప్రదేశం

చేరుకుని కూర్చున్నాడు.

తను - వివాహితుడై పోయాడు. రేఖ అతి చక్కనిది. ఆమె కంఠం కూడా తీయనిదే. అంతేకాదు, ధనవంతులమన్న గర్వం కూడా ఆమె ముఖంలో ఎక్కడా కనిపించలేదు సరికదా చాలా ప్రశాంతంగానూ, గంభీరంగానూ ఉంది. కళ్యాణ మంట పంలో-ఉదయం-దేముడిఎదుట-తానూ, రేఖా దంపతులయ్యారు. ఇకనుంచి తను ఒక్కడూ కాదు, ఆమె బాధ్యతకూడా తనది, కష్టసుఖాలలో- తనూ ఆమే ఒకరి కొకరు తోడు. ఈ తీయని బంధం- జీవితాంతమూ నిలుపుకోవాలి. అతి జాగ్రత్తగా రక్షించు కోవాలి. ప్రత్యక్షంగా కాకపోయినా- గ్రీటింగ్స్ పంపారు కొందరు. ఆ శుభాకాంక్షలన్నీ తమ దాంపత్య జీవితానికి శ్రీరామ రక్షలు. అన్నట్లు- గ్రీటింగ్స్ అన్నీ ఎక్కడున్నాయో? బహూశా శర్మగారు...ఉహూ... యింక తను ఆయన్ని శర్మగా రనకూడదు. మామగారనాలి. బంధుత్వం. తిరిగ్గా గ్రీటింగ్స్ పంపిన వాళ్ళకి కృతజ్ఞతలు తెలపాలి.

ఆనంద్ లేచాడు. నాలుగడుగులు వేశాడు.

భుజంమీద చెయ్యి... ముద్దగా పలకరింపు. "హలో ఆనంద్!"-అతను మూర్తి.

ఆశ్చర్యంగా ఉండిపోయాడు-మూర్తిని చూస్తూ.

"మరేమనుకోకు బ్రదర్! గుళ్ళం మీనున్నాను. అన్నట్లు శర్మ నీకు ఉద్యోగం యిచ్చాడా?"

"ఊఁ" అన్నాడు అన్యమనస్కంగా ఆనంద్.

విజయగర్వంతో నవ్వాడు మూర్తి. "ఇవ్వకేం చేస్తాడు? మనం చేసింది తక్కువ సాయం కాదుగా?"

"ఏం చేశావేం?" ఆశ్చర్యంగా అడిగాడు. శర్మలాటి- ఉహూఁ... తన మామగారిలాటి గొప్పవారిమీద కూడా చనువు చెలాయించగలగడానికి- మూర్తి ఏంచేసి ఉంటాడన్న కుతూ హలం. ఎక్కడో ఏదో పక్షి వికృతంగా కూసి ఎగిరింది.

"ప్రొఫెషనల్ సీక్రెట్!- పర్లేదు. నువ్వు ఫ్రండ్వి. కనుక చెబుతాను. అతనికో అమ్మాయుంది. ఇంకా నీకు తెలిసి ఉండదనుకుంటే..." జేబులోంచి బాటిలు తీసి- రోడ్డు పక్కన

కూర్చుంటూ- "నువ్వూ కూర్చో బాయ్... కంపెనీ కీప్ చేస్తావా?" అన్నాడు.

"వద్దు... ఇది- తిరుపతి... ఈ కొండమీద...దేముడి సమక్షంలో..."

"యూ ఇనోసెంట్!" పకపక నవ్వాడుమూర్తి. "నిజంగా పూర్ వి, ....సారీ .. దేముడు అనేవాడంటూ ఉంటే అతను లేని దెక్కడ? గాడ్ ఎవెరీ వేర్ కదా! ఈ కొండ - కొండ కనుక ప్రత్యేకత, అంతకంటే యింకేమీ లేదు. కొంచెం బుర్ర ఉపయోగించు. అన్నట్లు - యిక్కడ మోసాలుదగాలూ నీ కనుభవానికి వచ్చే ఉండాలే! మరోమాట యిక్కడ - ఈ పవిత్రమైన కొండమీద - మధు వేకాదు - మానినీ దొరుకుతుంది. డబ్బులు మనవి కావనుకుంటే. ఇవన్నీ నీ కెందుకులే. నువ్వొట్టి బుద్ధిమంతుడివి. నీ బాస్ గురించి చెబుతూ మానేశాను గదూ? చెబుతాను-" రమ్ గొంతు నింపుకున్నాడు.

"నీ బాస్‌కొక డాటరుంది. పేరు రేఖో, గీతో, వృత్తమో- సమ్‌థింగ్. ఉన్నది. ఒక్క- అమ్మాయ్ మాంచి అందంగా ఉంటుంది. వయస్సులోనూ ఉంటుంది. వయస్సేం చేస్తుంది? మనిషిచేత తప్పులు చేయించి సంతోషిస్తుంది. ఈజిట్ నాట్? ఆ అమ్మాయి అంతే చేసింది. నేచరే ....ప్రకృతి- ఊరుకోదుగా? ఆమెను అమ్మ కమ్మంది. ఆమె అన్ మెరీడ్. ఈ దేశంలో అన్ మారీడ్ అమ్మల స్థానమేమిటో నీకూ తెలుసు. ఆమెకీ తెలుసు. శర్మకీ తెలుసు. కనుక శర్మవచ్చి మా మామగారి ద్వారా నన్ను కలుసుకున్నాడు. డబ్బు ఆశ చూపాడు. నిజంగా యిష్టం లేక పోయినా అబార్షన్ నా చేతుల్తో నేనే చెయ్యవలసి వచ్చింది. ఈ రహస్యం యిప్పటికి నలుగురికి తెలుసు-రేఖ...శర్మ మా మామగారు-నేను, ఐదోవాడివి నువ్వు. ఆ బలమయిన పాయింట్‌కి లొంగుతాడు కనుకనే నిన్ను శర్మకి రికమెండ్ చేశాను. నీకు ఉద్యోగం వచ్చింది. ఈ మాట ఎక్కడా అనకు."

కాళ్ళకింద కొండ కూలిపోతున్నట్లయింది ఆనంద్‌కి. ప్రపంచం గిర్రున తిరుగుతూంది కళ్ళముందు. రేఖ ... ఆమె మెడలో తను కట్టిన మంగళసూత్రం...అదే తన పాలిట ఉరితాడై

మెడచుట్టూ.... జీవితం చుట్టూ... భవిష్యత్తు చుట్టూబిగుసుకుంటూ బిగుసుకుంటూ ఉక్కిరి బిక్కిరిచేస్తూ.... ఊపిరాడకుండాచేస్తూ....

"వండర్ పుల్!... ఊగుతున్నది నేను...కిక్కేమో నీది ఏమిటలా ఐపోతున్నావ్!" ఆనంద్ చెయ్యిపట్టుకుని తూలకుండా ఆపాడు మూర్తి.

"నువ్వు...నువ్వెందుకొచ్చావిక్కడికి? "అడిగాడు:నీరసంగా-ఆ ప్రశ్ననిండా. ఆ ప్రశ్నవేసిన తీరునిండా లక్ష బాధలూ, కోటి పశ్చాత్తాపాలూ.

"నేను బ్రతుకుతున్నది బతుకుకాదు ... బానిసత్వం ... నా చుట్టూ బంగారు పంజరం. నా వ్యక్తిత్వం బలి ఐపోయింది. స్వేచ్ఛగా అడుగు వేయడానికి వీలుకాని పరిస్థితి. ప్రపంచానికి కనిపించేడాక్టర్ మూర్తి వేరు. నాకు నేనుగా కనిపించే మూర్తిని వేరు.ఆనంద్! నువ్వు నా ఫ్రండ్ వి...ప్రమాదంలేని వ్యక్తివి.అతి మంచివాడివి, నీకు చెబుతాను నాకథ....నావ్యథ .... నీ ముందు నా గుండెల బరువు దింపుకుంటాను, హృదయంలో చెలరేగే దావానలాన్ని నీ ముందుంచుతాను. గాడి తప్పిన జీవితం. తిరిగి తీసుకోలేని బ్రతుకు. ఏనాటికీ యింతే. ఈ వక్రరేఖ సక్రమం కాదు. ఇది తీరని శాపం ఆవేశంగా సీసా అంతటినీ గొంతులోకి వొంపుకుని - సిగరెట్ .. అగ్గిపుల్ల మంట-

మెడిసిన్ పాసయ్యాను.చేతిలోచిల్లిగవ్వలేదు.స్వతంత్రంగా ప్రాక్టీసు పెట్టాలని కోరిక. నేను బ్రతుకుతూ పేషంట్లనికూడా బ్రతికించాలని ఆశ. కాని-ఎలా? ప్రాక్టీసు పెట్టాలంటే గదికి అద్దె చెల్లించడంకూడా సమస్యే. సరిగ్గా అటువంటి పరిస్థితులలో నా బలహీనత మీద దెబ్బకొట్టి నన్ను తన గుప్పెటలోకి తీసుకున్నాడు మా మామగారు. అప్పటి కాయన దగ్గర డబ్బుండేది. కొంచెం పలుకుబడి ఉండేది. పగలు చూస్తే రాత్రి కలలోకి వచ్చేఅమ్మాయి ఉండేది. ఆ అమ్మాయి దగ్గర పేరుకుపోయిన మూర్ఖత్వం ఉండేది. పట్టుదల ఉండేది. అజ్ఞానం ఉండేది. శవాలనుకోసే - రోగగ్రస్తులని చూసే నేర్చుకున్న విద్యతో-నా మనసు గ్రహించిందేమిటంటే అందం అనేది అతి పల్చనిపొర. దానికి అత్యధిక ప్రాధాన్యం అంటగట్టడం అజ్ఞానం. వైవాహిక జీవితం సవ్యంగా

సుఖంగా సాగడానికి నిమిత్తం అందచందాలతో కాదు, తెలివి తేటలూ, చాకచక్యంతో ఆమెను పెళ్ళి చేసుకున్నాను. తెలియకుండా-వికసించవలసిన నా వ్యక్తిత్వపు బీజాన్ని మర్రినీడకిందకు చేర్చాను. మెల్లమెల్లగా మామగారి పలుకుబడి పెరగసాగింది, రాజకీయ రంగంలో ఆయన నన్ను శాసించడం మొదలుపెట్టారు. పట్టుదారాల ఉరితాడు. తెలియకుండా లొంగిపోసాగాడు. నాచుట్టూ ఆయన వేస్తున్న కంచె నా సుఖసౌఖ్యాలకీ, రక్షణకీ అనుకున్నాను. కానీ కాదు. అదంతా నన్నుబంధించడానికి. ఆలస్యంగా తెలిసింది. అప్పటికే అంతా అయిపోయింది. ఆయన విరిసిన వల నుంచి బయటపడగలిగే శక్తికూడా నాకు లేదు. నూటికి నూరుపాళ్ళూ యిల్లరికపు టల్లుణ్ణయిపోయాను. నేను సంపాదిస్తున్నాను. పెద్ద మొత్తాలే, కాని అది నా డబ్బుకాదు. దానిమీద నా కాధికారం లేదు. ఆయన మాటలలో "యీ డబ్బంతా నీదే. నువ్వు కాక మా కెవ్వరున్నారు." కాని నిజం లేదు. నేను ఖర్చుపెట్టుకోవచ్చు కాని-లెక్క చెప్పాలి. నేను స్వతంత్రంగా సంపాదిస్తున్నా ఇంత కావాలని నా భార్యనడిగి తీసుకోవాలి. ఇచ్చేముందు ఆమె వేసే అవకతవక ప్రశ్నలకి నేను జవాబులు చెప్పుకోవాలి. నా కిష్టమున్నా లేకపోయినా మామగారి పరువుకోసం కొన్ని పనులు చేయాలి. కొన్నిటిని చేయకూడదు. ఎన్నో ఆంక్షలు. నా భార్యకి నా మీద అన్నీ అనుమానాలే. ఆమె ఉద్దేశం డాక్టరంటే ఆడ పేషంట్లతో సరసాలాడి తీరతాడని నా మీద నిఘా. ఏకాంతం దొరికితే నా గురించి నేను ఆలోచించుకుంటూ ఉంటాను. అంతరాత్మ అవహేళన చేస్తుంది. పైకి చిరునవ్వు నవ్వుతూ హుందాగా కదిలిపోయే డాక్టరు మూర్తిలో అసలు స్వరూపం ఇది. నివురులో నిప్పు. నన్ను దహిస్తూంటుంది. వేసిన అడుగులు వెనక్కి తీసుకోలేని అశక్తత. గతం .... అప్పటి ఆశలు.... ఆలోచనలు.... గుర్తుకొస్తే దుఃఖం. పశ్చాత్తాపం-పగిలిపోయిన గాజు పాత్రలాటి జీవితం.

"ఆనంద్। నాకూ కొన్ని ప్రిన్సిపల్స్ ఉండేవి. అవినీతంటే నాకూ యిష్టం ఉండేది కాదు. చట్టవిరుద్ధమయిన గర్భస్రావం చేయాలని మామగారు చెప్పినప్పుడు నాకు చేతకాద

న్నాను. పరువు... స్నేహం... పలుకుబడి... అంటూ తల వాచే ట్లు చీవాట్లు వేశారు. నా మెడలు వంచారు. నా కళ్ళముందు రూపాయినోట్ల కట్టలు రెపరెపలాడించారు. జీవితానికీ, ప్రయోజ కత్వానికీ కొత్త భాష్యం చెప్పారు. శర్మగారమ్మాయికి యిష్టం లేదని- చివరివరకూ నాకు తెలీదు. నేరమయినా, పాపమయినా తొలిసారి చేసేటప్పుడే జంకూ, సంఘర్షణ. తరవాతనుంచి అల వాటూ, అవలీలా అయిపోతుంది.

ఇవాళ- నేనిక్కడకు వచ్చింది- మా మామగారిని రిప్ర జెంట్ చెయ్యడానికి. ఎవరో రాజకీయం మనిషి తన కూతురికో అల్లుడికో పెళ్ళి చేస్తున్నాడు. సమయానికివెళ్ళి కానుక చదివిం చాలి... అన్నట్లు... నువ్వెందు కొచ్చావిక్కడికి ? నాలాగే ఎవరి పెళ్లికో హాజరు కావడానికేనా?" తూలిపోతూ అడిగాడు మూర్తి.

"ఎవరి పెళ్లికో కాదు. నా పెళ్లికే" అనేసి అక్కడినుంచి పరుగు పరుగున వెళ్లిపోయాడు ఆనంద్. మూర్తి ఎంత పిలు స్తున్నా వినిపించుకోకుండా.

చీకటి పడింది. ఆనంద్ అంతరంగంలోనూ, కొండమీదా, కాటేజీలలోనూ అంతటా దీపాలు వెలుగుతున్నా అతని మన సులో చీకట్లు క్షణక్షణానికీ చిక్కబడుతూనే ఉన్నాయి. ఎందు కిలా జరిగింది? ఇప్పుడు తన కర్తవ్య మేమిటి? రేఖనీ- జరిగిన యీ పెళ్లినీ ఆమె మెడలో తాను కట్టిన తాళినీ- ఏం చెయ్యాలి? జరిగిన మోసంలో ఎవరెవరి దెంత భాగం? తా నెందుకు విష వలయంలో చిక్కుకున్నాడు?

మొదటినుంచీ తనకు పవిత్రత అంటే గురి ఉంది. విశ్వాస ముంది. అందుకే- స్వప్నతో ఎంత స్నేహం అయినా- ఏకాంతం లభించినా లేనాడూ హద్దు మీరలేదు. విజయవాడ హోటల్లో ఆమె మీద ఎంత జాలిఉన్నా- తాను నిగ్రహం వీడలేదు. స్త్రీ విషయం లోనే కాదు- చాలా విషయాలలో తను అంతే. ఎన్నోసార్లు కంపెనీ కోసం అంటూ మిత్రులు వొత్తిడి చేసినా తను తాగలేదు. అంతేకాదు, అవంటే తనకి అసహ్యమూ, భయమూ కూడా. తనకి స్త్రీ అంటే గౌరవభావమే ఉంది. చులకనగా చూడడంచేత కాదు. ఆమె అంటే విలువ ఉంది కనుకనే పెళ్ళిచూపులు అనబడే

అసహ్యమయిన పద్ధతిని అనుసరించడం మానేశాడు. రేఖని- గుడ్డిగా నమ్మాడు. శర్మ మాటలు అమాయకంగా విశ్వసించాడు. ఇప్పుడు- సాక్ష్యాలతోసహా నిజం బయటపడింది. ఈ క్షణంలో మూర్తిని వెంటబెట్టుకువెళ్ళి- నిజం బయటపెట్టించి- రేఖ మెడలో కట్టిన తాళిని తన చేతులతోనే తెంపిపారేస్తే-వాళ్లేం చెయ్యగలరు?

ఆవేశంగా అడుగులు వేయసాగాడు ఆనంద్. అతను దాదాపు పిచ్చివాడిలాగే ఉన్నాడు. ఆ నడక తీరు- అతను తాగి ఉన్నాడేమోఅన్న అనుమానం కల్పిస్తోంది.

కొండమీదకు మబ్బులు ముసురుకుంటున్నాయి. అవి క్రమక్రమంగా పొగ మంచులా దట్టం ఔతున్నాయి. కొంచెం సేపట్లో అవి మనిషి కళ్ళముందు తెరలు దింపేటట్లున్నాయి. మనిషిని గుడ్డివాడిని చేసేటట్లున్నాయి. ఇప్పటికే పదిపదిహేను గజాల అవతల ఏముందో కనిపించడంలేదు. దీపాలుమాత్రం అస్పష్టంగా - అలుక్కుపోయినట్లు.

"ఆనంద్ !... ఆనంద్ !..."

అతనాగిపోయాడు. ఎదురెదురుగా టార్చిలైట్లు అక్కయ్య బావగారు, శర్మ, ఇంకా ఎవరెవరో. అతనికేమీ అర్థంకాలేదు, వీళ్ళంతా ఎందుకింత కంగారు పడుతున్నారు? ఏమైందని?

"ఎక్కడికి వెళ్లావ్? ఇంతసేపూ ఏం చేస్తున్నావ్; నీ కోసం ఎంత సేపటినుంచి వెతుకుతున్నామో తెలుసా?" ఆత్రంగా చెయ్యిపట్టుకుంది అక్కయ్య. ఆమె కళ్ళలో నీళ్లు! మెల్లగా వాచీ చూసుకున్నాడు. రెండు ముళ్ళూ పదకొండు దగ్గర కలిసి ఉన్నాయి.

ఆలోచనలతో ఇంతకాలం గడిచిందా !....

"ముఖం అంత అలసిపోయి ఉందేం; నీకేమీ కాలేదు కదా !"

ఆనంద్ జవాబు చెప్పలేదు. అతనికి పరిస్థితి సిగ్గు తెప్పిస్తోంది. చిన్నపిల్లవాడిని వెతికినట్లు తనని వెతుక్కుంటూ - వీళ్ళంతా ! చీకటంటే తనకి భయమా !

"మీ మామగారు మనందరిని వాళ్ళ కాటేజీల్లోకి వచ్చెయ్యమంటున్నారు!-"

"ఇప్పుడేమీ వద్దు. తరువాత ఆలోచిద్దాం-" ఆనంద్ శర్మముఖంలోకి చూడకుండానే అన్నాడు. అతనికి భయంగా ఉంది-ఆయన్ని చూస్తే ఆవేశంకొద్దీ ఏ తొందరపాటు పని చేస్తాడో అని. సీన్ క్రియేట్ చెయ్యడం అతని కిష్టం లేదు.

"సరే. పద .... తొందరగా స్నానంచేసి ... ఫలహారం చేద్దువుగాని ...."

అతను - ఆమె వెంట కాటేజీలోకి నడిచాడు. వేడినీళ్లు అమర్చి స్నానంచేసి రమ్మంది.

అతను వచ్చేసరికి ఫలహారం సిద్ధంగా ఉంచింది.

"వొద్దక్కయ్యా! నా కేమీ ఆకలిగాలేదు. నిజంగా-"

"మా మరదలంత అందమయిందే కాని-" నవ్విందామె - "కొంచెం తిను. రేపు ప్రయాణమూ అదీ చెయ్యాలి. అదీకాక- నువ్వింత అమాయకుడివని రేఖకి తెలిస్తే మరీ లోకువ అయిపో గలవ్-"

"అటువంటి ప్రమాదం సంభవించదులే." ముభావంగా అన్నాడు. అక్కయ్యకి యింకేం అనేందుకూ అవకాశం యివ్వ కుండా ఉండేందుకు బలవంతంగా ఫలహారం తినసాగాడు.

"ఏమో అనుకున్నాను కాని - నువ్వు చాలా అదృష్ట వంతుడివి-"

సరిగ్గా ప్రవేశించారు బావగారు. "రెండువిధాల చక్కని అమ్మాయి-ఎంచక్కని ఉద్యోగము, ఆనంద్ నిజంగా అదృష్ట వంతుడే."

అతని పరిస్థితి ప్రాణసంకటంగా ఉంది. వాళ్ళ మాటల నత నెంతమాత్రమూ భరించలేక పోతున్నాడు. అడక తైరలో వక్క అయిపోయాడు. ప్రతిఘటించలేని అసమర్థుడై పోయాడు.

"ఆమాట కొస్తే రేఖా అదృష్టవంతురాలే. ఆనంద్‌లాంటి మంచివాడు దొరికాడు".

"మీ తమ్ముణ్ని నువ్వూ- మా చెల్లెల్ని నేనూ మెచ్చేసు కున్నాం. ఐపోయింది. ఈ యిద్దరి అదృష్టవంతుల దాంపత్యమూ ఎంత అద్భుతంగా ఉంటుందో చూడాలి".

వారి ఒక్కొక్కమాటా అతని గుండెలో శూలమై గుచ్చు

కంటోంది. పుండును రేపుతోంది.

"ఇంకెంత? రేపో మాపో ఆ ముచ్చటా తీరుతుంది."

పళ్ళెంలో చెయ్యి కడిగేసుకుని లేచిపోయాడు మౌనంగా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

అక్కడికీ వచ్చిందక్కయ్య "తమ్ముడూ!"

"ప్లీజ్... నాకు నిద్దరొస్తోందక్కా!" మెల్లగా అన్నాడు. ఆమె కన్నుల్లో నిరుత్సాహం నిండింది. "అయ్యో! నిన్నెన్నో ఆటలు పట్టిద్దామనుకున్నాను సరదాగా."

"నా జీవితమే హాస్యాస్పదమే కాబోతూంది- అనుకున్నా డతను బాధగా. అతని హృదయంలో రేఖ మెదులుతూ ఊచకోత కోస్తూంది. అతనికి దుర్భరంగా ఉంది. గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. అక్కయ్య అక్కడినుంచి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతూ చివరి మాటగా అన్నట్టు ఒక్క ప్రశ్న మాత్రం వేసిందామె. "చదివింపుల వేళ నీకు మీ మామగారిచ్చిన కవరులో ఏముంది?"

"కోటు జేబులో ఉంది. నువ్వే చూడు" అని అటు తిరిగి పడుకున్నాడు.

ఆమె వెళ్ళిపోయింది, అతన్ని ఒక్కడినీ ఆ గదిలో వదిలి.

కొంతసేపటి వరకూ అతను కిటికీ అవతల చీకటిలోకే చూస్తూ కూర్చున్నాడు. ఈసమయంలో రేఖ ఏంచేస్తూఉంటుంది? ఇంకేం చేస్తుంది? తన పాచిక నెరవేరినందుకు ప్రణాళిక విజయవంతమయినందుకు ఆనందంతో ఊగిసలాడిపోతూంటుంది. ఆమె గర్వం అణిగిపోయేలా - ఆమె ఆనందం అంతా అంతరించిపోయేలా...ఒక్కమాట చెప్పేసి యిక నీకూనాకూ ఏమీ సంబంధం లేదని...అసలు సంబంధం అంటూ ఏముంది? కాకపోతే ఆమె మెడలో తాను ఒకతాడు కట్టాడు. దాన్ని తెంపడం ఎంతసేపు. అది కట్టి ఎంతసేపయిందని? ఇప్పుడు దాన్ని తెంపేస్తే...? తెలిసినవారు వింతగా చెప్పుకుంటారు. పెళ్ళివిడాకులూ- ఒక్కరోజులోనే జరిగిపోయాయని. అదొక విడ్డూరమౌతుంది.

గోడమీద- రెండుగోడల్లూ కలిసేమూల- బంగారు తీగె మెరుపు. అది సాలెగూడు. ఆ సాలెగూటిలో ఏదో పురుగు చిక్కుకుని బయటపడలేక గిలగిల కొట్టుకుంటుంది. మెల్లమెల్లగా సాలీడు

దాన్ని చేరవస్తూంది. ఆ పురుగుని తినేస్తుంది. అందుకే అది అంద మయిన దారాలతో సాలెగూటిన ల్లింది. అమాయకపుపురుగు ఆకర్షణ కొద్దీ దానిలోచిక్కి బలికాబోతూంది. తన గతి అంతేనా? ఉహుం కాదు. తను మనిషి. సాలెగూటిలాటి వాళ్ళపథకాన్ని తను ఛేదించే ప్రయత్నంచేస్తాడు. విజయం సాధిస్తాడు. అసలు తను మోసంలో ఎందుకు చిక్కుకున్నాడు? ఎరవిచూసి ఆశపడి గొంతులో గాలపు ముల్లు చిక్కుకున్న చేపపిల్ల ఎందుకయ్యాడు? ఉద్యోగం కోసం కాదూ. ఇందులో తనస్వార్థం మాత్రంలేదూ? ఉద్యోగం కోసం తపించిపోయి, అదేసర్వస్వమూ అనుకుని–అంతకుమించి ఏమీ చూడ లేని గ్రుడ్డితనంలో...తననితానే నాశనం చేసుకున్నాడు. కాకపోతే శర్మ అడిగి అడగకుండానే తను అలాగే అనెయ్యడంవేమిటి? స్వయంకృతాపరాధం, ఫలితాలూ పరిణామాలూ వచ్చినట్లు భరించి తీరవలసిందే.

అతని ఆవేశం దిగజారింది. ఆలోచనలు పెరిగాయి. మెదడూ, హృదయమూ నార్మల్‌కి రాసాగాయి. మోసం ప్రాతి పదికగా జరిగిన తన వివాహం భవిష్యత్తులో ఏ దిశవేపు వికసిస్తుందో ఊహించబోయి విఫలుడయ్యాడు. అతనికి రేఖమీద కసిమాత్రం తగ్గలేదు. శర్మమీద పగ – కరగలేదు, రేఖనేం చెయ్యాలో తోచలేదు. అన్ని ఆలోచనలనూ బలహీనంగా వాయిదా వేశాడు. నిద్రపోదా మనుకున్నాడు. కనురెప్పలు బరువుగా ... కళ్ళు మంటగా...చాలా నీరసంగా....నిద్రమాత్రం రాదు—ఇదో రకపు చిత్రహింస ... శరీరాన్ని, మనసుని, కూడా వేధిస్తూ ... మండిస్తూ...

ఎక్కడో పక్షుల అరుపులు...తెల్లవారబోతూంది కాబోలు, తన కంటికి వెలుగు కనిపించడంలేదు రేఖా మాత్రంగా అయినా. అంతా చీకటే. కళ్ళు తెరిచినా మూసినా ఒకటే, చీకటి .. చీకటి... చీకటి...మళ్ళీ వెలుగెప్పుడు?

కోవెలలోంచి సుప్రభాతం, మనసుని కదిగేస్తూ, దివ్య సంగీతం, స్వప్న పాడుతున్నట్లు వస్తూ, మనసూ వశం తప్పిన తనం. తెలియనితనం. మనసు ఎక్కడకో మాయమౌతూ, ఏవో లోకాల్లో తేలిపోతూ, ఈ అనుభూతి శాశ్వతంగా ఉండిపోతే!

"ముఖం కడుక్కుంటావా! స్నానంచేసి దేముణ్ని దర్శించుకుందాం" అంటూ వచ్చింది అక్కయ్య. విజాని కతనికి మంచం మీదనుంచి లేవాలని లేదు. నిద్రలేమి, నీరసం...ఆలోచనలతో బరువెక్కిన హృదయమూ - వివశుడై ఉన్నాడతను. కాని లేవకతప్పలేదు. తనకోసం ఒకరినెందుకు బాధించాలి? ప్రాణప్రదంగా చూసుకునే అక్కయ్యకి తన ఆశాభంగమూ, అంతర్మథనమూ తెలియకూడదు. ఆమె బాధ పడకూడదు.

స్నానం చేసి - అక్కయ్య బావగార్ల వెంట ఆలయంలో ప్రవేశించాడు. ధర్మదర్శనంలో క్షణం సేపటికంటే సాక్షాత్కరించలేదు స్వామి. కాని - ఒక్కసారికే తన హృదయ ఫలకం మీద ఎన్నటికీ చెరగని ముద్రవేశాడు. ఆ చిరునవ్వు దేనికీ? తన సృష్టిని చూసి తానే నవ్వుకుంటున్నాడా? లేక ఆ చిరునవ్వు తనకి కర్తవ్యం సూచించడానికా? ఆ సర్వాంతర్యామిలో పరాత్పరునిలో తనకి విశ్వాసం ఉందో లేదో తనకే తెలియదు. కాని నిశ్చయంగా అతని ప్రభావం మాత్రం తన మీద పడింది. తనలో నవజీవం నిండింది. ఆలోచనలు కొత్త కవాటాలు తెరుచుకుంటున్నాయి. ఆ చిరునవ్వుకి అర్థం తెలిసినట్లే ఉంది. దానిఅర్థం తప్పులను క్షమించడంలో చాలా ఔదార్యం ఉందనీ, క్షమే దైవత్వమనీ కాదా. ఔను. రేఖ తన తప్పుని అంగీకరించి పశ్చాత్తాపపడితే నిశ్చయంగా తను క్షమించాలి. పొరపాటు మానవ సహజం. తెలిసీ తెలియనితనంలో పరిస్థితుల ప్రాబల్యంలో పొరపాట్లు జరుగుతాయి. వాటికి పశ్చాత్తాపమూ, క్షమా అవే నిష్కృతి. రేఖ తన హృదయంలోని ఆవేదనను బయటపెడితే తను తప్పకుండా క్షమించాలి. అదే న్యాయమూ, ధర్మమూ. విజానికి డాక్టర్ మూర్తి తారసపడి మైకంలో ఆ నిజం చెప్పకపోతే తాను రేఖపట్ల ఎలా ప్రవర్తించేవాడు ఉహుఁ మూర్తి చెప్పకపోయినా రేఖ నిశ్చయంగా చెప్పేదూ. తప్పకుండా చెపుతుంది. అటువంటి చేదు నిజం వినగానే మతిపోయి క్షణికంగా ఆవేశంలో ఆమె ముందు కఠినంగా ప్రవర్తించడం - అది తప్పింది. మూర్తి ధర్మమా అని. క్షమించు మూర్తీ! అప్పుడు నువ్వు నిజం చెప్పి బ్రతుకు బండలు చేశావనుకున్నాను. కని అదికాదు. వున్న

ముందు చెప్పేటట్టి పరిస్థితి నెదుర్కొగలిగే ఆత్మ స్థైర్యం నాలో పెంచుకో గలిగాను. ఇందుకు నీకు నా కృతజ్ఞతలు. నిజంగా కృతజ్ఞతలు.

*  *  *

రావ్ అండ్ రావ్ ఇంపోర్ట్సు అండ్ ఎక్స్‌పోర్ట్సు తాలూకు ఆఫీసు హైదరాబాదులో ఉంది. అదే హెడ్డాఫీసు గగన్‌మహల్ రోడ్డులో చక్కని స్వంత భవనంలో ఉందా ఆఫీసు. దాని కన్ని హంగులూ ఉన్నాయి. ఎ.సి. బిల్డింగది. అకౌంట్సుకీ, ఎస్టాబ్లిష్‌మెంటుకీ, అక్కడ మకుటం లేనిమహారాజు శర్మ. అతని క్రింద పాతికమంది పైగా ఉద్యోగస్తులున్నారు. జూనియర్ అకౌంటెంట్లూ, సీనియర్ అకౌంటెంట్లూ కలసి పదిహేనుమంది ఉంటారు. బ్రాంచీల నుంచి వచ్చిన లెక్కలని తనిఖీ చెయ్యడమూ, లాభనష్టాలు తేల్చడమూ-ప్లానింగూ...యివీ ఆ సెక్షనుచేసే ముఖ్యమయిన పనులు. కంపెనీడైరెక్టర్లకి శర్మమీదా, అతని శక్తిసామర్థ్యాలమీదా చక్కని అభిప్రాయం ఉండడం వలన ఆ ఆఫీసంతటికీ అతనే చక్రవర్తి. పైగా శర్మ డైరెక్టర్లతోకలసి చక్కగా తాగగలడుకూడా. హైదరాబాదులో పెద్ద ఆఫీసర్లకి తాగడం కూడా ఒక ప్రధాన అర్హత. బోర్డాఫ్ డైరెక్టర్స్‌కీ — స్టాఫ్‌కీ కూడా ఆనంద్ తన అల్లుడిగానూ, జూనియర్ అకౌంటెంట్‌గాను పరిచయంచేసి, ఆనంద్‌కి వర్కు అలాట్ చేసి వెళ్ళారు శర్మ. సెక్షనులో ఉన్న నలుగురయిదుగురు జూనియర్ అకౌంటెంట్లూ ఆనంద్‌వేపు అదోక భావంతో చూశారు. వాళ్ళతీరు ఎలా ఉందంటే కొంచెం చనువుంటే జోకులు వేసేవారే అన్నట్లుంది. ఆనంద్ డ్యూటీలో చేరినట్లే. మధ్యాహ్నం యింటికి వెళ్ళాడు — కారులో — ఇల్లు, క్వార్టర్స్ ఏమంత దూరం కాదు. ఆఫీసు ఉన్న వీధిలోనే ఒక ఫర్లాంగున్నర దూరంలో, అతను వెళ్ళేటప్పటికి డైనింగ్ టేబుల్ అట్టహాసంగా అమర్చబడి ఉంది. అక్కయ్యా, బావగారూ, శర్మ, రేఖా కూర్చున్నారు. రేఖ ప్రక్కన ఒక కుర్చీ ఖాళీగాఉంది. వాళ్ళ భావము అర్థమయ్యాక, ప్రతిఘటించడం కంటే తలవంచెయ్యడమే మేలనిపించి మౌనంగా ఆ కుర్చీని భర్తీ చేశాడు ఆనంద్ — భోజనాలౌతూంటే.

"ఇక ఆఫీసుకి వెళ్ళక్కర్లేదోయ్. రెస్టు తీసుకో" అన్నారు శర్మ నవ్వుతూ. ఆనంద్ అర్థం కానట్లు చూచాడు. అక్కయ్య నవ్వుతోంది. రేఖ తల వంచుకుంది.

భోజనం చేశాక తన గదిలోకి వెళ్ళిపోయాడు ఆనంద్.

పోర్టికోనుంచి కారు తీసిన శబ్దం, శర్మ ఎక్కడికో వెళ్ళాడనుకున్నాడు. గదిలో ఒక మూల రాక్ ఉంది. దాని నిండా పుస్తకాలున్నాయి. చాలా భాగం నవలలు. వాటిలో అధిక భాగం ఇంగ్లీషువి. వాటి కవర్లు చాలా ఆకర్షణీయంగా వున్నాయి. ఆస్కార్‌వైల్డ్‌ది, పిక్చరాఫ్ డోరియన్ గ్రే అందుకున్నాడు. గది చల్లగా, హాయిగా వుంది, ప్రశాంతంగా వుంది. పుస్తకం మనస్సు నాకట్టుకుంటుంది. పేజీలు తిరుగుతున్నాయి. ఎప్పుడో నిద్ర పట్టేసింది. తిరిగి మెలకువ వచ్చేసరికి సాయంత్రపు ఎండ కిటికీలోంచి పడుతూ గదికి బంగారు పూత వేస్తోంది. అందమయిన ఎండ. గదిలో ఒక మూల వాష్ బేసినుంది. ముఖం కడుక్కుని తల దువ్వుకున్నాడు. బట్టలు వేసుకున్నాడు. రేఖ వచ్చి టేబులుమీద టిఫినూ, కాఫీ పెట్టి వెళ్ళిపోయింది మెరుపలాగా. ఆనంద్ గుండెలు వేగం పెంచుకున్నాయొక్కసారి. వెళ్తూ ఒక్క మాటంది: "మీరు కావాలంటే మేడ మీదకు వెళ్ళి కూర్చోవచ్చు" ఇంట్లో ఏదో హడావిడిగా వుంది. ఒకసారి అలాగా రోడ్డు మీదకు వెళ్ళి రావాలనిపించింది. బయలుదేరబోతూండగా అక్కయ్య వచ్చి "ఇప్పుడు నువ్వు ఎక్కడికీ వెళ్ళడం అంత బాగుండదు" అంది. "ఏం!" ఆశ్చర్యంగా చూశాడు. ఆమె నవ్వింది అర్థం చేసుకోమన్నట్లు. ఏమీ తెలియనితనంలో మళ్ళీ గదిలోకిపోయి పుస్తకం పట్టుకుని కూర్చున్నాడు. పెద్ద పెద్ద కిటికీలలోంచి ధారాళంగా గాలి వస్తోంది. వేసవి అయినా చాలా చల్లగా, సుఖంగా వుంది. తరువాత అన్నీ తనకు ఆశ్చర్యంగానే జరిగాయి. స్నానం, కొత్త బట్టలు, భోజనానికి బదులు పాయసమూ ఫలహారమూ మేడ మీద గదికి తీసుకు వెళ్ళడమూ....

మేడ మీద అదొక్కటే గది. గది ముందు కొంత కజాగా వుంది. అది గ్లాస్ రూమ్. విశాలమైనది కాకపోయినా

అక్కడ మంచమూ, టేబులూ కాక అద్దే సామానులు లేకపోవ డంతో వున్న దానికంటే పెద్దదిగా కనిపిస్తూంది. టేబులు మీద పళ్లు ఫలహారాలూ మెరుస్తున్న ప్లాసిక్ బేసిన్‌లో. వెన్నెల గాజు గోడల గుండా గదిలోకి పడుతూంది. ఒక మూల ఒదిగి వున్న టీపాయ్ మీది ట్రాన్సిస్టరు సంగీతం ప్రసారం చేస్తోంది. సీలింగ్ ఫ్యాన్ తిరుగుతూ గాలినీ, గాజు గోడలకున్న తెరలనీ చలింపజేస్తోంది. నీలిరంగు తెరలు నీటిలాగా అల్లల్లాడుతున్నాయి. అప్పుడు వచ్చింది రేఖ. తెల్ల చీరలో, మల్లె పూవులతో, పూల జడతో, పరిమళాలతో, గాజులు మృదువుగా గలగల సంగీతంతో - అతను అటువైపు చూశాడు. దివి నుండి భువికి దిగివచ్చిన అప్సరస. అతను ఆపాదమస్తకమూ కంపించాడు. గుండెలు వేగం పెంచుకున్నాయి. పెదవులు ఆరిపోయాయి. నరాలలో వింత చలనాలు.

తనువూ, మనసూ వశం తప్పుతున్నట్లు .. ఏమిటో అయి పోతున్నట్లు అలాగ ఆమెను చూశాడు. ఒక కంట జాలి. మరొక కంట ఆవేశం. ఈమె పవిత్రురాలుకాదు. లోగడ తప్పుచేసిన మనిషి. ఆ తప్పు ఒప్పుకుని పశ్చాత్తాపపడే వరకూ అమలినకాదు. తను ఆమెను స్పృశించకూడదు. ఔను. అంతే తను పవిత్రుడు. అవకాశాలు వచ్చినా - తను శీలం కోల్పోదు. కాదూ?

రేఖ అతనివైపు తదేకదృష్టితో చూస్తూనిలుచుంది. అతను శిలే ఐపోయాడు. ఆమె విశాల నయనాలలో అనేక భావాలు - సంచలనం - స్పష్టంగా ప్రతిఫలిస్తూ. క్షణాలు... నిముషాలు... కాలంలో కలసిపోతున్నాయి. నిలుచున్న చోటునుంచి యిద్దరూ ఒక్క అంగుళమయినా ముందుకి కదలలేదు. ఆ దూరం ఏనాటికీ చేరువౌతుందన్న ఆశలేనట్లు. ఇద్దరినీ ఏదో శాపం తాలూకు పాశాలు కట్టిపడేసినట్లు.

చివరికి రేఖ అంది: "గ్రీటింగ్స్ బదులు రాస్తారేమో? అలమరలో ఉంచాను." అతనికి నవ్వొచ్చింది. ఏడుపూ వచ్చింది. "శుభాకాంక్షలా!" అన్నాడంతే.

పాపం! వాళ్ళ కేం తెలుసు! తమది యిటువంటి వివా హం అని. నిష్కల్మష హృదయాలతో శుభాకాంక్షలు పంపి

వుంటారు. అమాయకంగా వాటి ప్రభావం కూడా తను దాంపత్య జీవితాన్ని సరిచేయలేక ఓడిపోతుంది. తాము శాపదగ్ధులు. గ్రీటింగ్స్ అన్నిటినీ ఒక కవరులో-మంచంమీద ఉంచి - కిటికీవద్దకు వెళ్ళి నిలుచుంది. రేఖ గ్లాసు గోడలలోంచి పడుతున్న వెన్నెల ఆమెతెల్ల చీరలోనూ శరీరంలోనూ కలిసిపోయి కరిగిపోతూంది. ఆమెతలలో మల్లెలు తమ ఉపయోగం లేదేమో అన్నట్లు వాడిపోతూ చివరి యత్నంగా మరీ పరిమళాలను చిందిస్తున్నాయి. అష్టమి చంద్రుడు వింత చూస్తున్నట్లు ఆకాశంలో వంకరగా విలబడిపోయాడు. ఆనంద్ మంచంమీద కూర్చుని శుభాకాంక్షలను ఒక్కటొక్కటిగా పరిశీలిస్తున్నాడు. స్వప్నగూడా పంపింది.

గదిలో నీలిదీపం మసక మసకగా వెలుగుతూంది. రేఖ ఎదురుచూస్తుంది. అతను పిలుస్తాడేమో అని. అతనూ ఎదురు చూస్తున్నాడు ఆమె నిజం చెబుతుందేమో అని. ఇద్దరూ ఒకరికి తెలియకుండా ఒకరు - ఒకరినొకరు చూస్తున్నారు. రేయి గడచి పోతోంది- నిశ్శబ్దంగా - నిష్ఫలంగా వాళ్ళ నిరీక్షణలా. ప్రసార సమాప్తి అయ్యేవరకూ పాడి పాడి వాగిన ట్రాన్సిస్టర్ గొంతు మూగవోయినట్లూరుకుంది. ఆమె ఆ కిటికీ దగ్గర అతను మంచం మీద తొలిరేయి అలాగ.

మంచం మీద పూలు వాడి వత్తులయ్యాయి. అయినా అంకో యింతో వాసనలు విరజిమ్మడానికి ప్రయత్నిస్తున్నాయి. తెల్లగా తెల్లవారింది. గదిలోకి సూర్యకిరణాలు ఎర్రగా గులాబి రేకుల్లా. అతనికి మెలుకువ అయింది. ఆ గదిలో రేఖ లేదు. వెలుగును చూసిన చీకటిలా ఎప్పుడో వెళ్ళిపోయి ఉంటుంది. అతను-మొహమాట పడుతోనే మేడమెట్లు దిగసాగాడు. కిందకి దిగేసరికి అక్కయ్య ఎదురయింది - చాలా అర్థవంతంగా నవ్వుతూ. జాలిగా తలవంచుకున్నాడు. తనను గురించిన నిజం ఎవరికి చెప్పుకోగలడు? లాభమేముంది? త్వరగా ఆఫీసుకు వేళ అయితే బాగుంటుంది అనుకున్నాడు పల్లు తోముకుంటూ. కాఫీ-ఫలహారమూ తెచ్చి టేబులుమీద ఉంచి వెళ్ళిపోయింది రేఖ.

ఇంతలో అక్కయ్య వచ్చింది. "ఆనంద్! ఇవాళ మేము వెళ్ళిపోతాం" అంది.

"అప్పుడేనా?" కాఫీ సిప్ చేస్తూ చూశాడు.

"మీబావగారి సంగతి నీకు తెలియనిదేముంది? అసలే అంతంత మాత్రంగా ఉంది -" ఇంకేమీ అనలేకపోయాడు. స్వతంత్రుడుకాని తనకామెను ఉండమనే అధికారం ఎక్కడిది? ఈ యింట్లో తనే ఒక అతిథి. త్వరలో తను వేరే వెళ్ళాలి. తనదీ అనుకోగలిగే యింటికి. అప్పుడు కొంత స్వేచ్ఛగా ఉండ గలదేమో? ఈ యింట్లో సుఖాలకి లోటు లేదు కానీ-మనసుకి మాత్రం హాయిగా ఉండదు.

సికింద్రాబాద్ స్టేషనులో వాళ్ళని రైలెక్కించాడు.

"చూడు ఆనంద్! రేఖ చక్కనిది. మంచిది. జాగ్రత్తగా చూసుకో. కలిసి వచ్చిన అదృష్టాన్ని నిలుపుకో. వీలుచూసుకుని యిద్దరూ అక్కడికి రండి. మమ్మల్ని మరచిపోకు-" కళ్ళలో నీళ్ళు తిరిగాయామెకు. "నేను నీకు అక్కనే కాదు అమ్మనుకూడా! నువ్వు - తమ్ముడివేకావు. మా అబ్బాయివేళ .... నీకోసం! నేనూ మీ బావగారూ తలుచుకుంటూనే ఉంటాం. మమ్మల్నిమరచి పోవు కదూ?" తనకీ కన్నీటి పర్యంతం అయింది. అక్కయ్యా కూడా దూరం అయిపోతుంది. ఇక తను ఒంటరి. బావగారూకూడా మాటలు రానట్లు మిగిలిపోయారు.

రైలు కదిలింది. మెల్లమెల్లగా వాళ్లు కనుమరు గయ్యారు. రుమాలుతో కళ్లు తుడుచుకుని స్టేషను బయటకు వచ్చాడు. ఒంటరితనపు భావం మరీ హృదయాన్ని ఆవరిం చింది. టాక్సీలో ఆఫీసుకి వెళ్ళిపోయాడు. కొంచెం ఆలస్యం ఐంది. ఓ పావుగంట. అటెండెన్స్ రిజిస్టరులో సంతకంపెట్టి పంపేశాడు. సెక్షన్‌లో గుసగుసలు... అవి అతని చెవుల వరకూ రాకపోవడంలేదు. స్పష్టంగానే అంటున్నారు వాళ్ళు. "ఆఫీసరు గారి కొత్త అల్లుడు. లేటుగా కాదు .. అసలు రాక పోతే మాత్రం ఎవరేం చెయ్యగలరు! శర్మగారికి బోర్డులో ఉన్న పరపతి తక్కువేమీ కాదు—"

"మనం ఐదునిముషాలు ఆలస్యమయితే రూములోకి పిలిచి ధర్మపన్నాలు చెబుతారే, అల్లుడిగారి విషయంలో ఉదాసీనత ఎందుకో?"

"బాగుంది. ఎంత మామయినా అల్లుడిముందు అణగి ఉండ వలసిందే."

"అందులోనూ అవదు అవదు. పెళ్ళే అవదనుకున్న అమ్మాయికి ఫస్ట్‌హాండ్ మొగాడు దొరికాడా! అపురూపమే!"

ఆనంద్‌కి మతిపోయింది. ఒకస్థాయిలో ఉద్యోగస్తులై కూడా ఎదుటివాడి పరిస్థితి తెలుసుకోకుండా ఇంత నీచంగా మాట్లాడతారేం వీళ్ళంతా? పైగా-రేఖ విషయం వీళ్ళకి బాగాతెలిసి ఉన్నట్లుంది కూడా!...ఆమె అంత అన్‌పాప్యులర్ అయిందా?

"ప్రిన్సిపల్స్ ఉన్నవాళ్ళెప్పుడూ సుఖపడలేరోయ్. ఇప్పుడు ఎన్నుకుని ఏంలాభం? ఆ అమ్మాయిని నామమాత్రంగా పెళ్ళి చేసుకుంటే-శర్మగారు అందలం ఎక్కించేవారు. పైగా ఆయన ఆస్తికూడా దక్కేది. ప్చ్...మీరు అవకాశం వదులుకున్నారు"

ఆనంద్ ముఖం ఎర్రబడింది. వారిమాటలు కొరడా చివర్ల లాగ ఛెళ్ళున తగిలాయి. వాళ్ళని సూటిగా ఎదుర్కొనే అవకాశం యివ్వకుండా మాటలు విసురుతున్నారు.

"ఎందుకయినా మంచిది. మీరు అందరూ సవ్యముగా మసులుకోండి. అతిత్వరలో ఈయన మనకి బాస్‌గా ఐపోయే ప్రమాదంకూడా లేకపోలేదు అప్పుడు. ఆనంద్....ముఖం ఎర్రబడి పోయింది. తనెంత పొరపాటు చేశాడు! వ్యక్తిత్వం పోగొట్టుకున్నాడు. విలువలు నశింపజేసుకున్నాడు. మర్రినీడను చేరాడు. తనకై తానేమయినా విజయం సాధించినా ఆ గర్వమూ,తృప్తీ తనకి మిగలనివ్వరు. శర్మగారికే అంటగడతారు. జీవితమంతా నీడలోనే వెళ్ళిపోతుంది. గ్రహణంపట్టిన బ్రతుకౌతుంది.దీనినుంచి తప్పించుకోడం ఎలా? ముందు తనచుట్టూ ఉన్నమనుషుల నోళ్ళు కట్టించడం ఎలా ?

ఒక్కసారి లేచినిలుచున్నాడు ఆనంద్. కష్టపడి చిరునవ్వు నవ్వాడు. "ఫ్రండ్స్, నిన్న చాలా హడావిడిగా ఐపోయింది. మనం ఒకరికొకరం పూర్తిగా పరిచయాలు చేసుకోలేకపోయాం. అంతే కాదు. నేను నిర్వహించవలసిన బాధ్యతనికూడా మరచిపోయాను. అందుకు మీరు నన్ను క్షమించగలరని ఆశిస్తాను. కొత్తగా వచ్చిన వాడినీ, అనుభవంలేనివాడినికదా? ఇవాళ మీకు పార్టీ యివాలను

కుంటున్నాను. మీరంతా తప్పకుండా సహకరిస్తారని నా నమ్మకం. కొంచెం గ్రాండ్‌గా. కొత్తవాడినికనుక-ఏర్పాట్ల విషయం మీకు వది లేస్తాను. బిల్లుమాత్రం...నాదే దయచేసి"...అంటూ ఆగాడు. అందరి ముఖాలూ ఒక్కసారి వికసించాయి.

"గ్రాండ్‌గా అంటే త్రీ ఏసెస్‌లోనే." అనేశాడొకడు.

"క్షమించాలి. నేను అందులో కంపెనీ కీప్ చెయ్యలేను. ఏ లెమనేడో తాగుతూ...."

"అన్‌బిలీవబుల్. శర్మగారి అల్లుడు టీటోటాలర్ అంటే నమ్మగలగడం మా తరంకాదు"

"నిజం, చాలా సందర్భాలలో నమ్మశక్యము కాకుండానే ఉంటుంది"

"ఇంతవరకూ అలవాటు లేకపోతే యివాళ ప్రారంభిం చండి. గుడ్ బిగినింగ్."

"సారీ!-" అనేశాడు ఆనంద్. సాయంత్రం ప్రోగ్రామ్ ఏర్పాటయింది. త్రీఏసెస్‌లో వెట్‌పార్టీ తరువాత - సినిమా- అలాగ. ఆ రాత్రి ఆనంద్ యింటికి వచ్చేసరికి చాలా ఆలస్యమే ఐంది. శర్మ, రేఖ అతనికోసం కనిపెట్టుకుని ఉన్నారు.

"ఇంత ఆలస్యమయిందేం, ఎక్కడికి వెళ్ళావు?" ఆయన అభిమానంగానే అడిగినా ఆనంద్‌కి ఆ ప్రశ్నలో చాలా అర్థాలు ధ్వనించి కోపం వచ్చింది. సమాధానం చెప్పకుండా మౌనంతో తన కోపాన్ని తీర్చుకున్నాడు. ఆయన అప్పటికే కొంచెం పుచ్చుకున్నట్లున్నాడు.

పార్టీలో - తనమీద తక్కువ జోకులు పడలేదు. "మీ మామగారికి తెలుస్తుందనా! పర్లేదు. చెప్పమని ప్రామిస్ చేస్తున్నాం. ఒక్క రౌండ్ ఒకే ఒక రౌండ్."

డ్యాన్సింగ్ ఫ్లోర్‌మీద ప్రొఫెషనల్ - నాట్యం చేస్తూంది. కాబరే కాదుకానీ అర్ధనగ్నంగా. ఆమె చక్కగా ఉన్నమాట నిజమేకానీ మిగిలిన చాలామందిలాగ తను కళ్ళప్పగించలేదు. అది గమనించికాబోలు- "ఔను ఆనంద్ మీకు యింట్లోనే చాలా అందం. అందుకే మిమ్మల్ని డ్యాన్సర్ కొంచమయిన ఆకర్షించ లేకపోతూంది కదూ?"

వాళ్ళు తాగి ఉన్నారు. తను తాగలేదు. కనుక నిగ్రహం వహించటం తన వంతే అయింది.

"నాకు రొట్టెలు చాలు. అతనికి అన్నం ... రొట్టెలు అలవాటు కాదనుకుంటాను-"

కుక్‌కి చెప్పారు శర్మ. రేఖ తనపక్కనే కూర్చొంది. భోజనాలు కాగానే ఎవరితోనో అన్నట్లు అంది రేఖ- "మీకు-మేడమీద పక్క-వేసి ఉంది"

ఆ గ్లాస్ రూమ్‌లో పడుకోవడం నిజానికి యిష్టం లేక పోయినా తన అయిష్టాన్ని ప్రకటించడం కూడా యిష్టంలేక మేడ మెట్లు ఎక్కాడు. గడియారం పదకొండు గంటలు కొట్టింది. రేఖ వస్తుందేమో అని ఐదునిముషా లెదురుచూసి నిద్రపోయాడు. లేచేసరికి - టేబులుమీద గ్లాసులో చల్లారిపోయిన పాలు కనిపించాయి. ద్వారం దగ్గర రెండో మూడో మల్లెపూలు పడి వాడి ఉన్నాయి. తిన్నగా తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఆ యింట్లో ఆ గది మాత్రం అతనికి కొంచెం సుఖంగా ఉంటుంది. ఎందుకంటే ఆ గది నుంచి కనీసావసరాలకు బయటకు పోనక్కర్లేదు. అంతేకాదు. అది చాలా వేరుగా విడిగా కూడా ఉంటుంది. [redacted]గా - ఆ గదిలో పుస్తకా లున్నాయి. పిక్చరాఫ్ డోరియన్ గ్రే చదివాక ఆస్కార్ వైల్డుని మనసులో తెగమెచ్చుకున్నాడు. రచయిత ఊహ నిజమై-మనుషుల చేతలన్నీ ముఖ సౌందర్యంలో ప్రభావం చూపెట్టడం మొదలుపెడితే - ముఖం చూడగానే గత జీవితం తెలిసేసుకోవచ్చు. అప్పుడు - రేఖ రూపం ఎలా ఉండి ఉండేది? నిశ్చయంగా యిప్పటిలా అందంగా కాదు. శర్మ-రాక్షసుడి ముఖంతో ఉంటాడేమో! తను, తన గతంలో పాపాలు చెయ్యలేదు. కనుక తన ముఖం మామూలుగానే ఉండవచ్చు. రేఖ చరిత్ర ఏమిటో? తను - ఆమె మొదట రాత్రే గతం చెప్పి క్షమించమని కోరుతుందనుకున్నాడు. కాని అలా చెయ్యలేదామె. ఎంత ధీమా! ఎంత గర్వం! ఔను ఆమె శర్మ అమ్మాయి. వెనక డబ్బుంది. అదీకాక తనకి యిక్కడ బొత్తిగా స్థాన బలిమి లేదు. వాళ్ళింట్లో తను. వాళ్ల దయదలచి యిచ్చిన ఉద్యోగం చేస్తూ-తనకి విలువేముంటుంది?

ఉద్యోగం పేరుతో తన వ్యక్తిత్వమూ, విలువలూ సమాధి చేయబడ్డాయి. ఈ గోరీలనుంచి తను లేచి ఎదగాలి. ఎలా ? కుక్ వచ్చి ఫ్లాస్క్‌తో కాఫీ పెట్టి వెళ్ళిపోయాడు. ఇంట్లో శర్మకూడా లేనట్లుంది. రేఖ ఏం చేస్తుందో ? ఏం చేస్తే తనకేం ? ఒకటిమాత్రం తను జాగ్రత్త పడాలి. ఈ ఇంట్లో రోజుకి ఎంత తక్కువ కాలం గడిపితే అంత శ్రేయస్కరం. కొంచెం బయట కాలక్షేపా లేర్పరుచు కోవాలి.

బట్టలు వేసుకుని రోడ్డుమీదకు వెళ్లాడు దగ్గరలోనే ఒక లైబ్రరీ కనిపించింది. వెళ్ళి ఎనిమిదిన్నర వరకూ కూర్చున్నాడు. వస్తూంటే షార్టుహాండ్ ఇన్‌స్టిట్యూట్. ఒక ఆలోచన వచ్చింది. కమర్షియల్ ఇన్‌స్టిట్యూట్ లోకి వెళ్ళి సమాచారం సేకరించాడు. లోగడ కొంతవరకూ నేర్చుకొని వదిలేసిన షార్టుహాండ్‌ని కొనసాగించడానికి నిశ్చయించుకున్నాడు. అతని హృదయం తేలికపడింది. ఆఫీసులోనూ బాగానే గడిచింది. కోలీగ్సు – పెట్‌పార్టీ ధర్మమా అని కాబోలు శత్రువుల్లా ప్రవర్తించడం మానేశారు. ఇద్దరు బ్రహ్మచారులు కొంచెం స్నేహితులయ్యారు కూడా. సాయంత్రం..

"టాంక్ బండ్ చాలా ప్రసిద్ధి చెందిన ప్రదేశంకదా ? చూపిస్తారా నాకు ?" అడిగాడు.

"అదేమిటి? అటువంటి చోటు మాలాటి కంపెనీ ఏమిటి ? హాయిగా మీ మిసెస్‌తో చూడక" అన్నారు.

"తరవాత ఆమెతో చూడవచ్చు. ఇవాళ మనం వెళ్దాం సరదాగా" అని తీసుకెళ్లాడు వారిని. ఇల్లు చేరేటప్పటికి పదిగంటలయింది. శర్మ యింటికి వచ్చినట్లు లేదు. రేఖ జాడాలేదు. కుక్ మాత్రం భోజనానికి పిలిచాడు. హోటల్లో తిని వచ్చానని చెప్పేసరికి ఒకసారి అదోలా చూసి లోపలికి వెళ్ళిపోయాడు మేడమీదకు వెళ్ళకుండా తన గదిలోనే సోఫాలో పడుకున్నాడు. చక్కగా నిద్రపట్టింది. ఏ రాత్రివేళో రేఖ వచ్చి వెళ్ళిందన్న నిదర్శనానికి ద్వారం దగ్గర రాలిపడిన సన్నజాజులు. ఉదయం కూడా శర్మ జాడలేదు. స్నానంచేసి షార్టుహాండ్ ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్లాడు. ఆఫీసుకి వెళ్ళేటప్పుడూ రేఖ ఎదురవలేదు. అదీ సుఖం

గానే అనిపించింది. ఆవేళ తన కొలీగ్స్‌దగ్గర మరికొంత విషయ సేకరణ గావించాడు. సాయంత్రం యింటికి వచ్చేసరికి—

ఇంటిముందర లాన్‌లో కూర్చున్నారు శర్మ. రేఖ. ఏవో మాట్లాడుకుంటున్నట్లున్నారు. తనని చూడగానే "రావోయ్ రా" అంటూ పిలిచారు. వెళ్లి యిబ్బందిగా గార్డెన్ చెయిర్‌లో కూర్చున్నాడు. లాన్ తడిపినట్లున్నారు, చల్లగా ఉంది. టీలు వచ్చాయి తాగుతూ—

"ఆనంద్! హనీమూన్ వెళ్తారా?" అంటూ చిరునవ్వు నవ్వారు శర్మ. అతని గుండెల్లో ముల్లు గుచ్చినట్లయింది. తనూ రేఖా హనీమూన్! ఇప్పుడు కాదు. ఎప్పుడో. ఆరోజు వస్తుందో రాదో. ఆమె అహంభావం తగ్గి తనతప్పు ఒప్పుకుని నిజంగా భార్య అయితే-అప్పుడే హనీమూన్. ఇవన్నీ జరిగితే-హనీమూన్‌కి ఎక్కడికో వెళ్లక్కర్లేదు. ఎదుటి వారి సాన్నిధ్యమే హనీమూన్ కాని-రేఖ అలాటి రోజుని రానిస్తుందా?

"వేరే హనీమూ నంటూ దేనికి లెండి?" అంటూ నవ్వు నటించా డతను. రేఖ నవ్వింది. "నీ యిష్టం. మీరిద్దరూ ఎప్పుడు వెళ్తామన్నా పంపించడానికి నేను సిద్ధమే" బట్టలు మార్చుకునే నెపంతో లోపలికి వెళ్ళిపోయాడు ఆనంద్. సర్వెంట్ అతనికి అన్నీ సిద్ధం చేశాడు. స్నానం చేసి బట్టలు వేసుకుని కిటికీ లోంచి చూశాడు. ఇంకా శర్మ, రేఖ లాన్‌లోనే ఉన్నారు ఓ పుస్తకం అందుకుని ఫ్యాన్ స్పీడు పెంచాడు. ఉక్కిరి బిక్కిరి చేస్తూ గాలి. అతను పుస్తకంలో లీనం కాసాగాడు. చీకటి పడుతోంది.

మర్నాడు ఆదివారం. ఇంట్లో గడపనక్కర లేకుండా ఏమేం చెయ్యాలో రాత్రే ఆలోచించుకుని ఉన్నాడు. ఎనిమిది గంటలకు యిల్లు వదిలి రిక్షాలో సాలార్‌జంగ్ మ్యూజియమ్‌కి బయలుదేరాడు. హైదరాబాద్ రిక్షాలు తొక్కేవాళ్లకేకాని కూర్చునే వాళ్లకి ఏమాత్రమూ సుఖంగా వుండవు. అయినా రిక్షాలో అయితే వూరు చూడడం వీలౌతుందని టాక్సీలో కాక రిక్షాలోనే బయలుదేరాడు. తోవలో మంచి హోటలు దగ్గర ఆగి మస్తుగా టిఫిను పట్టించాడు. ఆనంద్ వెళ్ళేసరికి మ్యూజియం తెరిచారు.

ఒక్కొక్క హాలూ అతి నెమ్మదిగా చూడసాగాడు. గైడ్ చెప్పే దంతా ఆసక్తిగా వింటూ నిజంగా ఆ మ్యూజియంలోని వస్తు సంపద అద్భుతమూ, అపూర్వమూ,అన్నిటినీ పోగుచేసి ఒక చోట అమర్చగలిగిన మనిషి కళాతృష్ణా,సేవాభావమూ కొనియాడ దగినవి. ఎక్కడెక్కడి వింత వస్తువులనూ సంపాదించి ఒక చోట అమర్చడం...ఎంత శ్రమదమాదులతో, వ్యయంతో కూడి పని! ఇదంతా ఒక్కడి కృషి!

పన్నెండయ్యేసరికి గంటల గడియారం లోపల నుంచి కుర్రవాడు వచ్చి...గంటలు కొట్టి-తలుపు మూసుకుని వెళ్ళి పోవడం తమాషాగా ఉంది. దాన్ని పిల్లలనుంచి పెద్దవాళ్ల వరకూ ఎంత ఆనందంగా చూశారా వింతని! భోజనం కూడా మరచిపోయి సాయంత్రం వరకూ మ్యూజియంలో ఉండిపోయాడు. మూసేస్తుంటే మళ్ళీ వచ్చి మిగతా భాగం చూడాలనుకుంటూ బయటకు వచ్చాడు. నడిచి-చార్‌మినార్ వరకూ వచ్చాడు. చెప్పులూ, గాజులూ షాపులు కలకలలాడి పోతున్నాయి. ఎన్నో రకాల పూలు రాసులు పోసి అమ్ముతున్నారు,కొనబోయికూడా ఆగి పోయాడు. ఆకలి గుర్తువచ్చింది. హోటల్లో జొరబడి ఆకలి తీరేలా చపాతీలూ రొట్టెలూ, తిని టీ తాగాడు. అక్కడ టీ చాలా చక్కగా ఉంటుంది. సాధారణంగా హైదరాబాదులో ఏ హోటల్లో నయినా టీ అతి చక్కగా ఉంటుంది. బంగారు రంగులో, దానికి తోడు యాలకుల సువాసనో, మసాలా వాసనో. అతను యిల్లు చేరేటప్పటికి యిల్లంతా నిశ్శబ్దంగా ఉంది దీపాలుమాత్రం వెలుగు తున్నాయి, బాస్ లేకపోయినా పనిచేసే బుద్ధి మంతులయిన గుమాస్తాల్లా సిన్సియర్‌గా.

పక్క గదిలోనికి అప్పుడే వచ్చినట్టున్నారు రేఖా,సురేవరో. మాటలు వినపడసాగాయి.

"సినిమా బాగుందికదూ! ముఖ్యంగా హీరోయిన్ చాలా బాగా నటించింది ఏం?"

"బానుకానీ – మీవార్ని పరిచయం చెయ్యవూ? పెళ్ళికి కూడా శుభలేఖ పంపావు కావు."

"ఇంకా నాకే పరిచయం కాలేదు. నీకేం చేసేది."

"అదేమిటే ?" ఆశ్చర్యం వింపిన గొంతు.

కసిగా అనుకున్నాడు ఆనంద్. రేఖా! నువ్వు నా పరిచయం కోసం ప్రయత్నిస్తే కదా. "అదంతేలే. అయినా వారింట్లో లేరు. ఎక్కడికో వెళ్ళారు పొద్దుటనగా. ఎప్పుడొస్తారో తెలీదు" "బాగుంది! ఇంత చక్కగా వెలగబెడుతున్నావన్నమాట! శ్రీవారెక్కడికి వెళ్ళిందీ తెలియదు. ఎప్పుడు వచ్చేదీ తెలియదు. పెళ్ళయి వారం రోజులు కాలేదు. ఒంటరిగా తిరగనిస్తున్నావా?" ఆనంద్‌కి రేఖ స్నేహితురాలి ప్రశ్నలు చాలాఆనందం యిచ్చాయి. రేఖ ఏం చెబుతుంది? "ఆయన మైనారిటీ తీరని మనిషేమీకాదు. నేను-ఆయనకి కాపలా మనిషి నంతకంటేకాదు. సరేకాని విశేషాలేమయినా చెప్పు." తేలిగ్గా తోసిపారేసిం దామె. ఆనంద్ కాళాభంగం ఉయింది. నిశ్శబ్దంగా – కళ్లు మూసుకున్నాడు. తన ఉనికి పక్క గదిలో వాళ్ళకి తెలియకూడ దన్నట్లు. స్నేహితురాలు వెళ్ళిపోయినట్లుంది. రేఖ వీడ్కోలు చెప్పింది. ఆనంద్‌కి అహం దెబ్బతింది. అంటే రేఖకి తన ఉనికిని గుర్తించవలసిన అవసరం లేదన్నమాట. ఏం మనిషి! సర్వెంట్ వచ్చి పిలిచేదాకా పుస్తకంపట్టుకుని కూర్చున్నాడు. వాడు పిలిస్తే భోజనం అక్కరలేదనేశాడు. మళ్ళీ అడక్కుండా వెళ్ళిపోయాడు వాడు. రేఖ వచ్చి పిలుస్తుందని అతనూ ఆశించలేదు. ఆకలి కొంచం ప్రారంభమయింది. ఇంతలో – సమయానికి పాలగ్లాసు పట్టుకువచ్చి టేబులు మీద ఉంచి వెళ్ళిపోయాడు సర్వెంట్. కోపంగా పాలగ్లాసు కాళీచేసేశాడు. రాని నిద్రకు ఆహ్వానిస్తూ మేడమీదకు వెళ్లాడు. గాజుగోడల లోంచి చందమామ, జాలిపడుతూ నవ్వుతోన్నట్లు ఫ్యాన్ స్పీడ్ పెంచి మంచంమీద వాలాడు. వెన్నెల మెల్లగా మంచం మీదకు పాకుతోంది. ఎక్కడినుంచో రేరాణి మత్తుగొలిపే పరిమళాలు – గాలి అలలలో తేలివస్తూ, అతనికి నిద్ర పట్టింది ఆలస్యంగా.

మొదటి జీతం అందుకున్నాడు. మర్నాడు నైట్ కాలేజీకి ఫీజు కట్టేశాడు. ఉదయం-గంటసేపు షార్టుహాండ్. రాత్రిఏడునుంచి తొమ్మిదన్నర వరకూ లా చదువు. ఆ విషయం శర్మకి చెప్పాలా వద్దా అన్న సందేహం కలిగింది. అడిగితే చెప్పవచ్చు ననుకుని వాయిదా వేశాడు. పుస్తకాలు కొన్నాడు. రూము నీటుగా సర్దు

కున్నాడు. ఎవరూ లేకపోడంచూసి పర్సు తెరిచి డబ్బుని చూసుకున్నాడు. ఏడువందలు మిగిలాయి. అతనికి మరీ ఆనందం కలిగేదే కాని – ఆ నోట్లలో శర్మ ముఖమే కనిపించింది. అదేదో క్యాలండర్లో సినిమా నటుడు పేదవాళ్ళకి నోట్లు పంచిపెట్టేలా శర్మ తనకు ఆ నోట్లని భిక్ష వేసినట్లనిపించింది. అంతటితో ఆనందం హరించుకుపోయింది.

ఉద్యోగంయిప్పించడంలో ఆయన సహాయంచేసి వుండవచ్చు. కాని-యిది తమ కష్టార్జితం. నెలరోజులు శ్రమపడినదానికి ప్రతిఫలం. ఇది ఆయన పెట్టిన భిక్ష ఎలా ఔతుంది అని మనసుని మభ్యపెట్టుకోబోయాడు. కాని-అంతరాత్మ ఎదురుతిరిగింది. చిక్కు ప్రశ్నలువేసి అతన్ని నిలతీసింది. అతను విధిలేక ఓటమి నంగీకరించాడు. హటాత్తుగా అతనికొక ఆలోచన వచ్చింది. సర్వెంటుని పిలిచి అడిగాడు, "శర్మగారు....మామగారు....ఉన్నారా."

"ఉన్నారుబాబూ....వారి గదిలో" అన్నాడు వినయంగా.

"సరే, నేను వస్తున్నానని చెప్పు."

ఐదునిముషాలు పోయాక వారి గదిలోకి నడిచాడు. ఆయన సీసాలమధ్య ఉన్నాడు.

"రావోయ్... రా ... ఏమిటి విశేషాలు" అంటూ ఆహ్వానించాడు.

"మీతో ఒక విషయం మాట్లాడుదామని" సందేహిస్తూ ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమిటి ? ... చెప్పు ..." ఆయన కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు.

"నేను-చిన్నవాటా చూసుకుని...." మాటలు వచ్చాయి కావు.

"వాటా! నీకు... ఈ యిల్లు నీకు యిరుకనిపిస్తూందా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అదికాదు. నేను యిక్కడ వుండడం బాగుండదు. నలుగురూ వేరుగా భావిస్తారు. అదీకాక లాచదవాలని నేను నైట్‌కాలేజీలో చేరాను. కనుక కాలేజీకి దగ్గరగా..."

"లాలో చేరడం మంచి పని చేశావోయ్. క్వాలిఫికేషను

ఉండడం చాలామంచిది. నాకు తెలుసు. నువ్వు తెలివయిన వాడివి చూడు అల్లుడూ. నీకిక్కడ ఏం ఇబ్బంది వచ్చినా నాతో ఒక్క మాటంటే నేను సరిచేస్తాను. నైట్‌కాలేజీకి వెళ్ళిపోతే రేఖ ఒంటరిగా ఉండాలి. ఆ విషయమూ ఆలోచించాలికదా? ఏమంటావు? పోనీ కాలేజీకి వెళ్ళడానికి ఆటోయో, టాక్సీయో తీసుకుంటే సరిపోదూ? మీరిద్దరూ దూరంగా వెళ్ళిపోతే ఇంత యింటిలోనూ నేనొక్కణ్ణే ఐపోతాను. ఈ వయసులో నన్ను ఒంటరివాడిని చేసెయ్యడం మీకు మాత్రం ఏం ధర్మం? అయినా యిది అన్ని సదుపాయాలూ ఉన్న యిల్లు. కావాలంటే నేనే ఎక్కడికయినా వెళ్తానుకానీ మీరు మాత్రం యిక్కడే ఉండండి."

"ఉహుం, వద్దు, మీరు వెళ్ళడమేమిటి?" కంగారుగా చూశాడు ఆనంద్. శర్మ అచ్చంగా తాగినవాడిలాగే నవ్వి - "నేను వెళ్తానంటే నువ్వెంత బాధపడ్డావో - మీరు వెళ్తామంటే నేనంతకు రెట్టింపు బాధపడతాను" అని - గ్లాసు నింపుకున్నాడు. "కొంచం సోడా తీసుకుంటావా?"

ఆనంద్ అతికష్టంమీద నిగ్రహించుకున్నాడు. ఒక్కక్షణం అతనికి- శర్మ ఎదురుగా ఆ సీసాలన్నీ తాగేసి- తెగ వాగి- తూలిపోతూ- శర్మ పీక పిసికెయ్యా లనిపించింది. ఆ మాటల పులిని మట్టుపెట్టాలనిపించింది. కాని- ఏమీ చెయ్యలేకపోయాడు. అంతలోనే వివేకం మేలుకొంది. చీమలున్నాయని యిల్లు తగలపెట్టుకోడం మూర్ఖత్వంకాక మరేమిటి?

"వొద్దు - నేను వెళతాను" అని ఆ గదినుంచి బయటకు వచ్చేశాడు. తన గదిలోకి రాబోతూంటే - తోవలో రేఖ. క్షణంపేపు దృష్టిమరల్చలేక పోయాడు. లేత నీలంరంగు నైలక్స్ చీర కట్టుకుని మ్యాచ్ అయ్యే ముదురు నీలం బ్లౌజ్‌లో, తలంటుకున్న జుత్తుతో, చాలా ప్రత్యేకమయిన అందాన్ని సంతరించుకుని తదేకంగా తనలోకి చూస్తూ...

కాలం స్తంభించి పోయింది.సర్వమూ విస్మరించాడు. అచేతనంగా నిలిచిపోయాడు. నరాలలో తీయని బాధ, హృదయంలో ఆరాటం, ఒక్కసారి — అన్నీ మరచి - ఆమెను...

మెదడు మళ్ళీ హటాత్తుగా పనిచేసింది. మనిషి — తేరు

కుని - మామూలు మనిషయ్యాడు. సౌందర్యమొక్కటే కాదు. సౌశీల్యమూ ఉండాలి. కసిగా అడుగులు వేశాడు. ఆమె తెల్లబోయింది. గదిలోకి వచ్చి తలుపులు మూసుకున్నాడు. అతనికి చాలా దుఃఖం వచ్చింది. ఆపుకుందామన్నా ఆగని కన్నీరు. మగవాడయినా తనకి శీలంపట్ల విశ్వాసం అధికం. అందుకే తనని తాను జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చాడు, ఏ ప్రలోభానికి లోను కాకుండా. కాని రేఖ? స్త్రీ అయికూడా శీలాన్ని కోల్పోయింది. పైగా అందుకామె చింతిస్తున్నట్లు కూడా లేదు; అంతేకాదు; ఆమె తనవంక ఎందుకలా చూస్తుంది? జాలిపడుతున్నట్లు? నిజానికి జాలిపడవలసింది ఆమెకాదు. తను. ఆమెమీద.. ఔను...కానిఒకటిమాత్రం నిజం.ఆమె అందం అతిఅరుదయినది.దానిప్రభావం నుంచితప్పించుకుందుకు తాను యింకా చాలా నిగ్రహం అలవరచుకోవాలి. రేఖ-నాగిని, ఆమె సౌందర్యపు పడగ ఎప్పుడో కాటు వేయకుండా అహర్నిశలూ ఆత్మరక్షణ చేసుకుంటూనే ఉండాలి. అందుకు తగిన స్థయిర్యం పెంపొందించుకోవాలి. ప్రతి మనిషీ తప్పు చెయ్యవచ్చు. కాని-తప్పు గ్రహించి పశ్చాత్తాపపడేవరకూ మళ్ళీ మనిషి కావటం జరగదు. ఈ క్షణంలో రేఖ వచ్చి - జరిగినది చెప్పి క్షమాపణ వేడితే నిశ్చయంగా ఆమెను హృదయంలోకి తీసుకోగలడు. అంతవరకూ ఆమె ఎంత అందమయినదయినా క్షమించడం తనతరంకాదు.

అటాచ్‌డ్ బాత్రూమ్‌లోకి వెళ్ళి షవర్ ఆన్‌చేసి నిలుచున్నాడు. చల్లగా ధారలు. శరీరంతోపాటు మనసుకి కూడా సౌఖ్యం. నరాలు సాంత్వన చెందుతున్నాయి. ఎందుకో నిశ్శబ్దాన్ని భరించలేక ట్రాన్సిస్టర్ ఆన్ చేశాడు. తక్కువ వాల్యూములో.... స్వప్నగొంతు. శివరంజని రాగాలాపన. అచ్చంగా తనకోసమే పాడుతున్నట్టు కన్నీరు...హృదయం తేలికయింది.

స్వప్నకి అతనితో పెళ్ళయిపోయి ఉంటుందా? బహుశా ఎందుకని శుభలేఖ పంపలేదు? ఆమె తన స్నేహానికి దూరం కాదలుచుకుందా? అసంభవం. స్వప్న తనకి బాగా తెలుసు. ఆమె చాలామంచిది. భగవాన్! స్వప్నకి సమస్యలు లేని వైవాహిక జీవితాన్ని ప్రసాదించు. గదిలో అలారం టైమ్

పీస్...శ్రావ్యంగా హెచ్చరించింది. ఇక బట్టలు వేసుకుని కాలే జీకి వెళ్ళవలసిన వేళ. ఆనంద్ త్వరగా తయారై బయటకు వచ్చాడు పుస్తకాలతో. అదృష్టం వరించినట్లు అరఫర్లాంగులోనే ఆటో దొరికింది. "వేగంగా పోనీ" అన్నాడు కూర్చుంటూ. ఇంటినుంచి వేగంగా దూరమౌతున్నానన్న భావం అతనికి హాయి నిచ్చింది. కాలేజీ చేరుకున్నాడు. మళ్ళీ అతను విద్యార్థి ఐపో యాడు అన్నీ మరచి.

రైలు కదిలేవరకే ప్రయాణీకులకు చిరాకు. అది పరి గెత్తడం ప్రారంభించాక అంతవరకూ వాళ్ళనుభవించిన చికాకు నంతటినీ మరచిపోతారు. గాడిలో పడే వరకే జీవితపు వొడిదుడు కులు. ఆనంద్ జీవితం యిప్పుడు పట్టాల మీద బండిలా సాగి పోతూంది. క్రమబద్ధమయిన దినచర్య. అతనికి అలారం చాలా సాయం చేస్తుంది. ఉదయం లేవడంలో, లేచాక అన్నీ చకచక జరిగిపోతున్నాయి. షార్టుహాండని ...ఆఫీసూ... నైట్ కాలేజీ... జీవితంలో అవే అతనికి ప్రధానమయ్యాయి. మిగిలిన విషయాల గురించి ఆలోచించడానికి కూడా వ్యవధి ఉండడంలేదు. ఇది అతనికి చాలాసుఖంగా ఉంది. క్రమబద్ధమయిన దినచర్య మనిషికి సుఖాన్నిస్తుందేమో. అతనికి రేఖ తారసపడడమేలేదు. ఆఫీసులో మాత్రం అప్పుడప్పుడూ విసుక్కెదుర్కోవలసి వస్తూంది. ఎవరోకాదు. కొలీగ్స్. "నువ్వెన్ని చెప్పుకానీ మగాడై ఉండి - చెడిపోయిన ఆడదానితో కాపురం చెయ్యడం... ఛీ...ఛీ నరకమే. అందులోనూ కడుపువరకు వెళ్ళిన వ్యవహారం."

"నిజమే, డబ్బుకోసం గడ్డి కరవలేం బొత్తిగా" నిజంగా వాళ్ళు పవిత్రతని వాంఛించడంవల్ల అంటున్న మాటలు కావవి ఊరికే-ఈర్ష్య,అసూయల కొద్ది అంటున్నారంతే. శీలంలేని స్త్రీతో. సంసారం చెయ్యలేమని సెలవిస్తున్న వాళ్ళిద్దరూ వారాని కొకసా రయినా మేండీని దర్శించుకుంటారని చాలా మందికి తెలుసు. ఆ పురుషపుంగవుల శీలంమీద చాలా మచ్చలే ఉన్నా, వాటిని వాళ్ళు చూసుకోరు. పైగా దాచుకోబోతారు. వాళ్ళకి ఆనంద్ మీద ప్రత్యేక శతృత్వానికి కారణం లేకపోలేదు. జూనియర్ అకౌంటెంట్స్‌లో వాళ్ళిద్దరూ సీనియర్లు. తమ నోటి మాట మట్టి

కొట్టి శర్మ కాస్తా ప్రమోషన్ తన అల్లుడికిచ్చేస్తాడేమోనని వాళ్ళ భయం. ప్రయివేటు కంపెనీ కనుక అపాయింట్‌మెంట్ నుంచి ప్రమోషన్ వరకూ ఏ పాలసీ ఉండదు. అధికారుల అనుగ్రహ వీక్షణం ఎవరిమీద పడితే వాళ్ళదే అదృష్టం. అల్లుడు కనుక శర్మ ఆనంద్‌ని ప్రమోట్ చేసేస్తాడని వాళ్ళకి భయమూ నమ్మకమూ. ఇలాగ – ఉండీ ఉండీ మనసులో ముళ్ళు గుచ్చుకుంటూనే ఉన్నాయి. గాయమయిన గుండెలో అవి ఎక్కువ బాధను కలిగిస్తున్నాయి. కాని భరించడం నేర్చుకున్నాడు. అప్పుడప్పు డతనికి తన జీవితంలో ఒకలోతు అతి స్పష్టంగా కనిపించి చాలా విచారం ఘుంచుకొచ్చేది. అది-నిజమయిన స్నేహితుడు లేకపోవడం. స్నేహంలో చాలా విషయాల బాధలకు నివృత్తి లభిస్తుంది. మొదటనుంచీ తనకి చక్కని స్నేహితులు కరువే. స్వప్న తప్ప తన హృదయాన్ని స్నేహంతో నింపినవాళ్ళెవరూ లేరు. స్వప్న తనకి ఎంతో దూరంగా ఉండిపోయింది ఆమె జీవితం ఎలాగ ఉందో? ఆమె సుఖపడితే బాగుండును. ఒక ఉత్తరం వ్రాస్తే? ఒకసారు మద్రాసువెళ్ళి చూసివస్తే?

అలారం కొట్టింది. టైము పదకొండు. అంటే యిక నిద్ర పోవాలి. ఆనంద్ దీపం ఆర్పివేశాడు. నిద్ర రావడం లేదు. అక్కయ్య జ్ఞాపకం వచ్చింది. పొరపాటు జరిగినట్లు బాధగా మూలిగాడు. ఆమెకు తన ఉత్తరం రాసి ఎన్నాళ్ళయింది? అసలు తనొకసారి అక్కడకు వెళ్ళి రావాలి. అక్కయ్యను చూసి రావాలి. రేఖని తీసుకురాలేదేం అని అడుగుతుంది. ఏం చెప్పాలి? ఏదో ఒకటి.... నిజంలాటి అబద్ధం. ఆమె ప్రశ్నకోసం భయపడి వెళ్ళకపోతే ఎలాగ? తనని ప్రాణప్రదంగా పెంచినఅక్కయ్య... ఆమెకు రేఖమీద అభిమానం. ఔను. రేఖ గురించి నిజం తెలిసాక, తెలిస్తే? తనకేం సలహా చెబుతుందో? తానిక్కడ ఎలాగ గడుపుతున్నాడో ఆమెకి తెలియదు. తెలియకూడదు కూడా. మరొకరితో చెప్పుకోగలిగిన సమస్య కాదు తనది. దీని కెప్పటికయినా పరిష్కారం అంటూ ఉంటే అది తనే చూడాలి. అంతే. రేఖలాటి అందాన్ని భార్యగా పొంది యీ కటిక బ్రహ్మచర్యం కనాక అతనిమీద అతనికే జాలి వేసింది. ఎంత మాత్రమూ

రానంటూంది నిద్ర. లేచి- స్నానం చేసి వచ్చాడు. చల్లబడ్డాడు. అతనికి రాత్రి స్నానం నిద్రమాత్రలా పని చేస్తూంది.

ఆ రాత్రి కలలనిండా అక్కయ్యే. ఎందుకో దుఃఖిస్తూ . దీనంగా.

మర్నాడు ఆఫీసుకి వెళ్ళి మూడురోజులు శలవు పెట్టాడు, ఆదివారం కలసి వచ్చేలా. తను ఊరికి వెళ్తున్నట్లు ఎవరికి చెప్పాలి? శర్మ యింట్లో లేడు. సాధారణంగా ఉండరు కూడా. రేఖకి చెప్పడం దేనికి? తను యింట్లోఉన్నా లేనట్లే లెక్క- ఆమె దృష్టిలో. అయినా తన ప్రయాణం గురించి తెలియపరచ వలసిన విధి తనకుందనిపించి- సర్వెంటుతో చెప్పాడు. సూట్ కేసు తీసుకుని టాక్సీలో స్టేషనుకి బయలుదేరాడు. అదృష్టం బాగుంది ఫస్ట్‌క్లాస్ టికెట్ దొరికింది. తనని హటాత్తుగా చూసి అక్కయ్యా, బావగారూ ఎంత ఆనందిస్తారు తనకీ అక్క దగ్గర బాగా గడిచిపోతుంది. వాళ్ళతో రెండు రోజులు గడిపితే మళ్ళీ తన విసుగు మాయమై కొత్త జీవం పుంజుకుంటుంది జీవితం. అయినా- యిన్నాళ్ళు- యిన్ని నెలలు వాళ్ళని చూడకుండా ఎలా ఉండగలిగాడు తను? ఆశ్చర్యమే. వెజిటబుల్‌రాఘవ్- వ్యాపారం ఎలా ఉందో?

రైలు పరుగెడుతూంది. తన పొరపాటు జ్ఞాపకం వచ్చింది. ప్రయాణపు హడావిడిలో సూట్‌కేసులో పుస్తకాలు పెట్టుకోవటం మరచిపోయాడు. కాలం గడవడం కష్టమే. ఫస్టుక్లాసులో మనుషుల్ని చూస్తూ కాలం గడపడం కుదరదు. కంపార్ట్‌మెంట్‌లో ఉండేదే కొద్దిమంది. వాళ్లూ- ఎవరిమట్టుకు వారు బిగుసుకుపోయి, ఎవరికి వారే ప్రపంచానికి తనొక్కడే గ్రేట్ అనేసుకుంటూ- పక్కవాడితో మాట్లాడితే పరువు తక్కువన్నట్లు బిగుసుకు కూర్చుంటారు సాధారణంగా. ఒకవేళ అత్యవసరమై మాట్లాడినా ముక్తసరిగా మూడుముక్కలు. కనుక ఎవరి కాలక్షేపం వారు చూసు కుండవలసిందే. అటెండరు వచ్చి భోజనం చేస్తారా అని అడిగాడు. తల ఊపి అంగీకారం తెలిపాడు. మెనూ నోట్ చేసు కుని వెళ్ళాడు. అరగంట అయ్యాక రైలు ఆగింది. స్టేషను పెద్దది లాగే ఉంది. విండో దగ్గరికి పుస్తకాల వెండరు వచ్చాడు.

న్యూస్‌పేపర్‌తో పాటు చేతికందిన మాగజైన్లూ తీసుకున్నాడు. రెండు నిముషాలయ్యాక రైలు కదిలింది. దీపాలనీ, వెలుగునీ, మనుషులనీ వదిలేసి రైలు చీకటిలోకి ఏకాంతంలోకి పరుగెడుతూంది. పెట్టెలో నీలిదీపం ఉజ్వలంగా వెలుగుతూంది. పత్రిక పుటలు తిరగవేయసాగాడు-ఒక పేజీలో-స్వప్న ప్రకటన -

ఆత్రంగా వివరాలు చదవ సాగాడు. వెలుగు చాలక పోతున్నా. స్వప్న ఆవేళ చెప్పిన వ్యక్తే. గ్రామఫోను కంపెనీ ప్రొప్రయిటరు. ఆమె ఎందుకని శుభలేఖ పంపలేదో? అతను ప్రముఖ వ్యక్తి కనుక సినిమావాళ్ళు చాలామంది వచ్చినట్లున్నారు స్వప్న వివాహానికి. స్వప్నా! నువ్వయినా సుఖపడు. నిట్టూర్చాడు ఆనంద్. ఎవరో ట్రాన్సిస్టర్ ఆన్ చేశారు. పాడుతున్నది మగవాడయినా గుండెపొరలని తాకుతూందీ కంఠం. భోజనం వచ్చింది. పూర్తి చేశాడు. తొమ్మిదికాగానే పెద్దలైటు ఆరిపోయింది. డిమ్‌గా చిన్నదీపం, పుస్తకం చదువుకుందుకు కూడా వీలు కాకుండా. కిటికీలోంచి బయటకు చూస్తే, మబ్బు పొరలు .... దీపంలా వెలుగుతున్న తారకలు, దుఃఖించిన ప్రియురాలి కన్నుల్లా ఉందాకాశం- మేఘాలతో మలినమై. చల్లగాలి కిటికీలోంచి రివ్వున వీస్తూంది. రైలు - రాతినేలమీద పరుగెత్తుతున్నట్లు కర్కశంగా ధ్వని చేస్తూంది. కుదుపు-తమాషాగా ఉంది. చిన్నప్పుడు ఊయల లూగినట్లు కళ్ళు మూతలుపడుతున్నాయి. రైలు-ఆగకుండా పరుగెడుతూ గమ్యం చేరితే ఎంత బాగుంటుంది. ఎదుటి బెర్త్‌మీద మనిషి గురకపెట్టడం ప్రారంభించకపోతే ఆనంద్‌కి త్వరగానే నిద్రపట్టేది. అతను కళ్ళు తెరిచేసరికి—ఎదురుగా అటెండరు తెల్లవారిం దనుకున్నాడు.

"కాఫీ తీసుకు రమ్మంటారా? పాట్ కాఫీయా, కప్పా?"

"కప్పు చాలు-" అని త్వరగా బ్రష్ చేసుకుని వచ్చాడు. రైల్వే కాఫీ అయినా బాగానే ఉంది, రాత్రి భోజనంలా కాకుండా. సిప్‌చేస్తూ పుస్తకాలు తిరగెయ్యసాగాడు. ఎదుటి సీటు మనిషి సిగరెట్ కాలుస్తున్నాడు. ఆ పొగ తన మీదకి వస్తూంది. కళ్ళు మూసుకున్నాడు. అయినా గుర్తించలేదు మహానుభావుడు. అతని ఆనందం అతనిది అన్నట్లు కూర్చున్నాడు. కిటికీ అవతల చక్కని

దృశ్యాలు కదిలిపోతున్నాయి. తియ్యని భ్రమ. నిజానికి కదలిక తనలో, కాని-కనిపించేది ఆ దృశ్యాలలో, నిజం తెలిసీ భ్రమలో పడడం.... ఆలోచనలకి స్వస్తిచెప్పి పుస్తకంలోని కథ చదవ సాగాడు బలవంతంగా. దురదృష్టవశాత్తూ అది - ప్రేమ కథ. చదవడానికి చాలా కష్టపడవలసి వచ్చింది. ఇందరి పళ్లు పీకాను గాని నా పన్ను నొప్పెట్టినంతగా మరెవరిపన్నూ నొప్పెట్టలేదన్నా డట వెనకటికో పళ్ళడాక్టరు తనుకూడా పన్నుపీకించుకున్నాక. ప్రేమ కథలు ఆ తరహాకే చెందుతాయి. ఎవరిప్రేమ కథ వారి మట్టుకు మహాకావ్యమే. కాని-ఎదుటివాడి ప్రేమ కథ వినడంకంటే విసుగొచ్చేది మరొకటుండదు. అటువంటిది-తనది కాని ప్రేమ కథను కాయకష్టులా పాఠకుల హృదయానికి హత్తుకునేలా చెప్పెయ్యాలని తహతహ పడిపోతూ అపార ప్రేమ సాహిత్యాన్ని విపరీతంగా సరఫరా చేసేస్తున్న యీ రచయిత లెంత అమాయ కులూ మంచివాళ్లూ! ఈ ప్రేమ రచయితలనీ, పాఠకులనూ ఏసు ప్రభువు కలకాలం కాపాడుగాక.

పన్నెండు గంటల ప్రాంతంలో తలుపు తట్టాడు ఆనంద్- అక్కయ్య- "ఎవరూ!" అంటూ వచ్చి తలుపుతీసి - ఆశ్చర్య పడిపోయింది. అతను నవ్వుతూ నిలబడ్డాడు.

"రేఖేదీ?" రిక్షావాడు సూట్‌కేసు తెస్తూంటే చూస్తూ - బద్ధకం వదుల్చుకుని అడిగింది.

"రాలేదు ... నన్ను లోపలికి రమ్మంటావా, వద్దా?" అడిగాడతను నవ్వుతూనే.

"రా- భోజనం చేశావా? బియ్యం పడేసేదా?" ఆవలించి అడిగిందామె.

"భోజనం చేసేశాను- ఎలాగూ వేళదాటుతుందని. మంచి నీళ్లుమట్టుకు యివ్వు."

అప్పుడు చూశాడు అటువైపు. నిర్ఘాంతపోయాడు. అతనికి నమ్మకం చాలలేదు.

"అక్కా!" గట్టిగా పిలుస్తూ- వంటింటిలోకి పరుగెత్తాడు. "బావగారు... బావగారు..."

ఆమె- మంచినీళ్ళ గ్లాసుతో అలాగే నిలబడి పోయింది.

కన్నులనుంచి ధారలుగా కన్నీరు.

"ఇక్కడ యింత ఘోరం జరుగుతూంటే నా కెందుకు రాయలేదు. పెళ్ళి చేసుకున్నంత మాత్రాన నేను దూరమైపోయా ననుకున్నావా ? నన్ను పైవాడిని చేసేశావా ?"

"కాదు.. కాదు... నీకు తెలిపినా నువ్వేం చెయ్యగలవు ? ఆమాటకొస్తే ఎవరు ఏమీ చెయ్యగలిగిన పరిస్థితి కాదు. అదీ కాక- కొత్త పెళ్ళికొడుకవి. చీకూచింతా లేకుండా ఆనందంగా గడపవలసిన సమయంలో నీకిదంతా తెలియజేసి మీ ఆనందాన్ని భంగపరచడం ఉచితంగా తోచలేదు."

"ఎంత పని చేశావు !" దుఃఖిస్తూ ఆమె వంక చూశాడు. ఆమె తలవంచుకుంది.

"ఉండు. డాక్టర్ని పిలుచుకు వస్తాను" అంటూ వెనుదిరిగాడు.

"ఆనంద్ !... డాక్టరు రోజూ వస్తూనే ఉన్నారు. ఇప్పుడు చాలా ఎండగా ఉంది. సాయంత్రం ఆయన ఎలాగూ వస్తారు. నువ్వెందుకు అనవసరంగా శ్రమ పడడం ?"

అతని చెయ్యి పట్టుకుని ఆపింది-" ముందు - మంచినీళ్ళు తీసుకో.

ఈ కొంచం వ్యవధిలోనే అతను యింటిని ఒకసారి చూశాడు. పరిస్థితి పూర్తిగా అవగాహన ఐపోయింది. అతను భరించలేకపోయాడు. తను- అక్కడ నెలకి వెయ్యి రూపాయల జీతగాడు. తల్లి తండ్రులలాటి అక్కా-బావలు యిక్కడ దయనీయ మయిన జీవితాన్ని గడుపుతున్నారు ! ఇంటిని చూస్తూంటేనే తెలిసిపోతోంది - రోజులు ఎంత ధైర్యంగా గడుస్తున్నాయో. అక్కడ తనకి డబ్బు ఖర్చవకుండా మిగులుతూంటే- యిక్కడ- యింట్లోని సామాన్లు కూడా అమ్ముకుంటూ.. వైద్యానికి తూగ లేకపోతూ, ఆనంద్ రెండు చేతులతోటి తలపట్టుకున్నాడు.

అక్కయ్య ఆప్యాయంగా అతని తల నిమిరి ముఖాన్ని పైకెత్తింది. "ఏమిటిది ? మరీ యింత పసితనమయితే ఎలా ? నిజంగా మే మిక్కడ ఏమీ యిబ్బందిపడడంలేదు. అందుకే నీకా విషయాలు రాయలేదు. అంతేకాని నువ్వు నాకు పైవాడి

వెందుకొౌతావ్? నిన్ను చూసకునేపిల్లలులేరన్న చింతకి దూరంగా ఉన్నాం నేనూ బావా! పద. ఆయన లేచారేమో చూసి పలక రించుదువుగాని. నిన్ను చూస్తే ఆయనెంత సంతోషిస్తారో!"

ఇద్దరూ ముందుగదిలోకి నడిచారు. అప్పటికి ఆయన కళ్లు విప్పారు. ఆనంద్‌ని చూసి ఆనందంగా నవ్వి లేవబోయారు. శారద వెళ్ళి ఆయనకు సాయంచేస్తూ మెడకింద చెయ్యివేసి-కూర్చోబెట్టింది. "ఎప్పుడొచ్చావు?" అడిగారు.

"అరగంట ఔతుందేమో! మీ వొంట్లో ఎలా ఉంది? మీరయినా రాశారు కారేం?" ఆయన నవ్వి- "ఏం రాయ మంటావ్? బాధలేని జబ్బు, నీరసంతప్ప మరేమీలేదు. ఆ నీర సాన్ని ఎప్పటి కప్పుడు పళ్ళరసంతోనో గ్లూకోజ్‌తోనో, జయి స్తూంటుంది మీ అక్కయ్య. ఆమె ఉండగా నాకేంభయం? అన్నట్లు రేఖేదీ!"

ఆనంద్ హృదయం భారంగా మూలిగింది. సరి అయిన దాంపత్యానికి ప్రతీకలా వీళ్ళు...మరి - తనూ రేఖా? ఆమెనేదో ఒకలాగ తీసుకువస్తే బాగుండేదేమో! అక్కయ్యని చూసి చాలా నేర్చుకుని మనిషి మారేది. ఉహుం. ఆమె మారదు. మార వల సిన అవసరం ఏముంది? వెనుక కావలసినంత డబ్బుంది. అవస రాలు తీరకపోవు. గతంలో చేసిన పాపాన్ని కడిగేసుకుందుకు-వంచనతో వివాహం చేసుకుంది. ఇప్పుడామె సంఘంలో గౌరవ నీయురాలు. అదీగాక వెనుక అర్థబలమూ, అంగబలమూలేని తను ఆమె దృష్టిలో అల్పుడూ, బలహీనుడూ. ఆమె తండ్రి దయా దక్షిణ్యాలమీద జీవితం గడుపుతున్న ఆశ్రితుడు. అంతకంటే ఆమెకు తనమీద చక్కని అభిప్రాయం ఉంటే తమ మధ్య ఏనాటికీ తరగ దనిపించే యీ దూరం ఎందుకు?

"ఏదో యిబ్బంది వచ్చి రాలేకపోయిందిట. ఆనంద్ మనవి చూడకుండా ఉండలేక ఆమెకోసం ఆగకుండా వచ్చేశాడు. ఈసారి తప్పకుండా తీసుకువస్తాడు" సర్ది చెప్పింది శారద. ఆయన ముఖంలో నిరుత్సాహం తొంగి చూసింది.

"ఇద్దరూ వస్తే యిల్లు కలకలలాడేది. మీ కాపురం మేమూ చూసి సంతోషించేవాళ్ళం" ఆనంద్‌కి నవ్వూ వచ్చింది, ఏడుపూ

వచ్చింది. ఈ చిన్నయింట్లో నేనూ, రేఖా యిమడలేము. ఒకరికొకరం ఎదురుపడకుండా మసలడానికి యీయిల్లు సరిపోదు. మా కాపురమూ తిరుతెన్నులూ చూస్తే మీ గుండె పగిలిపోతుంది. మే మిద్దరమూ ఏనాటికీ ఏకంకాలేని భిన్నధ్రువాలం. రేఖ రాకపోవడమే చాలా మంచిపని. అందరమూ రక్షించబడ్డాం అనుకున్నాడు ఆనంద్. ఒక్కసారి ఆ గదిని కలియజూశాడు. ఏదో వెలితి కనిపించింది.

"కొంచెంసేపు పడుకుంటావా? ప్రయాణంలో అలసిపోయి ఉంటావు."

"అలాగే. నేనొకవేళ నిద్రపోయినా నాలుగుకే లేపెయ్. మరచిపోకు." హెచ్చరించాడు అక్కయ్యని.

వేసవి అయినా ఆ గదిలో మాత్రం చల్లగా ఉంది. ఆ గది ముందు చిక్కని నీడ యిచ్చే చెట్టుంది. గది కిటికీలలోంచి ఫ్యాను కంటే చక్కగా గాలి వస్తుంది. ఆనంద్ నిద్రపోయాడు. లేచే సరికి- దిండు అంతా తడిసిపోయింది. అద్దంలో చూసుకుంటే బుగ్గలనిండా తడిఆరని కన్నీటిచారలు. కారణం- కలల నిదుర. అన్నీ పీడకలలూ_ పాడుకలలూ. అక్కయ్య చూడలేదు కదా? గబగబ తువ్వాలుతో ముఖం తుడుచుకున్నాడు. వాచీ చూస్తే పావుతక్కువ నాలుగు. లోపలికి వెళ్ళి ముఖం కడుక్కుని వచ్చి బట్టలు మార్చుకున్నాడు.

"ఇంకా ఎండ తగ్గనేలేదు. అప్పుడే ఎక్కడికి ప్రయాణం? నీ స్నేహితులు ఎక్కడికీ పోరుకానీ చల్లబడ్డాక వెళ్ళకూడదూ?" అడిగారు బావగారు.

"అలాగే బావగారూ, మిమ్మల్ని చూస్తున్న డాక్టరెవరు?"

ఆయన చెప్పి- "సాయంత్రం ఎలాగూ వస్తారు. నువ్వు ప్రత్యేకంగా వెళ్ళనక్కరలేదు" అన్నారు.

"ప్రత్యేకంగా వెళ్ళడం లేదు. ఎలాగూ బజారుకి వెళ్ళాలి. త్రోవలో ఒకసారి ఆయన్ని కలుసుకుంటాను."

డాక్టరు అప్పుడే క్లినిక్ ఓపెన్ చేస్తున్నారు. ఆనంద్‌ని చూస్తూనే ఆయన గుర్తించాడు. "రండి రండి.... ఇప్పుడు మీరేం చేస్తున్నారు? మీ బావగారు చెప్పారు హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నారని ...ఎందులో?"

నమస్కరించి ఆయన ప్రశ్నకు జవాబుచెప్పాడు ఆనంద్. విని, "మంచిది" అన్నాడు.

"నేను...." సందేహిస్తూ అన్నాడు ఆనంద్ "మా బావగారి ఆరోగ్యం విషయం కనుక్కుందామని- వచ్చాను" డాక్టరు పరిశీలనగా అతని ముఖంలోకి చూశాడు.

అతని చూపు ఆనంద్‌ని భయపెట్టింది. ఒక్క క్షణంలో కోటి భయంకరమయిన సంశయాలు పడగలెత్తాయి. అతను ఊపిరి బిగబట్టుకుని ఎదురు చూడసాగాడు.

"మీకంటే పెద్దవారెవరూ లేరూ?" కళ్ళజోడు సవరించుకుంటూ అడిగాడు డాక్టరు.

"లేరండీ. మీరేం చెప్పదలుచుకున్నా నాకు చెప్పవచ్చు" అన్నాడు ఆనంద్ ఆత్రంగా.

"మీరు చిన్నవాళ్ళు..." శాంతంగా బయటపెట్టారు. "మీ బావగారికి క్యాన్సర్"

"కాన్సరా!" విభ్రాంతుడయ్యాడు ఆనంద్. అతని ముఖం పాలిపోయింది.

"మీరు అప్‌సెట్ కాకండి. కాన్సరుకి ట్రీట్‌మెంట్ మరీ ఉపకరించదు. విచిత్రంగా మెడిసిన్‌కి లొంగకుండా ఉండిపోయింది. మరొక విషయం... క్యాన్సర్ పేషంట్ ఎంత కాలమయినా జీవించవచ్చు. అందుచేత...."

అర్థమైపోయిం దతనికి. బావగారి జీవితం గాలికి రెపరెపలాడే దీపకళిక. ఆ దీపకళిక ఎప్పు డారిపోతుందో ఎవరికీ తెలియదు.

"మరీమాట ఆయనకి చెప్పకండి. అసలు విషయం వింటే కంగారుతో భయంతో,చేతులారా పరిస్థితి పాడు చేసుకుంటారాయన. అందుకే నేను ఏమీ సీరియస్ కాదని చెప్పాను. పని చెయ్యవని తెలిసినా రోగిలో విశ్వాసమూ, ఆశా కలిగించడానికి ఏవో మందు లిస్తున్నాను. మీరూ అలాగే నటించండి. అదే మనం పేషంట్‌కి చేయగలిగే ఉపకారం. మీరు జాగ్రత్తగా నిగ్రహించుకోగలగాలి. మీ అక్కయ్యకుకూడా అసలు విషయం తెలియనీయకండి. అదే మంచిది. ఏం?"

తలఊపి, సెలవు తీసుకుని వచ్చేశాడు బయటకి. అతనికంతా విచిత్రంగా ఉంది. జీవితాన్ని భ్రమకూడా కాపాడగలదన్న మాట! సత్యంకంటే అసత్యమే బలం యివ్వగలదన్నమాట! ఎంత విచిత్రం! ఇప్పుడు తనేం చేయాలి? ఈ భయంకరమైన రహస్యాన్ని ఎవరితోనూ పంచుకోకుండా గుండెలోనే దాచుకోవాలి. తన గుండెలలో యిప్పటికే నిప్పులాటి ఒక రహస్యం. ఇది రెండవది.

నడుస్తూంటే జనరల్ అండ్ మెడికల్‌షాపు కనిపించింది. అస్సలు ఆలోచించకుండా లోపలికి అడుగుపెట్టి హార్లిక్స్, గ్లూకోజు ఏవో టానిక్కులూ తీసుకున్నాడు. రోడ్డుపక్క ద్రాక్షపళ్ళు చూసి పావుకేజీ కొనేశాడు. ఆపిల్స్ అరడజను తీసుకుని యిల్లు చేరుకున్నాడు. అప్పటికీ బావగారు మంచంమీద కూర్చుని ఏదో ఆలోచించుకుంటున్నారు. "ఇవన్నీ ఏమిటి?" ఆనంద్‌ని చూసి అడిగారు.

"మీకు నిజంగా ఏ కంప్లయింటూ లేదట. నీరసం తప్ప. అందుకే విటమిన్ టాబ్లెట్లూ, టానిక్కులూ అవీ తెచ్చాను. రోజూ ఓ ఆపిల్ పండు తినండి. మధ్యమధ్య ద్రాక్షలు. ఆతి త్వరలో మీరు మళ్ళీ చక్కగా అయిపోతారు–" ఉత్సాహం నటిస్తూ అన్నాడు.

"నిజంగా? నేను మళ్ళీ వ్యాపారం చూసుకోగలిగేపాటి శక్తి వస్తే..."

"ఎందుకు రాదు? అయినా మీరు వ్యాపారం కోసం బెంగపెట్టుకోవడం దేనికి? నేను లేనూ? మీరు అనవసరంగా హైరాణ పడకండి. విశ్రాంతిగా ఉండి చక్కగా మందులూ అవీ తీసుకోండి. గాలిమార్పు కావాలంటే నాతో హైద్రాబాద్ వచ్చేయండి" ఆయన కన్నులు చెమ్మగిల్లాయి. "ఆనంద్!" అతని రెండు చేతులు పట్టుకుని,

"నిన్ను చూస్తూ నీ మాటలు వింటూంటే నేను కోల్పోయిన ధైర్యం తిరిగివస్తోంది." అన్నారు. ఆయన ఆనంద్‌ని తండ్రి కొడుకును చూసేటట్లే చూశారు.

ధైర్యం కోల్పోవడమా! నేనుండగా"

లేదు లేదు. ఇక నాకు అంతా ధైర్యమే." హాయిగా

తేలిగ్గా నవ్వేరాయన.

ఆనంద్ ఇంట్లోకి నడిచాడు. అక్కయ్య వంట ప్రయత్నం మొదలు పెడుతున్నట్లుంది. అతన్ని చూసి "కాఫీ కావాలా?" అంటూ అడిగింది. వొద్దని వంటింట్లో పీట వాల్చుకుని కూర్చు న్నాడు. అతనికీ యింట్లో స్వేచ్ఛగానూ, హాయిగానూ ఉంది. జైలునుంచి బయటపడినవాడిలో, ఊరు వెళ్ళి తిరిగి యింటికి వచ్చిన చిన్నపిల్లవాడిలా అతనికి చెప్పలేనంత ఆనందంగా ఉంది. అక్కయ్య వంట చేస్తూంటే వంటింట్లో పీట వేసుకు కూర్చుని ఎన్నాళ్ళయిపోయింది.

"ఆనంద్!" హటాత్తుగా పిలిచిందక్కయ్య. ఆ రహస్యం అడుగుతున్నట్లు ఆమె మెల్లిగా అడిగింది. "ఒక విషయం... అడగకూడదనుకో...కాని .. ఆత్రుత ఆపుకోలేక .... అడగాలని పిస్తూంది. నిజం చెబుతావా?"

అతని మనసు ప్రమాదం శంకించింది. బావగారి గురించి ఆమె అడిగితే ఏంచెప్పాలి? అతను వణికిపోయాడు. తల వంచు కుని "అడుగు." అన్నాడు విధిలేక.

"రేఖా, నువ్వూ ఎలాగ ఉంటున్నారు?"

తెల్లబోయాడు. ఆమె ప్రశ్న అర్థంకానట్లు అయోమయంగా చూశాడు. "అంటే!"

"అదే. మీరిద్దరూ ఒకరితో ఒకరు అన్యోన్యంగా ఉంటు న్నారా అని?"

మెదడు ఉపయోగించాడు. తప్పించుకుందుకు దారి స్ఫురించింది. ఒక్కసారి తేలిగ్గా నవ్వేస్తూ- "అసలు నీకా అను మానం ఎందుకు వచ్చింది?"

ప్రశ్నలు వేయడం తేలిక. సమాధానాలు చెప్పడం తేలిక కాదు. ఈసారామె ఆలోచనలో పడవలసి వచ్చింది. అవకాశాన్ని వినియోగించుకుంటూ అతను లేచి "నేనలా వెళ్ళొ స్తాను. త్వరగానే వచ్చేస్తానులే" అని రోడ్డుమీదకు వచ్చేశాడు. అప్పటి కతనిగుండె వేగం తగ్గి స్వస్థత చిక్కింది. ఊపిరి పీల్చు కున్నాడు. బజారు వేపు నడవసాగాడు.

వెజిటబుల్ రాఘవ... షాపు పెద్దది చేసినట్లున్నాడు. రక

రకాల కూరగాయలతో కలకల లాడుతూంది షాపు. అతను కుర్చీలో కూర్చుని డబ్బు లెక్క పెట్టుకుంటున్నాడు.

"రాఘవా..." పిలుపు విని – ఆనంద్‌ని చూసి-ఆనందంగా ఆహ్వానించాడు.

"రా....రా ఏమిటి విశేషాలు? ఎప్పుడు రావడం?" బల్ల వేశాడు కూర్చుందుకు.

"బిజినెస్ బాగుంటూందా?"

"ఫైన్...ఒరేయ్ బాలూ....వెళ్ళి రెండు బ్రూ తీసుకురా." అని–ఆనంద్ వేపు తిరిగి – "ఉద్యోగాల్లో గౌరవం ఉంటే ఉండవచ్చుకానీ-నిజమయిన సుఖమూ, డబ్బూ వ్యాపారంలోనే ఉంటాయంటే... "

"నేను కాదనను. పూర్తిగా అంగీకరిస్తాను. ఎటొచ్చీ బిజినెస్‌కి కొంచెం మెదడూ, ఎక్కువ ధైర్యమూ అవసరం. .." అని నవ్వాడు ఆనంద్.

"నీ పెళ్ళికి రాలేకపోయాను. మరేమీ అనుకోలేదు కదా?"

"ఫర్లేదు. అన్నట్లు చెప్పడం మరచాను...త్వరలో దీనికి అటాచ్‌డ్ బియ్యం దుకాణంకూడా పెడదా మనుకుంటున్నాను."

"గుడ్‌లక్" కాఫీలు వచ్చాయి. తాగుతూ కూర్చున్నారు. ఆనంద్‌కి అక్కయ్య వంటిల్లు గుర్తువచ్చింది. దానితోపాటు కాళీగా కూరల పజ్జ. ఐదురూపాయల నోటుతీసి–"నాలుగు రకాలు కూరలూ బుట్టలో వేయించు" అన్నాడు.

"సంసారివి కదూ?" నవ్వి— "మీ యింటికి వస్తాను— షాపు కట్టేశాక. మీ శ్రీమతిని చూసి...."

"ఆమెను తీసుకు రావడానికి కుదరలేదు–" సిగ్గుపడుతున్నట్లన్నాడు.

"అప్పుడే హడావిడా?" బొజ్జ ఊగేలా నవ్వాడు రాఘవ.

"ఛఛ అదేమీ కాదు. కుదరలేదంటే—"

"నువ్వు పొరపాటు చేశావు. పెళ్ళయిన కొత్తలోనే ఏం ఆనందమయినా. కొత్తలో ఒకరినొకరు విడిచి ఉండడం.... ప్చ్..."

పుండుమీద కారం జల్లినట్లయింది ఆనంద్‌కి. రేఖమీద కోపం వచ్చింది.

"త్వరగా కూరగాయలిస్తే...." అంటూ లేచి నిల్చు న్నాడు.

"డబ్బు నీదగ్గర తీసుకోను." అని – కుర్రాడికి కూర గాయల పని అప్పగించాడు.

"వీడు అన్నీ సిద్ధం చేస్తాడు. నువ్వు రిక్షాని పిలుచు కురా...."

ఆనంద్ రిక్షాని పిలిచి కూరగాయలబుట్ట దానిలో పెట్టించి–బయలుదేరాడు. అతనికి చిన్న నిజం తెలిసివచ్చి నట్లనిపించింది ! వివాహంతో మనవాడు కూడా–తెలిసినవారి మధ్య ఒక ముద్ర వేసు కుంటాడు. వివాహపూర్వమున్న వ్యక్తిత్వం కొంత అదనపు తనాన్ని చేర్చుకుంటుంది. ఈ దేశంలో భార్యాభర్తలను ఒకే వ్యక్తిత్వంగా పరిగణించే అలవాటు ఎక్కువ.

గేటు దగ్గర ఆగింది రిక్షా. కూరగాయల బుట్టతో లోపలికి ప్రవేశిస్తున్న తమ్ముణ్ణి చూసి ఒక్కసారి ఆశ్చర్యపడి–అంతలోనే ఆనందంగా నవ్వింది అక్కయ్య. గది నిండా నవ్వు.

"ఏమయింది ?" అడిగారు బావగారు- అర్థంగాక.

"ఆనంద్ .. ఎంత మారాడు ! నిజంగా నేనెప్పుడూ అను కోలేదు. వీడికి బజారుకు వెళ్ళడం–కూరగాయలు తేవడం తెలి శాయి ! పక్కా సంసారి ఐపోయాడు !–" తల్లి తన బిడ్డకి అడు గులు వేయడం వస్తూంటే ఎంత మెచ్చుకోలుగా చూస్తుందో, అలాగ ఆనంద్ వైపు చూస్తూ.

తను–సంసారి .... నవ్వొచ్చింది ఆనంద్‌కి.

"కూరగాయల బుట్ట తెస్తున్నందుకే యింత మురిసి పోతు న్నావ్, రేపు మీ తమ్ముడు ఏ పాపనో, బాబునో ఎత్తుకుని ఆడి స్తూంటే...."

త్రుళ్ళి పడ్డాడు ఆనంద్. అతనికి సంతోషమూ దుఃఖమూ కూడా కలిగాయి. తనకి పాపో, బాబో !? సాధ్యమా ? రేఖా.... తనూ యిలా శత్రువుల్లా బతుకుతూంటే.

"అరె ! అన్నీ మంచిమంచి కూరలే ! ఈ వంకాయి లెంత లేతగా ఉన్నాయి !—"

"కారం పెట్టి వండు. నువ్వు బాగా చేస్తావు "అన్నాడు

ఆనంద్.

"ఇంకా నా వంట రుచి జ్ఞాపకం ఉన్నట్లు! రేఖ నా కంటే చక్కగా వండదూ!"

"వండడం మాట అటుంచు, తినడం సంగతంటావా...."

"ఔను. రేఖా వాళ్ళు కుక్కని పెట్టుకున్నారుగా!...చూడు తమ్ముడూ.... నీకా వంట నచ్చకపోతే రేఖనే వండమని చెప్పు. ఈసారి ఆమెను తీసుకొచ్చి ఓ వారం నా దగ్గర ఉంచావో- ప్రవీణురాలినిచేసి పంపుతాను-"

"ముందు కూర చెయ్యక్కా.... నాకు చాలా ఆకలిగా ఉంది-"

కాలం ఎప్పుడూ ఒకే వేగంతోనే నడిచినా - ఆనందంగా గడిచేటప్పుడు శరవేగంతో పయనిస్తున్నట్లు, విషాదం ఆవరించి నప్పుడు అదే కాలం నత్తనడకలు నడుస్తున్నట్లు అనిపించడం మానవసహజం. కాలంలో. అదో తమాషాకూడా.

ఆనంద్‌కి తిరుగు ప్రయాణపు సమయం దగ్గర పడింది. ఇక సాయంత్రం రైలుకి బయలుదేరకపోతే మర్నాటికి హైదరా బాదు వెళ్ళలేడు. ఆఫీసు కందుకోలేడు. ప్రయాణ మౌతూంటే అక్కయ్య అంది- "నువ్వున్న యీ రెండురోజులూ మీ బావ ఆరోగ్యం కుదుటబడింది. ఉత్సాహంగా ఉన్నారు. నాకూ అంతే. నువ్వెళ్ళిపోతున్నావు..."

కన్నీరు ఎలా ఆపుకున్నాడో అతనికే తెలియదు. అక్కయ్యతోపాటు బావగారుకూడా గేటువరకూ వచ్చి, వీడ్కోలు చెప్పారు. రిక్షా కదులుతూంటే అతను తననితానే హెచ్చరించు కున్నాడు. మొదటిది నెలకొకసారయినా వీళ్ళనిచూసి వెళ్తూండడం, రెండవది-నెలనెలా కనీసం రెండువందలు బావగారికి పంపడమూ ఈ రెండూ మరచి పోకూడదు. అవి తన ముఖ్య కర్తవ్యాలు. రిక్షా మలుపు తిరిగింది. వాళ్ళిద్దరూ దృష్టికి దూర మయ్యారు. స్టేషనుకి వచ్చేసరికి రైలు అరగంట లేటని తెలిసింది. వెయి టింగ్ రూములో కూర్చున్నాడు. అరగంటని గంటగా చేసి రైలు వచ్చింది. మర్నాడు ఎనిమిది గంటల ప్రాంతంలో అతను యిల్లు చేరాడు. కనీసం అప్పుడయినా రేఖ ఎదురవుతుందనీ, ఏదో ప్రశ్న

వేస్తుందనీ ఆశించినా అతనికి ఆశాభంగమే అయింది. స్నానమూ బ్రేక్ ఫాస్టూ కానిచ్చి ఆఫీసుకి వెళ్ళిపోయాడు! ఆశ్చర్యకరంగా తనకోసం ఒక ఉత్తరం ఎదురుచూస్తోంది. ఆత్రంగా తెరిచాడు. స్వప్న!.... స్వప్న వ్రాసింది.

"ఆనంద్!.... నువ్వు క్షేమంఅని తలుస్తాను. నాకు పెళ్ళయిన వార్త నీ కీపాటికి తెలిసే ఉంటుంది. శుభలేఖ పంపలేకపోయాను. క్షమించు. ఒక కారణం-పెళ్ళి చాలా హడావిడిగా నిర్ణయించబడటం. మిగిలినవి అనేకం. నువ్వెప్పుడయినా మద్రాసు వస్తే నన్ను కలుసుకుందుకు ప్రయత్నించు. మావారు నీ కిదివరకు చెప్పినవారే. ఫీల్డు అంతా రాజకీయాలమయం. ఇక్కడ మనిషికీ, కళకీ విలువలేదు. వంచనకే పైచెయ్యి.దానికే అందరూ దాసోహం. ఆ రంగంలో నేను ఓడిపోయాను. అసమర్థురాలినై అందుకే-చాలా తెలిసికూడా యీ పెళ్ళి అంగీకరించక తప్పలేదు. ఏం చేసేది! ఆడదాన్ని, అయినా-జీవితం మనిషి ఆధీనంలోఉండదు-నాలాటి దురదృష్టవంతురాలికి. జీవితం చెప్పినట్లు నడుచుకోవలసిందే.

నువ్వేలాగ ఉన్నావు? నీ శుభలేఖ అందింది. గ్రీటింగ్స్ పంపాను -.నేను రాలేక.

మద్రాసునుంచి తిరుపతి - పెద్ద దూరమేమీ కాదు. కాని - ఏవో పనులుండి నువ్వు సంతోషంగా ఉన్నావని ఆశిస్తాను. ఈ ఉత్తరానికి జవాబు రాయి. దీనితో నా యింటి ఎడ్రస్ యిస్తున్నాను. నువ్వెప్పుడు మద్రాసు వచ్చినా తప్పకుండా మా యింటికి రా. ఇక ఉంటాను. అన్నట్లు.. నీ కిష్టమయిన శివరంజని - ప్రైవేట్ రికార్డుగా త్వరలో వెలువడుతూంది. రికార్డు-విని-రాయి. ఏం?"

"ఎప్పుడు రావడం?" కొలీగ్ ప్రశ్న.

"ఇవాళే.. పొద్దున్న.."

"మన మెంబరొకతనికి ట్రాన్స్ఫరౌతూంది. కనుక సాయంత్రం చిన్న కార్యక్రమం. మీరు తప్పక రావాలి...."

"నా విషయం మీకు తెలుసు. నేను వస్తే మీ ఉత్సాహమూ చెడుతుందేమో?"

"హైదరాబాద్ వచ్చి ఆరు నెలలు.. ఐనా మీరింకా మార లేదు। ఇది చాలా దారుణం. ఆంధ్రుల రాజధానికే అవమానం. మీరు తాగడం మొదలు పెట్టాలి. కనీసం పార్టీలలో అయినా..."

"క్షమించాలి. నిజంగా నా కది నచ్చదు. ఎందుకో మొదటి నుంచీ .."

"సర్లెండి. మీరు మాత్రం మాతో రావాలి. జూనియర్ అకౌంటెంట్లకే పరిమితం యీ పార్టీ. మందుని మించిన అంశం మరొకటుంది. చూడండి ... మీరు మరీ యిలా మడికట్టేసుకుని కూర్చుంటే జీవితం ఎంజాయ్ చేయలేరు-"

వీళ్ళమాటలు సాగుతుండగానే వెనకనుంచి సన్నగా విని పించిందొక కామెంట్.

"పట్టి పోజు. నిజంగా పతివ్రత అనుకున్నావా ? అలా అయితే ఆ కన్యామాత నెందుకు కట్టుకుంటాడు ? నా అనుమానం రాత్రిళ్ళు మామా అల్లుడూ కలిసి చీర్స్ చెప్పేసుకుంటున్నారనే."

ఆ మాటలు ఆనంద్‌కి వినిపించనే వినిపించాయి. అతనికి చాలా కోపమూ,కొంచం దుఃఖమూ వచ్చాయి. "దయచేసి నన్ను యిబ్బంది పెట్టకండి. నిజంగా నేను రాలేను. రాను"—

వీళ్లతనని మొదటినుంచీవెలివేస్తూనేఉన్నారు. అసూయతో తను జవాబు చెప్పకపోవడం అలుసుగా తీసుకుని ఏవేవోకూతలు కూస్తున్నారు. తను వీళ్ళతో ఎందుకు చేరాలి? ఐనా—హాట్‌డ్రింక్స్ తాగితేగాని పార్టీ అనపించుకోదా ? తాగుడులో ఏం సుఖముందో? వాళ్లు తెలియనితనంలో సుఖమేమిటి శవంలాగ !

సీటుకివెళ్ళి పనిచేసుకోవడం ప్రారంభించాడు. అతని కని పించింది—తనకి ట్రాన్స్ఫరు వస్తే బాగుంటుంది. కానీ, చదువో? మధ్యలో ఆగిపోతుంది. ఈ చదువయిపోయాక ... శర్మగారు పిలుస్తున్నారంటే వెళ్ళాడు ... ఆయన గదిలోకి. తనను చూసి పలకరింపుగా నవ్వారు. "మీ అక్కయ్యా, బావగారూ కులాసాగా ఉన్నారా ?"

"ఊఁ" అయిష్టంగా. ఈ వ్యక్తిగత విషయా లడగటానికి ఆఫీసుతప్ప మరో చోటులేదూ ?

ప్రయాణం సుఖంగా జరిగిందా ! రేఖ హనుమకొండ

వెళ్ళింది. సాయంత్రానికి వచ్చేస్తుంది."

అలాగే అన్నట్లు తల ఊపాడు. అతని కా గదినుంచి ఎంత త్వరగా బయటపడదామా అని ఉంది- పులి గుహలో మేక బాధపడుతున్నట్లు.

"కావాలంటే యింటికి వెళ్ళి విశ్రాంతి తీసుకో. అర్జంటు పని మాత్రం ఏముంది?"

"అవసరం అనిపించడంలేదు. రాత్రి రైల్లో సుఖంగానే నిద్ర పట్టింది." అని ఆ గదినుంచి బయటపడి సీటులోకి వచ్చి కూర్చున్నాడు. రేఖ హనుమకొండ దేనికి వెళ్లినట్లు! అక్కడ బంధువు లున్నట్లు తనకి తెలియదు.

మళ్ళీ మామూలు దినచర్యే. సాయంత్రం కాలేజీ.... ఉదయం షార్ట్‌హాండూ, ఆఫీసూ తీరికయితే లా పుస్తకాలు తిర గెయ్యడమూ. రోజులు గడిచిపోతున్నాయి నిస్సారంగా- నిన్నటికీ నేటికీ, నేటికీ రేపటికీ వ్యత్యాసం తోచనంత సామాన్యంగా.

నెలనెలా రెండువందలు బావగారికి పంపుతున్నాడు అదే అతనికి చాలా తృప్తినిచ్చే విషయం. ఒకటికి రెండుసార్లు వాళ్ళని చూసివచ్చాడు. అతనికి-వాళ్లిద్దరినీ హైదరాబాదు తీసుకువచ్చి తనతో ఉంచుకోవాలనిపించింది. కాని ఎలాగ, దానివల్ల చాలా సమస్య లుత్పన్నమౌతాయి. ఈయింట్లో తనేఅతిథి. కనుకతనువాళ్ళని తెచ్చి యిక్కడ ఉంచడంవాళ్ళకీ, తనకీకూడా ఎబ్బెట్టుగా ఉంటుంది. పోనీ-మొండిగాతను వేరేయిల్లు చూస్తే ... అక్కయ్యనీ, బావ గారినీ రప్పించుకోవచ్చు. కాని-రేఖ? ఇప్పటిలాగ ఎవరి జీవితం వారుజీవించడం సాధ్యంకాదు అక్కయ్య ముందు తనరహస్యం కాపాడబడదు. రేఖని శర్మగారి దగ్గరే ఉంచి- తను వేరే యింట్లో ఉంటే- మొదట అక్కయ్య అంగీకరించదు. తరువాత అందరికీ అనుమానం వచ్చి తీరుతుంది. ఆ పరిస్థితి ఏమీ బాగుండదు. ఎంత ఆలోచించినా తన సమస్యకు పరిష్కారం తోచలేదు. జీవితంలో తొలిసారిగా అనిపించింది-డబ్బు యివ్వలేని సుఖాలు కూడా చాలానే ఉన్నాయి. సంపద_నిశ్చయంగా సర్వసమస్యా పరి

షాకారమార్గం కాదు. తరువాత సుఖమనేది మనిషి ఒక్కడిమీదే ఆధారపడిఉండదు. అతనిచుట్టూఉన్న వ్యక్తులూ, వాతావరణమూ సహకరిస్తేనే మనిషి సుఖపడగలడు. అతనికి జ్ఞానోదయ మైనట్ల యింది. దానితో తానుచేసిన పొరపాటు భూతద్దాలలోంచి కనపడ సాగింది. ఉద్యోగంకోసం-వ్యక్తిత్వాన్ని,ఆత్మవిశ్వాసాన్ని పోగొట్టు కున్నాడేమో తను? ఇవి తిరిగి తనకి మిగులుతాయా? అయిన ఆవేళ తనకేమయింది? కొంచమయినా ప్రతిఘటించకుండా శర్మ గారి మాటలకు గంగిరెద్దులా తల ఊపాడేం? తను బలహీనుడా లేక ఆయన మాటలలో ఆకర్షణ అంత శక్తివంతమయినదా ఇప్పటికీ-శర్మగారి పరోక్షంలో మనసులో అనుకునే అనే మాటలు ఆయన ముందు అలాగ అనలేకపోతాడెందుకని?లోపం ఎక్కడుంది?

అసలు సుఖమనేది బ్రతుకులోనే ఉందేమో! అందు నేమో చాలామంది తాగేది. మద్యం మనిషిని తాత్కాలికంగా తనవితాను మరపింప జేస్తుందట. కలలలో తేలియాడిస్తుందట వాస్తవంనుంచి పారిపోవడంలో ఆనందం లభిస్తుందేమో! లే పోతే ఎందుకందరు తాగుతారు?

మూర్తి తనకి స్నేహితుడు కాకపోతే ...సరిగ్గా సమయ నికతడు తారసిల్లి ఆ చేదు నిజంచెప్పి ఉండకపోతే - తన జీవితం ఎలాగ వుండేది? రేఖా తనూ ఎలాగ ఉంటూండేవారు?

అతని మెదడులో దృశ్యాలు మెదల సాగాయి.-సినిమాల డ్రీమ్ సీక్వెన్సుల్లా.

చక్కని సాయంత్రం-రేఖ అందంగా తయారై తన కోసం ఎదురు చూస్తూంది. ఆమె అందమయిన కన్నులలో మధురమయిన ఆరాధన. తనని చూడగానే చక్కని భావస్ఫోర మయిన మందహాసం. ఆ పెదవి వొంపులో ఎన్ని స్వర్గాలు ఆపుకోలేని తమకంతో-ఆమెను దగ్గరగా తీసుకుని స్వర్గద్వారా వంటి కనబొమలను అంటీఅంటకుండా పెదవులతో ఆ కరిగిపోతూంది, తన కౌగిటిలో. దివ్యమయిన అనుభూతి. జీవిత తాలూకు అమూల్యమయిన వరం అదే అన్నట్లు చక్కని అ భూతి. హృదయం ఎక్కడో తేలిపోతూంది.. అతనికి స్పృ

వచ్చింది. ఊహే యింత తీయగా ఉంటే - వాస్తవం మరెంత చిత్రంగా ఉంటుందో? కాని-ఆ కల-ఏనాటికి నిజమౌతుంది? ఏలాగ? ఈ ఎడారి బ్రతుకింకా ఎన్నాళ్ళు? ఈ విసుగొచ్చే ఒంటరిపాటుకు ముగింపు ఎప్పుడు? ఎలాగ? రేఖా, తను ఒకటి కాగలరా?

కాలచక్రం యధావిధిగా సాగిపోతూంది. ఆనంద్ లా డిగ్రీ కూడా తెచ్చుకున్నాడు. కంపెనీ సెక్రటరీ-పోస్టల్ కోర్స్ పూర్తి చేశాడు. అప్పుడే ఒక ప్రయివేట్ కంపెనీ పేపర్లో ప్రకటించిన పోస్టుకి దరఖాస్తు పంపాడు. ఆ ఉద్యోగానికి అవసరమని ప్రకటించిన దానికంటే ఎక్కువ అర్హతలే ఉన్నా యతనికి. పైగా- కొంత ఉద్యోగానుభవమూ ఉంది. కనుక ఆ పోస్టు రావచ్చుననే ఆశించా డతను.

పది - పదిహేనురోజుల్లో కంపెనీనుంచి పిలుపు వచ్చింది- ఇంటర్వ్యూకి హాజరు అవమని. మద్రాసు అనగానే స్వప్నే జ్ఞాపకం వచ్చింది. ఆమె అడ్రసు జాగ్రత్తగా సూట్కేసులో పెట్టాడు. వెళ్తూన్నప్పుడు మద్రాసు వెళ్తున్నాననే చెప్పాడు కాని ఉద్యోగ ప్రయత్నం అని చెప్పలేదు శర్మకి - "రేఖనికూడా తీసుకు వెళ్ళరాదూ? మీరెలాగా హనీమూన్కి వెళ్ళలేదింతవరకూ. అలా మైసూరూ, బెంగుళూరూ తిరిగిరండి సరదాగా" అన్నాడు శర్మ.

"ఇప్పుడు కుదరదు" అనేశాడు ఆనంద్. శర్మ మళ్ళీ అడగలేదు. ఆనంద్ సూట్కేసు సర్దుకున్నాడు. సాయంత్రమే ప్రయాణం. అతనికి చాలా ఉత్సాహంగా ఉంది.

స్వప్న ఉండే నివాసానికి దగ్గరగా - లజ్లో రూము తీసుకున్నాడు. మర్నాడు ఉదయం పదిగంటలకు ఇంటర్వ్యూ. సాయంత్రం స్వప్న యింటికి వెళ్ళవచ్చు ననుకుంటూ నిద్ర పోయాడు.

మర్నాడు పదిగంటలకు కంపెనీ ఆఫీసులో ఉన్నాడు. అరగంటలో ఇంటర్వ్యూ పూర్తయిపోయింది. పిలిచిందే ఐదుగురిని. ఎక్కువ ఛాదస్తాలు పెట్టుకోకుండా మనిషి తెలివితేటలను బయటపెట్టే ప్రశ్నలువేసి త్వరగా తెమిల్చేశారు ఇంటర్వ్యూ.

ఆనంద్ రెండవవాడు కావడంతో పదిన్నరకే బయటపడ్డాడు. మౌంట్‌రోడ్‌లో ఆఫీసు. అక్కడనుంచి మెల్లగా నడుస్తూ - మద్రాసు మహానగరానికి జీవనాడి అనదగిన మౌంట్‌రోడ్డుని సందర్శిస్తూ - చివరికొక భోజన హోటల్లోకి ప్రవేశించాడు. మద్రాసు భోజనం బాగుంది. కాని - ఆ భాష.... కొంచం కంగారు పుట్టించింది. సఫైర్‌లో ఇంగ్లీషు సినిమాచూసి ఐదు గంటలకి ముందే రూము చేరుకున్నాడు. టెలిఫోను డైరెక్టరీలో స్వప్న ఫోను నంబరుకోసం చూశాడు. కనిపించలేదు. జ్ఞాపకం వచ్చింది. ఫోను స్వప్న భర్తపేరున ఉండవచ్చుననిపించి ఆ పేరుకోసం వెదికాడు. దొరికింది. డయల్ చేశాడు. అదృష్టవశాత్తూ కరక్టయింది. స్వప్న ఇంట్లో లేదని స్టూడియోలో ఉందని చెప్పారు. స్టూడియోకు ఫోనుచేశాను

స్వప్న ఉందనీ - లైనుమీద నిరీక్షించమనీ చెప్పారు. రెండు నిముషాలకి ఆమె దొరికింది.

"నేను - ఆనంద్‌ని స్వప్నా!"

"ఆనంద్! ఎప్పుడొచ్చావు? ఎక్కడున్నావు?"

"నిన్ననే, లజ్‌లో ఉన్నాను. మీ యింటికి ఫోనుచేశాను నువ్వు స్టూడియోలో ఉన్నావంటే...."

"ఇప్పుడు నీకు పనేమన్నా ఉందా?"

"నిన్ను కలుసుకోడం - "

"వెంటనే బయలుదేరి వచ్చావంటే - యిక్కడ మనం చాలాసేపు కూర్చోవచ్చు."

"బయలుదేరుతున్నాను-" రిసీవర్ క్రెడిల్‌లో ఉంచి - టాక్సీ వేసుకుని స్టూడియో చేరుకున్నాడు. స్వప్న చెప్పిఉంచింది కాబోలు - గూర్ఖా పేరడిగి చెప్పగానే స్వప్న ఉండే రికార్డింగ్ రూమ్ చూపించాడు ఆనంద్‌కి.

"స్వప్నా!" ఆనందంగా చూశాడు. ఆమె ముఖం వికసించింది ఒక్కసారి. "ఆనంద్!" ఒక నిముషం యిద్దరికీ మాటలు ఊడిపడలేదు.

"నువ్వు మద్రాసు వచ్చావు! ఆఫీసు పనిమీదా?"

"కాదు-ఉద్యోగ ప్రయత్నం-"

"ఉద్యోగం చేస్తూనే ఉన్నావుగా :"

"అదంతా ఓ కథ. నువ్వు సుఖంగా ఉన్నావా ?"

"ఏదోలే. పద. క్యాంటీన్‌లో కాఫీతాగి అలాతిరిగివద్దాం. హటాత్తుగా అడిగింది- "మీ శ్రీమతిని తీసుకురాలేదూ ?"

"లేదు." అతని జవాబువిని సూటిగా కన్నుల్లోకి చూసింది స్వప్న. ఒక్కసారి ఆమె మూడ్ మారిపోయింది. "ఆనంద్! నిజం చెప్పు. నీ గుండెల్లో గూడు కట్టుకున్న విషాదానికి కారణం- వివాహమేనా?"

"నీకు ఎలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు.

ఆమె ఏదో చెప్పబోతూంటే- బోయ్ పరుగెత్తుకొచ్చాడు. స్వప్నని ఉద్దేశించి- "పాట వొచ్చేసింది. మిమ్మల్ని రమ్మంటున్నారు" అన్నాడు అరవయాసలో.

"పద, రికార్డింగు త్వరగానే ఐపోతుంది. కాగానే యింటికి వెళ్దాం-"

స్టూడియో కారులో యిద్దరూ స్వప్నయింటికి చేరుకున్నారు.

"మీ శ్రీవారేరీ ?" అడిగాడు.

"బిజినెస్ టూరు-" చెప్పి- "స్నానము చేద్దువుగాని పద" అంది బాత్‌రూమ్‌చూపుతూ. పది నిముషాలలో యిద్దరూ తాజాఅయి బాల్కనీలోకి వచ్చారు. నౌకరు కూల్‌డ్రింక్సు తెచ్చాడు. స్వప్నకి మాత్రం టీ.

"నా జీవితం అంతా కంఠంమీద ఆధారపడి ఉంటుంది. కూల్‌డ్రింక్సు త్రాగితే గొంతు మారిపోతుంది. బొంగురుపోతుంది. అందుచేత యాలకుల టీయో, మిరియాల టీయో రుచి చూస్తావా ?"

"వద్దులే."

"ఊఁ.... చెప్పు ... నీకు వచ్చిన లోటేమిటి? నువ్వెందుకు సుఖంగా ఉండలేకపోతున్నావు?"

"నా సంగతికేం, నీ విషయం చెప్పు. ఇంత చక్కని యిల్లు... ఐశ్వర్యం పేరు ... అన్నీ ఉన్నా నువ్వెందుకు హాయిగా ఉండలేకపోతున్నావు ?"

"ఇవన్నీ నీకు ఉన్నాయిగా ? చక్కని ఉద్యోగం చేస్తు

న్నావు. అందమయిన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నావు. ఇంకా నీకు సమస్యేమిటి?" ఎదురుప్రశ్న వేసింది.

"సుఖం అన్నది వీటిలో లేదేమో!"

"మరెక్కడుంది?"

"అదే తెలుసుకోవాలి."

"నేను చెప్పేదా?"

"చెప్పు."

"అది-మనిషి మనసులో ఉంటుంది. భావనలో ఉంటుంది"

"తెలిసే నువ్వెందుకు సుఖపడలేక పోతున్నావు?"

"మనిషి - కోరికల పుట్ట. కొన్ని కోరికలు చాలా గాఢంగా ఉంటాయి. అవి తీరకపోతే జీవితం అంతా అసంతృప్తిగానే మిగిలిపోతుంది."

"ఇపుడు - నీ తీరనికోరి కేమిటి?"

స్వప్న నవ్వింది - భారంగా, విషాదంగా. "అది ఏనాటికీ తీరదు."

"ఏమిటది?"

"కన్యగా వున్నపుడు నే నెన్నో కలలు కనలేదు. ఒక్కటే. అది కూడా కలలాగ నిరాధారమయినదీ, అసంగత మయినదీ కానే కాదు. న్యాయబద్ధమయినదీ, సహజమయినది. కాని - అదీ తీర లేదు. కోరుకున్నవి మినహా మిగిలిన వెన్నో లభించాయి."

"ఏమిటది?"

"పవిత్రుడయిన మగవాణ్ని భర్తగా పొందాలని-"

ఉలిక్కిపడ్డాడు ఆనంద్. స్వప్న యీ చిన్న కోరిక కూడా తీరలేదూ? అంటే.. అతను...?

ఏమిటీ సారూప్యం? ఆమె జీవితానికీ, తన జీవితానికీ ఏమిటీ పోలికలు?

అటు రేఖ... యిటు రఘుపతి...

"ఐతే మీ శ్రీవారు రఘుపతి...." ఏమని అడగాలో తెలియలేదతనికి.

జాలిగా అంది స్వప్న. "ఔను, మొదట నాకు అనుమానం కలగక పోలేదు. కాని-వ్యాపారంలో తిరిగేమనిషి కనుక....అందు

లోనూ సంగీతపరమయిన బిజినెస్ కనుక-ఆ కోణంలో స్త్రీలతో పరిచయాలేమో అనుకున్నాను. అదీకాక ప్రకృతి – మగవాడికి వర మిచ్చింది. అతనెన్ని తప్పులుచేసినా ముద్ర పడదు-"

"స్వప్నా!" జాలిగా చూశాడు.

జాబిల్లి దీనంగా కనిపిస్తున్నాడు మబ్బుపొరల ముసుగు లోంచి. వెన్నెల గుడ్డిగా ఉంది.

సముద్రం మీదుగా గాలి చల్లగా వస్తూంది. అంతా ప్రశాంతంగా ఉంది.

నౌకరు వచ్చి భోజనాలు సిద్ధంగా ఉన్నాయని చెప్పి వెళ్ళాడు,

"పద భోజనాలు కానిచ్చి, వచ్చి మాట్లాడుకుందాం."

ఆనంద్‌కి చాలా జాలివేస్తూంది. స్వప్న – యిటువంటి దయనీయమైన – ప్రాధేయపూర్వకమయిన పరిస్థితిలో – ఎందుకుండాలి? ఆమె – తాను విపరీతంగా ద్వేషించే తరహా జీవితంతో ఎందుకు రాజీపడాలి?

"నువ్వు – యిటువంటి బ్రతుకుతో రాజీపడిపోయావా స్వప్నా?"

"ఏం చేసేది? తెలిసి చేసినతప్పు ... తప్పదు ... మరో మార్గమూ లేదు. వ్యాపారపు ప్రాతిపదికమీద వివాహం చేసుకోడమే నేను చేసిన తప్పు. నాకూ, నా వాళ్ళకీ ఆశ్రయమూ, రక్షణ లభిస్తాయన్న ఆత్రుతలో పూర్వాపరాలు తెలుసుకోకుండా ఊఁ అనేశాను...."

పూర్వాపరాలు! .... సరిగ్గా తను రేఖ విషయంలో చేసిన తప్పు!

"ఆయన బొత్తిగా తుమ్మెద అని నాకు తెలియదు."

రేఖ? తుమ్మెదవాలిన పువ్వు!

"నా బాధ-ఆయన భౌతిక పతనం గురించి కాదు...శారీరక బలహీనతలకూ, నేరాలకూ సవాలక్ష కారణా లుండవచ్చు. మనుషులూ....వాతావరణమూ...."

"మరి?"

"ఆయన-మానసికంగా కూడా పతనమయ్యారు." స్వప్న

కన్నుల్లో అశ్రువులు.

"అంటే?"

"తనకు వివాహ వ్యవస్థలో నమ్మకం ఉన్నట్లు తోచదు.... కాని—ఎందుకో నన్ను పెళ్ళి చేసుకున్నారు. బహుశా - భవిష్యత్తులో సహాయం కోసమేనేమో! అదీకాక - సంఘపరంగా కూడా వివాహం మనిషి అంతస్తుని పెంచుతుంది. తరువాత - నే నాయనకు వ్యాపారపరంగా కూడా ఉపకరిస్తాను. నా రికార్డులు ఎక్కువే రిలీజు చేశారు. వాటి అమ్మకాలూ ఆయనకు లాభాలు తెచ్చిపెట్టాయి."

ఆనంద్ ఆలోచించ సాగాడు. రేఖ కూడా సాంఘిక భద్రత కోసమూ, భవిష్యత్తు కోసమూ వివాహం చేసుకొని ఉంటుందేమో. ఈ సంఘంలో వివాహిత అయిన స్త్రీకి లభించే అంతస్తు తక్కువ ఏమీ కాదు. కన్యగాలేని గౌరవం - భార్యగా లభిస్తుంది. బహుశా అందుకే ఆమె తనవి వివాహం చేసుకుని ఉంటుంది.

"ఆయన - అదొక తత్వం. పెళ్ళిని బాధ్యతాయుతంగానూ, పవిత్రంగానూ స్వీకరించరు."

రేఖా అంతే. ఆమెకు బాధ్యత అనేది వంటపడితే, తన నంత దూరంగా ఎందు కుంచుతుంది? పెళ్ళిలో- పురోహితుడి ముందు అన్ని మంత్రాలు వల్లెవేసిందే! నమ్మక మున్నదయితే వాటి నెందుకు ఆచరించదు?

ఆనంద్‌కి- యీ సారూప్యం ఉత్సుకతను పెంచింది. రఘుపతికూడా రేఖ తన పట్ల ప్రవర్తిస్తున్నట్లే ప్రవర్తిస్తాడా స్వప్నతో? ఐతే స్వప్నదీ తన అవస్థే కాబోలు. ఆమె చెబితే తప్ప తెలియని రహస్యం. అడగరాని విషయం. ఈ మిస్టరీ ఎలాగ విడుతుంది?

"స్వప్నా! నువ్వు అతన్ని క్షమించావా? అతని నేరాలను మన్నించావా?" ఆత్రంగా అడిగాడు ఆమె ఎదురుగా సోఫాలో కూర్చుంటూ.

"క్షమించక చేయగలిగే దేముంది? సంసారంలోకి దిగాక మళ్ళీ వెనక్కి పోగలిగే ప్రసక్తే లేదు. వివాహ వ్యవస్థలో

విశ్వాసముంటున్న స్త్రీకయినా పురుషుడి కయినా సరే, ఏదో సంద ర్భంలో ఒక సినీరచయిత అంటాడు - సంసారం దృశ్య కావ్య మట. పురుషుడు కన్ను, స్త్రీ వెలుగు. కన్ను లేకపోయినా, వెలుగు లేకపోయినా సంసార కావ్యం వ్యర్థమేనట. నిజమే కాదూ? కన్ను లుండినా- వెలుగులో తప్ప చూడలేం. చూడడం అనే పనికి అటు కళ్ళూ, యిటు వెలుగూ అవసరాలే..."

"ఐతే నువ్వు రాజీ పడిపోయావన్నమాట!"

"చెప్పానుగా? రాజీ పడకపోతే రెండు జీవితాలూ నరకాలే ఔతాయి. అందునా ఎక్కువ నష్టం నాకే" అంది స్వప్న.

అతను ఆశ్చర్యంగా చూశాడు. ఎంతో అమాయకంగా ఉండే స్వప్న ఎంత మారిపోయింది!

ఎన్ని తెలివితేటలు వచ్చేశాయి.

హటాత్తుగా అడిగిందామె. "నీ గురించి ఏమీ చెప్పవేం?"

"ఏమయినా ఉంటేగా?" బలవంతపు నవ్వు తెచ్చిపెట్టు కున్నాడు.

"నాముందూ రహస్యాలేనా?" మందలిస్తున్నట్లుం దామె.

"రహస్యం కాదు సిగ్గు!"

"దేనికి?"

"పెళ్ళి విషయంలో నేను పూర్తిగా మోసగించబడ్డాను స్వప్నా! నిజానికి చాలావరకు తప్పు నాదీ ఉందనుకో. ఉద్యోగం కోసం - ముందు వెనుక లాలోచించకుండా, కనీసం ఆమెను చూడనయినా చూడకుండా " రేఖను అంగీకరించాను. అప్పటి పరిస్థితి అది. కాని - తరువాత ...చేతులు కాలాక —తెలిసింది. రేఖ వివాహానికి పూర్వమే పతనమయిందని...."

"పతనం!"

"ఆమె గర్భస్రావం చేయించుకుంది పెళ్ళయిన సాయం త్రము....డాక్టరు స్వయంగా చెప్పాడు.

"ఆమె అలాగ ఎందుకు చేయవలసి వచ్చింది?"

"తెలియదు...."

"నువ్వు అడగలేదూ?"

"ఉహూం....ఆమె కూడా చెప్పలేదు. అసలు - మా మధ్య

ఒక్కసారయినా మాటలు జరిగితేగా!"

"అంటే .... పెళ్ళయిన యిన్ని నెలలనుంచీ మీరు .. యిద్దరూ ...."

"అపరిచితులలాగ - శత్రువులలాగ..."

స్వప్న నిట్టూర్చింది. "నువ్వు తప్పే చేశావేమో ఆనంద్."

అతను త్రుళ్ళిపడ్డాడు. తప్పు - తనదా! "అదేమిటీ"

"ఆమె - నేరస్తురాలు కనుక సిగ్గుపడి నీముందు నోరు విప్పలేక మూగగా ఉండిపోయిందేమో! నువ్వయినా అడగ వచ్చుగా! తప్పుచేసి - అది తెలిసివచ్చాక — మనుషులని చాలా పిరికితనం ఆవరిస్తుంది. బయటకు ఎలా కనిపించినా అంతర్యంలో వాళ్ళు తమ నీడకు తామే జడుసుకునే భీరువులుగా మిగులుతారు!"

"రేఖ సంగతి నీకు తెలియదు. ఆమె కెంత అహంభావం! ఎంత గర్వం!"

"అది నీ చూపులోని దోషమే కావచ్చు. రైలు పరుగెడు తూంటే ఆ శబ్దం - క్రమబద్ధమయిన ఆ శబ్ద పరంపర - నువ్వే రాగం ఊహిస్తేదానినే ప్రతిఫలిస్తుంది. అలాగ, దోషం-వస్తువులో నయినా ఉండవచ్చు. దృష్టిలోనయినా ఉండవచ్చు. ఒకమాట వింటావా!"

"చెప్పు స్వప్నా!" అతని ఆలోచనలలో కొత్త కవా టాలు - తెరుస్తున్నది స్వప్న. ఆమె చెబుతున్నది కాదనలేని నిజాలు. ఔననిపించే నిజాలు.

"స్త్రీ అంతర్యం చిత్రమయినది. ప్రకృతి అలాగ నిర్దేశిం చిందేమో! ఆమె ఎప్పుడూ భద్రతకోసం కొట్టుకుంటుంది. ఈ భద్రత ఏ పరమయిన దయినా కావచ్చు. సంఘంలో.. ఆర్థిక పరంగా.. శారీరకంగా.. అలాగ. ఆమెకు తనలో విలువయిన దంటూ ఉంటే అది శీలమే అన్న విషయం బాగా తెలుసు. అందు చేత- ఆమె ఎంతో ఆలోచించి తప్ప- ఎంతో నమ్మకం ఉంటే తప్ప తన స్త్రీత్వాన్ని పురుషుడికి ధారపొయ్యదు. తన జీవితంతో కాని - మగవాళ్ళతో కాని ఆటలాడుకునే స్త్రీలు చాలా అరుదు. వాళ్ళు సాధారణంగా మూర్ఖులో, అమాయకులో అయిఉంటారు. ఎంతోక్లిష్టమయిన పరిస్థితిలో తప్ప స్త్రీ పతనం కాదు. ఏ పతిత

వెనుకచూసినా హృదయాన్ని కదిలించే పెద్ద గాథ ఉంటుంది.

రేఖ.. చదువుకున్నది కూడా. నా విశ్వాసం – ఆమె క్షణి కోద్రేకాలకీ, చాపల్యానికోలోనై పతనాన్ని కొనితెచ్చుకుని ఉండదు. చాలా బలీయమయిన పరిస్థితుల్లో .... భంగపడి ఉంటుందేమో !–"

"స్వప్నా !"

ఈమె ఉద్దేశమేమిటి ? తను రేఖని స్వీకరించడమే న్యాయ మని తేల్చబోతూందా ?

స్నేహితురాలయిన యీమె – తన పక్షంకాక వేరే పక్షం ఎందుకు తీసుకుంటూంది ?

స్త్రీకి తన జాతిపట్ల ఉండే పక్షపాతంకొద్దీ నేనా ?

"కొందరికి అతి త్వరగానే అనేక అనుభవాలు ఎదు రౌతాయి. ఇది – మంచోచెడో నేను చెప్పలేను. కాని – అనుభవా లతో పండినవాళ్ళు కనీసం ఎదుటివాళ్ళయినా బాగుపడాలన్న ఉద్దే శంతో తమకి తెలిసినవి చెప్పకుండా ఉండలేరు..."

"నాకు చెప్పగలిగే అర్హత నీకుంది స్వప్నా !"

"జీవితం మనతో రాజీపడనప్పుడు – మనమే దానితో రాజీపడాలి. సంఘర్షణలో కాలాన్నీ, జీవితాన్నీ కోల్పోయేది మనమే ఆనంద్ ! నిజం చెప్పు ... నువ్వొక్కసారయినా రేఖ హృదయంలోకి తొంగిచూడాలని ప్రయత్నించావా ?"

"లేదు. ఆమె ఆ అవకాశం యివ్వలేదు."

"నువ్వు అవకాశం తీసుకుందుకు ఏం అభ్యంతరం వచ్చి పడింది ?"

"నేనా ?"

"ఏం ? నువ్వే ముందడుగు ఎందుకు వేయకూడదు ? మగతనానికి తక్కువనా ?"

"కాదు. తప్పు చేసింది ఆమె !"

"ఆమె తప్పుచేసి ఉండవచ్చు. నువ్వు తప్పు చేయనంత మాత్రాన అధికుడివని భావించుకుంటే అది పొరపాటే. ఆమె తప్పుని క్షమించగలిగినప్పుడే నీ ఆధిక్యతా, ఔన్నత్యమూ."

"కాని ఆమెకు నా క్షమాపణతో నిమిత్తమున్నట్లే ప్రవ

త్రించదు-"

స్వప్న విట్టూర్పు విడిచింది. చివరికి మెల్లగా నవ్వుతూ-"నువ్వింకా చిన్న వాడివిగానే ఉండిపోయావ్-" అంది అతని చెయ్యి నొక్కుతూ.

అతను తెల్లబోయి చూశాడు.

"పంతాలతోనూ, పట్టుదలతోనూ సంసారాలు బాగుపడవు చెడిపోతాయంతే. ఈ చిన్నవిజం నీకు తెలియదంటే-"

"తెలిసినా ఆచరణలో పెట్టాలంటే "

"అహం అడ్డు వస్తుంది. అదేగా నీ ఉద్దేశం ?"

అతను మౌనం దాల్చాడు.

"అహం ఎప్పుడూ అనర్థమే తెచ్చి పెడుతుంది. మరీ భార్యాభర్తల మధ్య. జీవితాన్ని పూలవనం చేసుకుందుకు ప్రయత్నించాలి కాని ముళ్ళపొద చేసుకోవడం ఎంతసేపు ?"

ఇక-నీతిపాఠాలు వినలేని స్థితికి వచ్చేశాడు ఆనంద్.

"ఒక్కసారి - శివరంజని...."

"ఇప్పుడా! అర్థరాత్రి దాటుతోంది!.... అటూ యిటూ యిళ్ళవాళ్ళు నిద్రపోతూంటారు. చూడు. ఎవరింట్లోనూ దీపాలు వెలగడం లేదు. ఎప్పుడో ఆరిపోయాయి..."

"స్వప్నా!" అతనికి ఆశ్చర్యం వేసింది. స్వప్న మారిపోయిందా? మునుపు - తను అడగడమే తడవుగా శివరంజని పాడే స్వప్న! ఇక తను శివరంజనివి నలేదా స్వప్నగొంతులోంచి.

"రికార్డు యిస్తాను నీ యిష్టం వచ్చినప్పుడల్లా విందువుగాని. ఏం." బుజ్జగిస్తున్నట్లే అని - "చాలా వేళ అయింది. నిద్రపోదామా ?"

"ఊఁ" అన్నాడతను. సరిగ్గా అదే క్షణంలో -

కారు హారన్, గేటు తెరచినచప్పుడు. సంతోషంగా అంది స్వప్న." వారొచ్చేశారు! బహుశా క్యాంపు కాన్సిలయి ఉంటుంది ఉండు. రిసీవ్ చేసుకుని వస్తాను."

ఆనంద్‌కు ఏమీ అర్థంకాలేదు. పెళ్ళయేసరికి ఆడవాళ్ళు చాలా చిత్రంగా మారిపోతారు కాబోలు !

అతన్ని - రఘుపతిని తీసుకుని వచ్చింది. పరిచయ-

లయ్యాయి. ఇక అక్కడనుంచి మొదలయింది స్వప్న సందడి.
"టీ తీసుకుంటారా, కూల్ డ్రింకా ?"

"ఏమీ అవసరం లేదు" అన్నాడు రఘుపతి. అయినా అతన్ని వదలలేదు. కూల్ డ్రింక్ తాగించింది. అతను భోజనంచేసి వచ్చాడన్నా వినకుండా బలవంత పెట్టింది. చివర కతను టిఫిన్ తినవలసి వచ్చింది. అతని స్నానానికి తువ్వాలందించింది. బట్టలు సిద్ధంచేసి, అలాగ హడావిడి పడిపోయింది.

ఆనంద్ సోఫాలోనే నిద్రపోయాడు. తెలివి వచ్చేసరికి తెల్లగా తెల్లారిపోయింది.

స్వప్న-ఎదురుగా కుర్చీలో కూర్చుని పుస్తకం చదువు కుంటూంది. ఆమె మామూలుగా గంభీరంగా ఉంది, అతని ముఖంలోకి చూస్తూ.

ఆనంద్ నవ్వాడు-చాలా అర్థం అయినట్లు, ఆమె నవ్వింది-స్నిగ్ధంగా....సిగ్గుపడుతూ కాఫీ యిస్తూ అంది. "ఆనందాన్ని పంచుకో. దుఃఖాన్ని దాచుకో. జీవితాని కింతకంటే చక్కని హితవచనం యింకేమీ లేదనుకుంటాను."

"ఔను-" అన్నా డతను.

స్వప్న రికార్డ్ప్లేయరు తెచ్చింది. తన పాటలు విని పించింది.

"నిన్ను లేపి సెలవు తీసుకోడం బాగుండదని-నన్ను చెప్పమన్నారు-మరేమీ అనుకోవద్దని...."

"ఫరవాలేదు-"

ఆనంద్ కర్థం కాలేదు. స్వప్న అతని ముందు నటించిందా ? తన ముందా ?

పాటలు అయి పోయాయి.

"నేను వెళ్తాను...."

"అప్పుడే ?"

"వచ్చిన పని అయి పోయింది."

స్వప్న పరిశీలనగా అతని ముఖంలోకి చూసింది.

"ఇవాళ ఉండకూడదూ ?"

"సారీ...నన్ను వెళ్ళనీ..."

"సరే. శివరంజని రికార్డు .."

"వొద్దు-"

వెళ్ళిపోతున్న అతనివైపు చూస్తూ ఉండిపోయింది

పద్మం-సూర్యకాంతిలోనే వికసిస్తుందట. కొందరు మనుషులు చీకట్లోనే చక్కగాఆలోచించుకో గలుగుతారు. ఏకాంతంలో, చీకటిలో... హృదయంలో కొత్తకొత్త కవాటాలు తెరచుకుంటూ-ఉంటాయి కొందరికి. మూడ్ రావడం లాగ. అప్పుడే ఆ మనిషి తీవ్రంగానూ, సహజంగానూ ఆలోచించ గలుగుతాడు.

చీకట్లో హైదరాబాదు వంక పరుగెడుతూంది రైలు. రైలులో ఆనంద్. మొదటి తరగతి పెట్టెలో-ఆ కంపార్టుమెంట్ లో అతనొక్కడే. అతను ఆలోచనలో ఉన్నాడు. కనులు తెరుచుకునే ఉన్నా ఎదురుగా చీకటి. కాని-చిత్రంగా ఆ చీకటిలోనే పరుగెత్తే చిత్రాలు. ఆ చిత్రాల నిండా రేఖా, తనూ. ఒక్కొక్క చిత్రమూ సంతోషమయమే. స్వర్గతుల్యమే.

రైలుకంటే వేగంగా అతని మనసు పరుగెడుతోంది. కాలు కంటే కన్నుఎప్పుడూ ముందే. కంటికంటే ముందు మనోనేత్రం. అతనికా రాత్రినిద్ర రావడంలేదు. ఎప్పుడు వెళ్ళి హైదరాబాదులో రేఖముందు వాలుతానా అని ఉంది. విచారంలాగే ఆనందమూ, ఆత్రతా ఎక్కువయినా మనిషికి నిద్రపట్టదేమో !

తెల్లవారుతోంది. ఆకాశం మెల్లమెల్లగా వెలుగులోకి వెడుతోంది. తూరుపు దిక్కు వెలుగు ముద్దని ప్రసవిస్తోంది. టాక్సీ దిగి యింటిలో అడుగుపెట్టాడు ఆనంద్. ఆత్రంగా యింట్లోకి నడిచాడు- రేఖకోసం వెదుకుతూ. ఎక్కడుందామె ?

ఒక్కొక్క గదీ.... చివరికి శర్మ గది. ఆయన యీ లోకంలో ఉన్నట్లు లేడు. చుట్టూ బాటిల్స్ ... కాళీవి నిండువీకూడా. వాటిమధ్య-శవంలా పడున్నారు.

సర్వెంట్ కనిపించాడు. ఆత్రంగా అడిగాడు ఆనంద్

"రేఖ ఏది?"

ఆశ్చర్యంగా చూసి- అడ్డంగా తలూపాడు. అర్థం కాలేదు ఆనంద్ కి. మళ్ళీ అడిగాడు.

"తెలియదు బాబూ!" అని లోపలికివెళ్ళి కాఫీ కప్పుతో

వచ్చాడు.

ఆనంద్ తన గదిలో కూర్చున్నాడు. టేబిలు మీద ఉత్తరం. అక్కయ్య రాసింది. అన్యమనస్కంగా అందు కున్నాడు.

"ఆనంద్! మీ బావగారి ఆరోగ్యందృష్ట్యా గాలి మార్పు అవసరం అన్నారు డక్టరు. అందుకని కొన్నాళ్ళపాటు యీ వూరు వదిలి వెళ్తున్నాము. మీ బావగారు కొట్టునీ, సామానునీ కూడా అమ్మేశారు. కనుక ఆ డబ్బు కొంతకాలం వస్తుంది. నేను మళ్ళీ ఉత్తరం రాస్తాను. నువ్వేమీ కంగారు పడనక్కరలేదు. ఎప్పటి కప్పుడు నీకు మా యోగక్షేమాలు తెలియజేస్తూనే ఉంటాను. బావ గారు నిన్నూ, రేఖనీ మరీమరీ అడిగానని చెప్పమన్నారు.

నువ్వూ, రేఖా, ఆనందంగా గడుపుతున్నారని ఆశిస్తు న్నాను. ఇంకేమీ విశేషాలు లేవు. రేఖకి నా ఆశీర్వచనాలు.

అక్కయ్య.

చదివి- బాధగా ఉత్తరం టేబులుమీద పెట్టేశాడు.

అతని దృష్టి అంతా రేఖమీదే ఉంది. హృదయం నిండా ఉద్రేకమూ, ఆవేశమూ.

తానేం ఆశించాడు? తను యింట్లో అడుగుపెట్టగానే రేఖ ఎదురౌతుందనీ- ఆమెకు చక్కని మాట చెప్పి ఆనందంతో ఉక్కిరిబిక్కి రయ్యేలా చేస్తాడనీ ... ఆమె తనమీదకు వాలి పోతుందనీ.... ఆమెను కౌగిటిలోకి తీసుకుని, కురులు నిము రుతూ - చెక్కిలిమీద పెదవులు ఆనీఆనకుండా ముద్దు పెట్టు కుని - ఆ తీయనిముద్దు ఆమెలో రేపే సంతోష తరంగాలకు ప్రాతినిధ్యం వహించి ప్రతిఫలించే ఆమె చక్కని విశాల నయనా లను చూస్తూ వాటిలో కొత్తలోకాలు కనపడుతూంటే తనను తాను మరచి దివ్యలోకాలలో తేలిపోతుంటాడనీ... అలాగ ఊహించు కున్న తన కిక్కడ ఎదురయిన దేమిటి?

తను ఎవరికోసం ఎంతో ఆత్రంగా ఎన్నో ఊహలతో, యింకెన్నో కోరికలతో పరుగెత్తుకు వచ్చాడో ఆమె యిక్కడ యింతవరకూ కనిపించనే లేదు. ఆమె దర్శనమే కరువైంది. ఆమె వైనం తెలిపేవారూ లేకపోయారు. శర్మ నిషా నిద్రనుంచి

బయటపడితే తప్ప రేఖ జాడ తెలియదు. తను లేదని- ఆమె ఏ వూరు వెళ్ళిందో? ఎప్పటికి వస్తుందో? తన ఏ ప్రశ్నకీ యిప్పుడు సమాధానం దొరకదు. మనుషులు ఉండీ లేనట్లే లెక్క. నౌకరువచ్చాడు.

"రేఖ వచ్చిందా?"

"రాలేదు బాబూ!"

"శర్మగారు లేచారా?"

"లేదుబాబూ! అలాగే పడుకున్నారు."

"నువ్వికక్కడనుంచి వెళ్ళు త్వరగా."

నౌకరు వెళ్ళిపోయాడు. ఆనందు నిట్టూర్చాడు.

ముఖం కడుక్కుని-శర్మ గదిలోకి వెళ్లాడు. మునుపటి దృశ్యమే ఎదురయింది.

సీసాలమధ్య - శవంలా శర్మ... కాని - మొదట హడావిడిలో తాను చూడని ఉత్తరం - ఒకటి కాదు... రెండు... సీసాల కింద.

ఆత్రంగా అందుకున్నాడు. రెండూ తనకే.

కవర్లను చేతిలో ఉంచుకునే శర్మ వంక చూశాడు.. అచ్చంగా శవంలాగే!

జాలివేసింది. కర్తవ్యం స్ఫురించింది. ఒంటిమీద చెయ్యి వేసి చూశాడు. చల్లబడిపోతున్నట్లు అనిపించింది. కంగారుగా పల్స్ చూశాడు. చాలా నీరసంగా...

ఫోను దగ్గరకు పరుగెత్తాడు ప్రమాదకరమయిన పరిస్థితిలో శర్మ ఉన్నారనీ, వెంటనే బయలుదేరి రావలసిందనీ చెప్పాడు. ఆఫీసువాళ్ళకి ఫోన్ చేశాడు.

అందరూ వచ్చారు. శర్మని పరీక్షించి - "సారీ ... అంతా ఐపోయింది-" అని పెదవి విరిచేశాడు డాక్టరు. ఆఫీసువాళ్ళు ఆనంద్‌ని ఓదార్చబోయారు. ఆనంద్ నోటమాటలేక శిలలాగ నిలబడిపోయాడు. అతను చూస్తూండగానే శర్మ శవాన్ని తొలగించారు.

ఆనంద్‌కి తోడుగా ఆ యింటి నౌకరూ, వంటమనిషీ తప్ప

యింకెవరూలే రాయింట్లో.

అతనికి చిత్రమనిపించింది. ఏమిటీ పరిస్థితి? తా నెవరు ఈ యిల్లెవరిది? ఈ యింటికీ, తనకీ సంబంధ మేమిటి? క్షణాలలో - ఈ యింటికి అధికారిగా తను.

ఏ యింటినయితే భరించలేకపోయేవాడో దానికే తను అధికారి! యజమాని చనిపోయాడు. అతని అమ్మాయి లేదు. ఎక్కడికి వెళ్ళిందో, ఏమయిందో తెలియదు. తను మాత్రం యిక్కడ చిక్కుపడి పోయాడు!

హటాత్తుగా అతనికి ఉత్తరాలు గుర్తువచ్చాయి. చేతికందిన కవరు చింపి చదవసాగాడు.

అది - శర్మ వ్రాసింది!

అల్లుడూ, ఆనంద్!

ముందు నీకు నా క్షమాపణలు తెలుపుకోనీ, నువ్వు క్షమించినా, మానినా. నాకు తెలుసు - నన్ను నువ్వు చాలా ద్వేషిస్తు ఉంటావని. నన్నొక మోసగాడిగా భావిస్తావనీ తెలుసు. లోకాని కనిపించే శర్మ తాగుబోతూ, అకర్మణ్యుడూ. కాని- ఆ తాగుబోతు లోపలఉన్న మనిషి మరొకరు. ఆ శర్మ - తండ్రి కొంచం ఛాదస్తం మనిషికూడా. దురదృష్టవంతుడూను. ప్రేమగా చూసుకునే భార్యని పోగొట్టుకున్నాడు. దారం తెగిన గాలిపటం లాంటి జీవితం. అతి తరచుగా జ్ఞాపకంవచ్చే బంగరు గతం అప్పుడే - మనసుకి శాంతి లభిస్తుందేమో! అని తాగడం మొదలు పెట్టాడు. తాగితే మనసుకి శాంతి దొరకదన్న నిజం - తాగుడు అలవాటయ్యాక తప్ప తెలియలేదు. అప్పటికది అతని జీవితంలో భాగమైపోయింది. పైగా - త్రాగడం నాగరికమూ, ఫ్యాషను ఐకూర్చుంది.

నా భార్య తన తీపిగుర్తుగా మిగిల్చిన అమ్మాయి రేఖ నే నెందుకు జీవించాలన్న ప్రశ్నకు సమాధానం రేఖ. నా జీవితా: కర్థం రేఖ. ఆమె కేలోటూ జరగకూడదని శాయశక్తులా డబు సంపాదించే వాడిని. రేఖ మంచి ఆయాచేతుల్లో పెరుగుతూంది నా సంపాదన ఆమెకు కావలసినవన్నీ అమర్చ గలుగుతుంది

దానితో నా బాధ్యతా సక్రమంగా నెరవేర్చుకోగల్గుతున్నాననే భ్రమపడ్డాను. రేఖ-పెరిగి పెద్దదౌతూంటె. మంచి మార్కులతో ఒక్కొక్క క్లాసు పాసవుతోంది. ఆమెను జూసి గర్వపడేవాడిని. ఆమె బి. ఎ. పాసయింది. ఎమ్మేలో చేర్చా లనుకుంటుండగా ఒకనాడు :

రేఖ దీనంగా కూర్చుంది. కారణం అడిగాను. చెప్పలేక ఏడ్చేసింది నాకేమీ అర్థంకాలేదు ఆడపిల్లని తల్లే పెంచాలి. అందుకే మగ పెంపకానికి రాణింపు ఉండవంటారు. బ్రతిమాలగా బ్రతిమాలగా రహస్యం చెప్పేసింది రేఖ ఆమె మోసపోయింది, ప్రపంచం అంధకార బంధురమై పోయింది. నేను చేసిన పొర పాటు తెలిసివచ్చింది. వయసు చెడ్డది. వివేకాన్ని కూడా జయించి పారేస్తుంది. కాకపోతే రేఖలాటి తెలివయిన అమ్మాయి యిటు వంటి పొరపా టెందుకు చేస్తుంది ?

పలుకుబడి ఉపయోగించి ఒక డాక్టరు వద్ద రేఖ కడుపులో ఊపిరిపోసుకుంటున్న పాపాన్ని తీయించేశాను. రేఖకి ధైర్యం చెప్పాను. ఆమె పెళ్ళి తలపెడితే ఒక పట్టాన అంగీకరించలేదు. చెడిపోయిన తనని ఆదరించే విశాల హృదయుడు ఉండడంది. వెతికి తెస్తానన్నాను. తన గురించి అంతా చెప్పి - అంగీకరిం చిన వాడయితేనే పెళ్ళికి ఒప్పుకుంటానంది. ప్రయత్నాలు మొదలు పెట్టాను.

ఒక చిత్రమయిన విషయం బయటపడింది. రేఖ గురించి ఆమెకూ, నాకూ తెలుసనుకున్నాను. కాని - అందరికంటే ఆఖర్న తెలిసింది నాకే చాలామందికి ఆమెగురించి తెలిసిపోయింది. హైదరాబాదులోకాక - దూరంగా నా ప్రయత్నాలు సాగించాను.

ఆనంద్!....నువ్వు విజయవాడలో ఇంటర్వ్యూకి వచ్చావు. నేను నీ దరఖాస్తుమీది వివరాలతో మా శాఖవాడవని - పెళ్ళికి ఒప్పుకుంటే ఉద్యోగం యిద్దామని ఇంటర్వ్యూ ఆఫీసరుగా వచ్చాను. నా ప్రణాళిక పారింది, నువ్వు ఊఁ అన్నావు.

అతి తెలివితేటలకు పోయి - రేఖదగ్గర అబద్ధ మాడాను - తనగురించి నీ కంతా చెప్పాననీ, నువ్వు విశాల హృదయుడివి

కనుక అంగీకరించావనీ నామాటలు నమ్మిందామె. గతం మరచి పోయి - ఏమీ జరగనట్లే నీముందు ప్రవర్తించమన్నాను. అలాగే అంది. నా నాటకంలో ఎక్కడో లోపం ఉంది కాబోలు. ఎవరికీ తెలియకుండా పెళ్లయితే రహస్యంగా జరిపించగలిగాను కానీ మిమ్మల్నందర్నీ నే నాశించినట్లు చూడలేకపోయాను. మోసం చేశాను కనుక ఆమె నడగలేను ఏం జరిగిందని. విన్నూ మోసం చేశాను కనుక నీముందూ భయమే నాకు. ఏమీ ఎరగనట్లు నటించడం మినహా మరోమార్గం లేకపోయింది నాకు. నేను కోరుకున్నది రేఖ సుఖం. ఆమె కేలోపమూ లేకుండా సుఖంగా ఆమె జీవితం సాగడం. నా ప్రాణం రేఖ. నా జీవితానికి ఆశా. ఆధారమూ ఆమె. నేను తాగుబోతునే కాను, ప్రేమించ గలిగే తండ్రిని కూడా. నేను మోసాలు చేసిందీ, నాటకా లాడిందీ అన్నీ రేఖ కోసమే. కాని - నా ఆశ నెరవేరలేదు. నా ధ్యేయం అసాధ్యంగానే ఉండిపోయింది. వెయ్యి అబద్ధాలయినా ఆడి ఒక పెళ్లి చెయ్యమన్నారు - పెద్దలు. కాని - నే నాడిన ఒక్క అబద్ధానికే మీ దాంపత్యం పేకమేడలా బలహీనం ఐపోయింది.

మీరిద్దరూ నాకు మనవడి నిస్తారనీ-వాడు నాకు కొరివి పెడతాడనీ...చాదస్తమే అనుకో .... ముసలివాడిని కదా-అలాగ అనుకున్నాను. ఏదో ఒకనాటికి రేఖా, నువ్వూ ఒకటి కాకపోతారా అని ఆశతో ఎదురుచూశాను.

నువ్వు ఉద్యోగంకోసం మద్రాసు వెళ్లావని_నువ్వెంత రహస్యంగా ఆ విషయందాచినా_నీకు తెలియడంతో- నా గుండెమీదా, ఆశలమీదా మొదటి సమ్మెటపోటు తగిలింది. తరువాత-రేఖ ఉత్తరం...ఆమె నన్ను నిందిస్తూనే రాసింది. తను యీజీవితంతో విసుగెత్తిపోయిందనీ, అనవసరంగా పెళ్ళిచేసి, మోసగించి-నీ జీవితాన్ని నాశనం చేశాననీ నిందిస్తూ. తను ఎవరికీ తెలియని దూరానికి వెళ్ళిపోతున్నానని ఉత్తరంరాసింది. ఇక ఏనాటికీ తిరిగిరాదల్చుకోలేదుట।

నన్ను ఒంటరి జీవితానికి వదిలేసింది-నిర్దయగా। నాగుండె మీద యిది పెద్దదెబ్బ. ఇంక నాకేం మిగిలింది? నాజీవితాని కర్థమూ, ఆధారమూ, ఆశా ఏమిటి?

అందుకే....

ఆనంద్! పగిలినగుండె రగిలి-మండి పోయేవరకూ తాగి-చచ్చిపోవాలని నిశ్చయించుకున్నాను, బహుశా నువ్వొచ్చేసరికి - నా శవమే మిగులుతుంది. నీ క్షమ సర్థించే అర్హతలేదని తెలిశాక కూడా .... ఎందుకో అడగాలనిపిస్తున్నది. నన్ను క్షమించ గలవా!"

ఉత్తరం చేతుల్లోంచి జారిపోయింది-

ఒక్క-క్షణం శర్మమీద జాలివేయక పోలేదు. పగలూ, ద్వేషాలూ-మనిషి మరణంతో సరి. అందుకే చచ్చిపోయిన వాడి గురించి మంచే చెప్పుకుంటారుకాని చెడ్డ చెప్పుకోరు. ఎంత దుర్మార్గుడిలో అయినాసరే ఎంతోకొంత మంచి ఉండకపోదు. ఆ పిసరు మంచికూడా ఉండకపోతే ఆ మనిషి తననితానే పొడిచి చంపుకునే రాక్షసుడై మిగిలిపోతాడు.

"బాబూ!—"

విసుగ్గా చూశాడు. కోపం తెచ్చుకుందుకూ ఓపికలేక.

"ఆభోజనం ఉండకూడదు....కొంచం పాలయినా..."

"తీసుకురా .. టేబులుమీద పెట్టు—"

రేఖ రాసిన ఉత్తరం అందుకున్నాడు.

"ఆనంద్!

నేను వెళ్ళిపోతున్నాను. ఎక్కడికో నాకే తెలియదు. ఎందుకో మాత్రం తెలుసు. నిజానికి-యీ ఉత్తరం మీకు వ్రాయవలసిన బాధ్యత కూడా నా మీద అట్టే ఉందనుకోను.ఎందుకంటే మనం ఎప్పుడూ ఒకరికొకరం దూరంగానే ఉండిపోయాం. కాని-మీరు నా మెడలో తాళి కట్టారు! మీరు తెలియకా-నేను తెలిసీ చేసిన పెద్ద పొరపాటు. దానికి శిక్ష యిద్దరమూ సమంగానే అనుభవించాము. నా జీవితం గురించి ఏనదో ఒక నిశ్చయానికి వచ్చేశాను. నా బ్రతుకులో సుఖం ఉండదనీ-వెలుగు నిండదనీ-

ఎందుకంటే తెలియని తనంలో - అమాయకత్వంలో .... వలపు ఉధృతంలో .. రాగోదయంలో.. నన్నూ, నా భవిష్యత్తునీ మరచి సుకుమారమూ, సున్నితమూ అయిన స్త్రీ స్థానాన్ని విస్మరించి- నేను ప్రేమించిన అతని తీయని మాటలకు కరిగిపోయి-అతనిలో పరిపూర్ణ విశ్వాసంతో...కొంచమయినా సందేహించకుండా-అతనికి నన్ను నైవేద్యం కావించుకున్నాను. నా జీవితమే అతనిదైనప్పుడు యిక నాకంటూ మిగుల్చుకుందు కేముంటుంది? నిజమయిన ప్రేమలో దాచుకుందు కేం మిగులుతుంది? మనస్ఫూర్తిగా అతన్ని ప్రేమించాను. అతనూ అంతే. కాని - విధి వెక్కిరించింది. నేను దురదృష్టవంతురాలినే కాకపోతే అతను ప్రమాదంలో ఎందుకు మరణిస్తాడు?

నిజానికి - ఆ క్షణంలోనే నేనూ మరణించాను - మానసికంగా చచ్చిపోదా మనుకుంటున్నాను - నాన్న బలవంతంగా బ్రతికించాడు. నా జీవితాన్ని సరిదిద్దడానికి శాయశక్తులా తంటాలు పడుతున్న నాన్నమీద జాలికొద్దీ....ప్రేమకొద్దీ....అయిష్టంగానే ఋక్ష్మి జీవితంలోకి వచ్చాను - దాన్నికూడ జీవితం అనవొచ్చు నంటే. నాకు పెళ్ళి చేస్తానన్న నాన్నకి నిష్కర్షగా చెప్పాను - రహస్యం దాచవద్దని నాకు లోకం కొంచెం తెలుసు. ఒకసారి కాలుజారిన స్త్రీకి-మగవాడు తన జీవితంలో స్థానం యివ్వలేడు హృదయపూర్వకంగా. ఆదర్శాలు - కాగితాలమీదే కాని బ్రతుకుల్లోకి యింకా రాలేదని నాకు తెలుసు. నా విషయం తెలిసిన ఏ మగవాడు నన్ను స్వీకరించగలడు? నా అందమూ...ఐశ్వర్యమూ- కొంత ఆకర్షణ కలిగించినా నా చరిత్ర ఎవరికయినా అయిష్టత కలుగజేసి తీరుతుంది. నాన్న-అబద్ధం చెప్పాడు. నా విషయం చెప్పినా మీరంగీకరించారన్నాడు. మీరు సంస్కార స్వభావులనీ, సువిశాల హృదయులనీ నా ముందు పొగిడాడు.

నిజమేమో అనుకున్నాను. సువిశాల హృదయులైన మగ

వాళ్ళుఉండకూడదా అనుకున్నాను. మీరు-మహాత్మ లనుకున్నాను. పుణ్యపురుషులని భావించాను. సామాన్య మానవుడిగా భావించ లేకపోయాను. నాలో ఆశ చిగురించింది. జీవితం - అనుకోవి మలుపు తిరుగుతూందని ఆశించాను. కాని - ఆశలన్నీ మొదటి రాత్రే నాశనమయ్యాయి. ఐనా భ్రమలోనే మిగిలిపోయాను. పరిస్థితులతో రాజీపడటానికి - అంత త్యాగంచేశాక-కొంతకాలం పడుతుందని నా ఆత్రతను సరిపెట్టుకో జూశాను.

కాలం గడుస్తున్నా మీలో మార్పురాలేదు. పైగా వీలయి నంతవరకూ దూరం తొలగేవారు. నా నీడనే ద్వేషిస్తున్నట్లు కనిపించేవారు. క్రమక్రమంగా మీ పట్ల నాకూ తటస్థభావమే కలిగి పెరుగుతూండేది. చివరకు నిశ్చయించుకున్నాను - మనం భిన్నధ్రువాలలాగ మిగిలిపోవలసిందే అని. అప్పటినుంచీ నేను పశ్చాత్తాప పడసాగాను. నా జీవితంతోపాటు మీ జీవితమూ ఎడారి ఔతూందే అని. మీకు చాలా చెప్పాలనిపించేది. ఒక్క-సారి పరిస్థితి వివరించి మీ జీవితాన్ని మీ యిష్టం వచ్చినట్లు మలుచుకోమని చెప్పాలనిపించేది. కాని- మీరా అవకాశం యిచ్చే వారుకారు.

మరొక చేదునిజం కూడా ఆకళింపుకి వచ్చింది. మీరు ఉద్యోగం కోసం పెళ్ళిచేసుకున్నారు తప్ప — పెళ్ళి పెళ్ళికోసం కాదని. ఆ విషయం తెలిశాక మీరంటే గౌరవం తగ్గిపోయింది. మీ విలువ—నా దృష్టిలో నశించిపోయింది, క్షమించండి.

అప్పుడే నిశ్చయించుకున్నాను-మీ నుంచి తొలగిపోవాలని. నా జీవితానికి ధ్యేయమూలేదు. గమ్యమూలేదు. నే నెందుకు జీవించాలో నాకే తెలియని తనం. నన్నునేనే నిందించుకో వలసిన పరిస్థితి తెలిసో తెలియకో తప్పు జరిగింది. దానికి నా జీవితమే బలి అయింది.

మీరు - మరో ఉద్యోగం కోసం ప్రయత్నిస్తూ మద్రాసు వెళ్ళారని తెలిశాక - స్పష్టమైపోయింది. మీ రెలాగయినా నా పీడవదుల్చుకుని కొత్తజీవితం వెదుక్కుందుకు తాపత్రయ పడుతున్నారని. పరోక్షంగా మీరు నాకు ఉపకారమే చేశారు.

ఇప్పటికే - లోకం దృష్టిలో నేనెలా కనిపించినా - నా ముందు నేను దోషినికాను. అతన్ని ప్రేమించడం - నా నేరం కాదు. అదే సహజం. ఎటొచ్చీ దురదృష్టం ఏమిటంటే అతను ప్రమాదంలో మరణించి నన్ను ఒంటరిగా వదిలెయ్యడం. నా అంతరాత్మ పంచాయితీలో నేను నిర్దోషినే.

సహకరించడమే తప్ప ప్రాధేయపడటం నా తత్వం కాదు. నేను కన్నీటితో వేడుకుంటే మీరు మీ పాదాలచెంత యింత చోటిచ్చేవారేమో దయతలచి. కాని - నా కది చేతకాదు. చేత కాలేదు. ఆ మాటకొస్తే పృథివిలో నేరం చెయ్యనిదెవరు ? మేరీ మాగ్డోలిన్ కథ మీకు తెలుసనుకుంటాను.

ఇంకారాసి మిమ్మల్ని విసిగించదలచు కోలేదు. మీ పూర్తి స్వేచ్ఛకు నా అంగీకార పత్రం యిస్తున్నాను. మీరు నా మెడలో కట్టిన బలహీనమయిన తాళిని- ఉపయోగంలేదుకదా అని ఏనాడో తీసి మూలపారేశాను. మీ యిష్టాలకు నే నేవిధంగానూ అటంకం కానని చెప్పడానికే యీ పెద్ద ఉత్తరం -

నేను వెళ్తున్నాను. "రేఖ"

రేఖా! ... రెండు చేతులతోనూ తలపట్టుకున్నాడు ఆనంద్.

ఆలస్యం అమృతం విషం అన్నమాట నిజం చేశావు. నేను లేటయ్యాను. అందుకే ఎక్కవలసిన రైలు వెళ్లిపోయింది. లేట యింది - రైలుకాదు. నా జీవితం. మళ్లీనాకే రైలూ అందదు.

"బాబూ !... మీ కోసం - రంగనాథం గారు వచ్చారు..."

"ఎవరాయన ?"

"ప్లీడరుగారు–"

ఆయనకేం పని అనుకుంటూ డ్రాయింగ్ రూమ్‌లోకి నడిచాడు.

"మీకు నా హృదయపూర్వక సానుభూతి. శర్మగారింత అకస్మాత్తుగా మనందరికీ అన్యాయం చేస్తారనుకోలేదు."

మౌనంగా ఉండిపోయాడు ఆనంద్.

"ఇటువంటి సమయంలో కూడా మీకొక విషయం చెప్పవలసిన బాధ్యత నామీద ఉంది. అది నేను నిర్వర్తించుకుంటే....

"చెప్పండి —" అన్యమనస్కంగా అన్నాడు.

"శర్మగారు విల్లురాశాడు. ఆయన ఆస్తిపాస్తుల్లో సగం మీకే చెందుతాయి. అంటే సుమారు లక్షరూపాయలు...."

"సర్లెండి తరవాత మాట్లాడదాం, ఆ విషయాలు–"

"నేను వెళ్తాను. మీ మనసు విచారంలో ఉంది. మీరు కోరి ఏ క్షణంలో అయినా మీకు చెందవలసిన ఆస్తి మీకు సంక్రమిస్తుంది సర్వాధికారాలతోనూ–"

ఆనంద్ శర్మగారి గదినుంచి బాటిలుఒకటి తెచ్చుకున్నాడు. బంగారు రంగులోని ఆ ద్రవం అతన్ని తాగమని ఆరాట పెడుతూంది.

ఆ గదిలో చీకటిగా ఉంది. అతని హృదయంలోనూ చీకటిగానే ఉంది.

అతను ఒంటరి ఐపోయాడు. కిటికీ అవతల – సన్నగా చినుకులు ... తన హృదయం లాగ మబ్బులు ముసురుతున్న ఆకాశం.

ఇప్పుడు తను-లక్షాధికారి.

ఏంచేసుకోవాలన్నా సర్వస్వతంత్రుడు.

అన్నీ ఉన్నాయి. అనుభవించడానికి మాత్రం ఏదో అభ్యంతరం.

దీపం వేసుకోవాలనిలేదు. వెలుగుని చూడాలన్న ఉత్సాహం శూన్యం ఐపోయింది తనలో. ఆలోచనల నుంచి...వాస్తవం నుంచి ఈ ప్రపంచం నుంచి .. యీ చేదు విజాలనుంచి .... ఎక్కడికో.... భ్రమలోకి.... విషాలోకి...చీకటిలోకి .. ఒంటరితనంలోకి వెళ్ళిపోవాలని ఉంది.

తన నాపే వారెవరు?

తన దనుకునే-తను కావాలనుకునే ఒకేఒకవ్యక్తి అక్కయ్య కూడా యిప్పుడెక్కడో ఉంది. తన హృదయంమీద సానుభూతి వాక్యాల అమృతపుజల్లులు కురిపించేందు కయినా .... మమతతో తనని మరిపించడానికయినా ఆమె ఎక్కడో ఉంది.

మధువుతాగి-తనని తాను మరచిపోయే స్థితికి చేరుకోవాలని ఉంది.

విషాదపు నిషాముందు మధువు కలిగించే మైకం ఏపాటి?

దూరంనుంచి-ఎవరి రేడియోలోనో....శివరంజని!

వొంపులు తిరుగుతూ....విషాద రాగతరంగాలు .... తనని గించి వేస్తున్నాయి. తన హృదయం కరిగి నీరవుతూ ... తన

జీవితం ఆ చీకటిలోకి కరిగిపోతూ... యీ అనుభూతి ఏమిటి? ఈ మధురమయిన బాధఏమిటి? ఈ తీయని వ్యధఏమిటి? తనను- ఏమీ తెలియని తనంలోకి .... ప్రపంచాని కతీతంగా.... నిజానికి దూరంగా.... వేదనల స్వర్గంలోకి....

ఔను। అది శివరంజని। విషాద స్వరాల సంపుటి. తీయని బాధల రూపకల్పన.

(సమాప్తం)




# స్నేహ

సకుటుంబ మాసపత్రిక

...రంగంలో దూసుకు వచ్చిన కెరటం
స్త్రీ సంపదకిది నూతన చరకళం!!



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA133M124 |
| --- | --- |
| పుస్తకం పేరు | స్వాతి ముత్యాలు |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 1 1BG |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విభజించినది | thasin |
| తయిపినది | RUKSANA |
| పేజీ చేసినది | HASEEMA |
| పేజీలచురిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |